సాధన గ్రంథ మండలి, ౫౭.

# భారతీయ దర్శనము

## [ ప్రథమ ఖండము ]

### శ్రౌత, గీతాదర్శనములు

గ్రంథకర్త:
'సాహిత్యాచార్య'
శ్రీ బలదేవ ఉపాధ్యాయ, ఎం.ఏ. పి.హెచ్.డి.
వేదాంతోపన్యాసకులు, హిందూ విశ్వవిద్యాలయము, కాశీ.

అనువాదకులు:
'శ్రీరామశరణ్' కుందుర్తి వేంకటనరసయ్య
సంపాదకుఁడు: మోక్షసాధని.



ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి, తెనాలి.

సర్వహక్కులు
అనువాదకునివి



ప్రథమ ముద్రణ
జయ మార్గశిరము



మూల్యము
రు. 1—8—0



జానకీరాం ప్రెస్
తెనాలి.

# శ్రీ సూర్య స్తోత్రమ్

## శ్రీ మదాచార్యకృతమ్

ప్రాతః స్మరామి ఖలు తత్సవితుర్వరేణ్యం
రూపం హి మండలమృచోఽథ తనుర్యజూంషి,
సామాని యస్య కిరణాః ప్రభవాదిహేతుం
బ్రహ్మహారాత్మక మలక్ష్య మచింత్య రూపమ్.

ప్రాతర్నమామి తరణిం తనువాఙ్మనోభిః
బ్రహ్మేంద్రపూర్వకసురై ర్నుతమర్చితం చ,
వృష్టిప్రమోచన వినిగ్రహ హేతుభూతం
త్రైలోక్యపాలన పరం త్రిగుణాత్మకం చ.

ప్రాతర్భజామి సవితార మనంతశక్తిం
పాపౌఘ శత్రుభయరోగహరం పరం చ,
తం సర్వలోకకలనాత్మక కాలమూర్తిం
గోకంఠబంధన విమోచన మాదిదేవమ్.

శ్లోకత్రయ మిదం భానోః ప్రాతః కాలే పఠేత్తు యః,
స సర్వవ్యాధి నిర్ముక్తః పరం సుఖమవాప్నుయాత్.



# ఉపోద్ఘాతము

భారతదేశము మహాత్ములకు పుట్టినిల్లు. ప్రపంచములో భగవంతుని గనుగొనుట కెన్ని దర్శనములు కలవో, ఎన్ని విధములుగ భగవంతుని భజించుటకు వీలున్నదో అవన్నియు నిచ్చటనే యుద్భవించినవి. చివరకు మహమ్మదు, జీసస్ కూడ భారతదేశమునకు వచ్చి యోగాభ్యాసాదుల నభ్యసించి వెళ్లినట్లు చెప్పుచుందురు. దీనినిబట్టి అనేక కోట్ల సంవత్సరములనుండి మానవుఁ డెట్లు భగవంతుని జేరుదుమా యని ఋషులు ఆలోచించుచుండిరి. వారివారి బుద్ధివైశద్యమునుబట్టి సర్వవిధముల నాలోచించుటచే నానామతము లుద్భవించినవి. అయితే కొందఱు పాషండులు బయలుదేరి తమ మతమే గొప్పదని యితర విచారధారలను దూషించుచుందురు. అది తప్పు. అన్నిటియొక్క తత్త్వసారమును దెలిసికొని తన మార్గమున కవి యెట్లనుకూలములో యోచించుకొనవలెను. అది నిజమైన సాధకుని కర్తవ్యము. అనుభవజ్ఞుఁ డేమతమును ద్వేషింపఁడు. సమస్తావయవములుండిననే మానవుఁ డెట్లనిపించుకొనునో అట్లే సమస్తమార్గములుండిననే దర్శనమునకు సమగ్రత అబ్బును. వీటినన్నిటిని ప్రతివాఁడును దెలిసికొనవలెను. తెలియకున్న తన విచారధారలోఁ గూడ నిలువఁజాలకపోవును. ఇతరమతములను విమర్శించువారా మార్గమును సమగ్రముగఁ దెలిసికొనకయే విమర్శించుచుందురు.

ఆ లోటు తీరుటకు సమస్తమతములవారును, సంప్రదాయములవారును అన్నిమతముల సిద్ధాంతములను దెలిసికొనుట అవసరమను తలంపుతో నీ గ్రంథమును అనువదించితిని. ఈ గ్రంథమును రచించినవారు హిందూ విశ్వవిద్యాలయములో వేదాంతశాస్త్ర పండితులగు శ్రీబలదేవజీ ఉపాధ్యాయులవారు. వీరు సాహిత్యాచార్యులు, ఇంగ్లీషులో ఎం.ఏ. పి.హెచ్.డి. ఇంగ్లీషు, సంస్కృతము, హిందీ, పాళీ భాషలలో అఖండ పండితులు, విమర్శకులు. విజ్ఞానవేత్తలు, గొప్పకవులు. వీరికి నాకు కాశీలో పరిచయము కలిగినది. వీరి గ్రంథముల నన్నిటిని అనువదించుమని నాకాజ్ఞాపించిరి. ముందీ భారతీయదర్శనములో ప్రథమఖండము ననువదించితిని. కొంతభాగము 6, 7 సంవత్సరముల క్రిందట మా మోక్షసాధని పత్రికలోఁ బ్రచురించితిమి. ఆ యనువాదమును వారు కోరి తెప్పించుకొని అప్పట్లో హిందూ విశ్వవిద్యాలయమునకు వైస్ ఛాన్సెలరుగానున్న శ్రీ రాధకృష్ణపండితునకుఁ జూపించగా వారు మూలమునకు సరియైన అనువాదమనియు, తెలుగు నుడికారము గూడ సొంపుగా నున్నదనియు నుడివిరి. ప్రస్తుతము ప్రథమఖండమును సాధన గ్రంథ మండలి తరఫున ప్రచురించుచున్నాము. ఈ గ్రంథమును ప్రకటించుటలో సర్వవిధముల సహాకరించిన బ్రహ్మశ్రీ విద్వాన్ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారికి నా ధన్యవాదములు.

ఆంధ్రుల ఆదరణమునుబట్టి మిగిలిన భాగములను గూడ క్రమముగ బ్రచురింపఁగలము. ఈ గ్రంథములో ఉపోద్ఘాత రూప

ముసఁ జక్కని గ్రంథకర్తగారి సమీక్షయు, శ్రౌత, గీతాదర్శనములు ప్రచురింపఁబడుచున్నవి. రెండవఖండములో చార్వాక, జైన, బౌద్ధాది నాస్తిక దర్శనములును, మూడవ భాగములో షడ్దర్శనములును, నాల్గవభాగములో నితరదర్శనములు ప్రచురింపఁబడఁగలవు. సోదరులందఱు ఈ గ్రంథము నాదరింతురని ఆశించుచున్నాము.

ఇట్లు
శ్రీరామ పరిచరణుఁడు
శ్రీరామశరణ్
కుందుర్తి వేంకట నరసయ్య
సంపాదకుఁడు : మోక్షసాధని.

బుద్ధాం
యాజలి పోస్టు

—♦♦♦—

# మున్నుడి

మా గ్రంథమండలి నేడు 'భారతీయదర్శనము'ను వెలువరించి మీ కరకమలముల కందిచుచున్నందులకు ముదావహము. మండలి ఆర్థికముగ అనేక కష్టనష్టములకు లోనయ్యు, చేయుచున్న కృషి తమబోటి విజ్ఞులకు తెలియని విషయము గాదు. ఇట్టితరిలో గూడను మా యీ మహోన్నతకృషికి సర్వదా, సర్వథా సంపూర్ణ సహకారము జూపుచున్న జానకీరాం ప్రెస్ వారికెంతయు కృతజ్ఞత.

గత రెండు మూడు సంవత్సరములనుండి పారితోషికమీయవలసినవారిని గూర్చి, మండలియొక్క ఆర్థికస్థితినిగూర్చి పరిపరివిధముల ప్రార్థనలు సలిపినను యింతదనుక చందాలు పంపకుండుట శోచనీయము. కాన యీ 1954 సం॥ చందాతోబాటు గతబాకీనికూడా పంపి మండలికి ప్రాణదానముచేయ వేడికోలు. గ్రంథమండలియందు ఆదరాభిమానములు చూపుటకు వలనుపడనివారు ఆవిషయమైనను దయతో తెలిపిన పోస్టుఖర్చులైనను వృథగాకుండ యుండునని మా భావన.

ఈ "భారతీయ దర్శనము" నకు మూలకర్తలు శ్రీ బలదేవజీ ఉపాధ్యాయులవారు. అనువాదకులు శ్రీకందుర్తి వేంకట నరసయ్యగారు. వీరిని, ప్రత్యేకించి మీకు పరిచయముచేయ నవసరములేదు. ఈ గ్రంథమందలి సారాంశము అద్వైతసారము. రచన సరళము, మనోహరము. ఈ పొత్తమును మా గ్రంథమండలిచే ప్రకటింపజేయుచున్నందులకు మూలకర్తలకు, అనువాదకులకు మా మండలితరఫున అనేక నమస్సులు.

జయ, మార్గశిరము
తెనాలి

బులుసు సూర్యప్రకాశశాస్త్రి
సాధన గ్రంథమండలి, తెనాలి.

# విషయసూచీ

# భారతీయ దర్శనము

## ప్రథమ పరిచ్ఛేదము

పుణ్యదేశమగు నీ భారత దేశము ప్రకృతినటికి రమణీయ రంగస్థలముగనున్నది. ప్రకృతి దేవి తన కరకమలములతో నలంక రించి దీనిని శోభాగారముగ నొనర్చినది. దీని బాహ్యరూప మెంతటి మనోహరమైనది! ఉత్తరమున హిమాచ్ఛాదితము లగు హిమాలయములు వాటి యొక్క ఉత్తుంగ శిఖరశ్రేణులు బాహ్యప్రపంచమునకు భారతదేశము యొక్క ఆధ్యాత్మికోన్నతిని బరిచయము కావించుచున్నవా యనునట్లున్నవి. దక్షిణమున నీలాభమయమగు నీలాంబుధి తన చంచల తరంగములచే దీని చరణాయుగళములను బ్రక్షాళితము కావించి శోభావిస్తారము కావించుచున్నట్లుండెను. పశ్చిమమున నరేబియా సముద్రమును తూర్పున శ్యామల బంగాళాఖాతమును కలవు. మధ్యదేశమున బ్రవహించు విమల గంగాయమునా స్రవంతులు దీనిని సస్య శ్యామలము కావించుచున్నవి. భారత దేశము యొక్క యీ

బాహ్యస్వరూప మెంతటి భవ్యము మనోహరమో, దీని అంతర
రూపముకూడ అంతటి అభిరామము, ఆభామయమై యున్నది.
ఈ జగతీతలమున సభ్యతకు జనని యీ మన భారతదేశమే.
ఇతర దేశములన్నియు నజ్ఞానాంధకార గాఢ పటలమున సంఛ
న్నమై, యిప్పటికిని బర్బరతా జీవనమును వదలఁజాలకున్నవో
అట్టి సమయమున నీ భారత గగనమునందు ప్రథమ ప్రభాత
ముదయించెను; జ్ఞానసూర్యుని యొక్క ప్రకాశమాన కిరణములు
అవిద్యాతిమిర మండలమును ఛిన్నభిన్నము చేసివేసినది. పృథ్వీ
తలమున సభ్యతా విస్తారము చేయఁగల శ్రేయ మీదేశమునకే
ప్రాప్తించినది. "ఈ దేశములోని అగ్రజన్ము లగు బ్రాహ్మణుల
వలన పృథివీతలము నందలి సమస్త మానవులు తమతమ చరిత్ర
లను నేర్చుకొనిరి"; నిఖిల మానవ కల్యాణార్థము స్మృతి రచ
నము కావించిన మను మహర్షి యొక్క పూర్వోక్త (మ. స్మృ.
౨-౨౦) కథనము కట్టుకథ కాదు. అంతేకాక ఇది యితిహాస
మను నొరిపిడిరాయి మీఁద నొరిపిడి పెట్టఁగా నిది నితాంత
సత్యమని ఋజువైనది. ఈ కర్మభూమియందు జన్మించుటకై
భోగభూమి యగు స్వర్గాధివాసులగు దేవతలుకూడ అపేక్షించు
చుండుటయే గాక యిచ్చట నివసించువారలను భూరిభూరి
ప్రశంసించుచు తృప్తిజెందరు. * ఈ భారతవర్షము యొక్క

* శ్లో॥ అహో అమీషాం కిమకారి శోభనం
ప్రసన్న ఏషాం స్విదుత స్వయం హరిః ।
యైర్జన్మ లబ్ధం నృషు భారతాజిరే
ముకుంద సేవౌపయికీ స్పృహా హి నః॥
— శ్రీమద్భాగవతము స్కం. ౫-అ. ౧౯, శ్లో. ౨౨

వివిధ విద్యలలోఁ గేవల మొక అధ్యాత్మవిద్యామహాత్వము స్వరూపము, ఆవిర్భావము, వికాసము మొదలగు వివిధ ప్రవృత్తులయొక్క అధ్యయనము చేయుటకు ప్రయత్న మీ గ్రంథమున మనము చేయఁబోవు చున్నాము.

## ౧. 'దర్శనము' యొక్క అర్థము - ఉపయోగము

ఈప్రపంచమునకు వచ్చి జీవనసంగ్రామములో తనను విజయునిగాఁ జేసికొనుటకు ప్రతి మానవునకును కర్తవ్యమై యున్నది. అన్యజీవిత ప్రాణులకు వలె మానవుఁడు

ఉపయోగిత

కూడ తాను జీవించుచుండుటకు నిరంతరము సంఘర్షము పడుచుండును; ఒక్కొక్కప్పుడు ఆతఁడు తనకు విరుద్ధమగు పరిస్థితుల కొఱకు పోరాడుచుండును. ఒక్కొక్కప్పుడు తనను అణఁచివేయు శత్రువులతో సంఘర్షించు చుండును. అయితే భేదమేమి యనఁగా నితర జీవులేమియు విచారింపకయే కేవలము స్వాభావిక ప్రవృత్తికి వశీభూతములై జీవన సంగ్రామమునందు లగ్నమైయుండును. కాని మానవుఁడు వివేకప్రధాననుగు జీవి యగుటచే ప్రత్యేకానుష్ఠానావసరమునఁ దన విచారశక్తి నుపయోగించును. అయితే యిది ఆతనికి జ్ఞాపకముండుఁగాక ఉండకపోవుఁగాక ఆతఁడుపయోగించి తీరును. శాంతచిత్తముతో విచారముచేయఁగా మానవ జీవుఁడు దృశ్యాదృశ్య జగద్విషయికమగు కతిపయ శ్రద్ధా విచార, కల్పనల సముదాయము మాత్రమేనని తోఁచగలదు. మానవీయ నిఖిల కార్యవిధానముల కాధారశిల మానవీయ విచారములే. గీత (౧౭-౩) యందు చెప్పు

చున్నదో చూడుఁడు— 'యో యచ్ఛ్రద్ధః స ఏవ సః'. శ్రద్ధ కనురూపముగ మనుష్యుఁడగుచుండును, వాని కార్యప్రణాళిక నిశ్చిత మగుచుండును; దాని కనురూపముగనే వానికి ఫలము కూడ కలుగుచుండును. వానికి తెలియుఁగాక, తెలియకపోవుఁ గాక ఈవిధముగఁ బ్రతిమానవునకును 'దర్శనము' ఉండును. ఈవిధముగ దర్శనము మన జీవనములోఁ గూడ అనుస్యూతమై యుండును. మనము దానిని మన జీవనమునుండి వేఱు పఱుపఁ జాలము. ఒకవేళ నేవిధముగనైనను నెవఁడైన దానిని తీసి యావల పాఱవేయు దుఃసాహసము కావించునెడల నీజీవనము బుద్ధిజీవియగు చేతన ప్రాణి జీవనముగ నుండఁజాలదు. ఇది నైసర్గిక ప్రవృత్తులకు దాసభూతమగు పశుజీవనము కాఁగలదు. కావున పశువులతో సమానముగా అహార, నిద్రా, భయ, మైథునములందు సమానముగ నున్నప్పటికిని మానవులలోని విశేషమన్నిటికంటె కలది— ధర్మము=ధరింపఁబడు వస్తు సముదాయము, దానివివేకము దానివిచారము లేక దాని దర్శనము.

దర్శనముయొక్క అర్థము

దర్శన శబ్దము వ్యుత్పత్తిలభ్య అర్థము కలది. దృశ్యతే అనేన ఇతి దర్శనమ్ = దేనిద్వారా చూడఁబడునో ఏపదార్థము చూడఁబడునది? వస్తువుయొక్క సత్యభూతమగు తాత్త్వికస్వరూపము. మనమెవరు? ఎక్కడనుండి వచ్చితిమి? సర్వతో దృశ్యమానమగు నీ జగత్తునకు సత్యస్వరూప మేది? ఇది యెక్కడనుండి పుట్టినది? దీని సృష్టికి కారణమేది? అది చేతనమా? అచేతనమా? ఈప్రపంచములో మనకు కర్తవ్య కార్యమేద్ది? జీవనమును సుచారు రూప

మునఁ గడుపుట కే చక్కని సాధన మార్గము కలదు ? మొదలగు ప్రశ్నలకు సముచిత ప్రత్యుత్తరము నిచ్చుట దర్శనము యొక్క ప్రధానధ్యేయము. దర్శనమును శాస్త్రమందురు. శాస్త్రమున ర్థమేమి ? శాస్త్ర శబ్దోత్పత్తినిగూర్చి యొక ఆగమ గ్రంథమం దిట్లు చెప్పఁబడినది:—

శ్లో॥ శాసనాత్ శంసనాత్ శాస్త్రం శాస్త్రమిత్యభిధీయతే
శాసనం ద్వివిధం ప్రోక్తం శాస్త్రలక్షణ వేదిభిః ।
శంసనం భూతవస్త్వేకవిషయం న క్రియాపరమ్॥

'శాస్త్రము' యొక్క వ్యుత్పత్తి రెండు ధాతువులచే కలిగినది. శాస్=ఆజ్ఞాపించుట; శంస్=ప్రకట పఱచుట లేక వర్ణించుట. శాసనము చేయు శాస్త్రము విధిరూపము, నిషేధరూపమని రెండు విధములుగ నున్నది. శ్రుతి, స్మృతి ప్రతిపాదితములైన కార్యములు అనుష్ఠానముచేయ యోగ్యములైనవి. (విధి) అట్లే నిందిత కర్మకలాపములు సర్వథా హేయములు. (నిషేధములు) కావున శాసనార్థములో శాస్త్రశబ్దముయొక్క ప్రయోగము ధర్మశాస్త్రమునకై యుపయుక్తమైనది. శంసక శాస్త్రము లేక బోధక శాస్త్రము అనఁగా దేనిద్వారా వస్తువు యొక్క వాస్తవ స్వరూపము వర్ణింపఁబడునో అది. శంసక శాస్త్రముయొక్క అర్థమునందు శాస్త్రము యొక్క ప్రయోగము 'దర్శన' శబ్దమునకై వేయఁబడినది. ధర్మ శాస్త్ర కర్తవ్యాకర్తవ్యతా ప్రధానతావిధానముచే 'పురుషుఁడు పరతంత్రుఁడు' కాని దర్శనశాస్త్ర వస్తుస్వరూప ప్రతిపాదక మగుటచే 'వస్తుతంత్రము' గానున్నది.

పాశ్చాత్య విచారశాస్త్రమునకు సామాన్య సం — ఫిలాసఫీ. ఈ శబ్దము రెండు గ్రీకు శబ్ద సమ్మేళనము నేర్పడినది — ఫిలాస్ = ప్రేమము లేక అనురాగము, సోఫియా విద్యా. కావున నీ శబ్దము యొక్క అర్థము విద్యయందు ప్రేమ విద్యానురాగము. మొట్టమొదటగా నీ శబ్దము గ్రీకు దేశములో ప్రచలితమైనది. ప్రసిద్ధ ఐతిహాసికుడగు హిరోడోటస్ (విక్రమ ర్కునకు పూర్వము పంచమ శతాబ్దము వాడు) మొట్టమొ టగా క్రీసస్ ద్వారా దార్శనిక సోలన్ కొఱకు ఈ శబ్దప్రయోగమ నుల్లేఖించి యుండెను. పెరిక్లీజ్ యొక్క ప్రసిద్ధ వ్యాఖ్యానమంద ఏథెన్సు నివాసులను విద్యానురాగులని పిలుచుటకు థ్యూసిడ యిడ్స్ యీ శబ్దమును తర్వాత ప్రయోగించి యుండెను. సోక్ర

ఫిలాసఫీ శబ్దముతో పోలిక

టీసు ఆ కాలపు ప్రసిద్ధ, విజ్ఞానాది విషయ వ్యాఖ్యాతలగు సోఫిస్టు (జ్ఞానోపదేశకు) లతో తనను వేఱు జేసికొనుటకు తనను ఫిలాసఫర్ (జ్ఞానానురాగి = జ్ఞానప్రాప్తి కొఱకు ప్రయత్నశీలుడు) గ ప్పికొనెను. * సోక్రటీసు శిష్యుడు అఫ్లాతూ (ప్లేటో) శిష్యుడగు అరస్తూ (అరిస్టాటిల్) దీని ప్రచారమునే చేయ దు. సరిగదా పైగా దీనికి విభిన్న శిఖలపై ప్రామాణిక నిబంధ నములను నిర్మించి వీరు పాశ్చాత్య దర్శనములకు వాస్తవిక ప్రచారకులైరి. ఈ విధముగా 'ఫిలాసఫీ' కి వ్యుత్పత్త్యర్థము— విద్యయొక్క ప్రేమ లేక విద్యానురాగము. ఏ విద్వజ్జనులు

* 'ఫిలాసఫీ' ప్రయోగము కొఱకును, అర్థము కొఱకును కుల్పే — ఇంట్రొడక్షన్ టు ఫిలాసఫీ (ప్రథమ పరిచ్ఛేదము) చూడుడు.
Kulpe : Introduction to Philosophy.

జీవులు, జగత్తు, ఈశ్వరుఁడు, ధార్మిక సామాజిక తత్త్వములను నడబోయుటలోఁ బ్రయత్నశీలురగుదురో వారిని ఫిలాసఫర్ = విద్యానురాగు లందురు. ఈ మూలార్థముయొక్క అధికవ్యాపకతా కారణమున నేఁడు దీనిని సంకుచితార్థమునందుఁ బ్రయోగించు చున్నారు. మొట్టమొదట ఫిలాసఫీ యొక్క అంతర్గత విజ్ఞానములో కూడ వచ్చు చుండెడిది. కాని నేఁటి పాశ్చాత్య దేశములలో దర్శన, విజ్ఞానముల పార్థక్యము స్పష్టము చేయఁబడినది. ఈ జగతీతలమునఁ గల విభిన్న విషయముల యొక్క విశిష్ట అధ్యయనము, వర్ణనమును విజ్ఞాన మందురు. భౌతిక విజ్ఞానము, రసాయనము, జ్యోతిశ్శాస్త్రాదు లిట్టివి. కాని యీ విభిన్న విజ్ఞానములద్వారా ఉద్భావిత సత్యముల ఏకీకరణము ఫిలాసఫీ యొక్క విషయము. కావున బ్రహ్మాండ- జగత్, జీవుఁడు, ఈశ్వరుఁడు — వీటి విశిష్ట స్వరూపము యొక్క అధ్యయనము విజ్ఞానమందు, మఱియు సామాన్యరూపము యొక్క అధ్యయనము ఫిలాసఫీ యందు చేయఁ బడును. ఈ విధముగ సామాన్యముగ 'దర్శనము' నకు బదులుగ 'ఫిలాసఫీ' శబ్దప్రయోగము చేయఁబడఁ గలదు. కాని రెండింటి యొక్క ధ్యేయమునందు దృష్టిపాత మొనర్చుట యనుచితము కాఁగల నితాంత పార్థక్యము కలదు.

ఈ రెండు శబ్దముల యొక్క వ్యుత్పత్తి వ్యాఖ్యలు పైన ఈయఁబడినవి. దానివలన రెండింటి యొక్క యుద్దేశ్యము వెలుగుటచే పర్యాప్తమగు సూచన లభింపఁ గలదు. ఫిలాసఫీ కల్పనా కుశలులగు కోవిదులయొక్క మనోవినోద సాధనమాత్ర

మైనది. జగతీతలమున గల యపూర్వ, ఆశ్చర్యమయ వ
లను గాంచి వాని రహస్యములను దెలిసికొనుటకును, గా
మును శాంతింపఁ జేసికొనుటకును ఫిలా
దర్శన ఫిలాసఫీలలో నుద్దేశ్య విషయిక పార్థక్యము.
యుత్పత్తియైనదని చెప్పవచ్చును. ప్రతి
వును బరిశీలించుటలోనుఁ ఇష్టము వచ్చి
కల్పన చేయు మార్గము పాశ్చాత్య ద
జగత్తులో బాగుగాఁ గలదు. పాశ్చాత్య తత్త్వజ్ఞులు గమ్య
మును నిర్ధారణ చేసికొనకయే తమ నౌకను విచారసాగరమ
బడవేయుదురని యొక దార్శనిక విచారజ్ఞుఁడు చెప్పినది ని
తము ఔచిత్యపూర్ణముగఁ గనఁబడు చున్నది. నావ యే యొ
నకుఁ జేరినను లెక్కలేదు; అది ముఖ్యమైన ఘట్టమునకుఁ
కున్నను సంతోషమే. ఏ యొడ్డు పట్టుకొన్నను ఆనందమే.
భారతవర్షములోని దర్శనకారుఁడు దుఃఖత్రయ (ఆధ్యాత్మి
ఆధిభౌతిక, ఆధిదైవిక) ములచే రాత్రిం బవళ్లు విఘాతము
నుద్విగ్నుడై వీనిని ఆమూలము నుచ్ఛేదము కావించుటకు
తుఁడై సాధ్యనిశ్చయమును తన సూక్ష్మ వివేచనాశక్తి యా
రమున చేసియే సాధనమార్గ వ్యవస్థయందు ప్రవృత్తుఁ డగు
ప్రతి దర్శన కర్త యొక్క మార్గము గంతవ్యస్థానము యథ
ముగ వివేచితమై నిరిష్టమై యున్నది. ఆతనికి తన మార్గ
నుండి తొలఁగిపోవు భయముండఁ జాలదు. కావున భారతీ
దార్శనికుని దృష్టి పాశ్చాత్య దార్శనికుని కంటెఁ గొంతవఱ
అధిక వ్యావహారికముగను లోకోపకారిణిగను, సువ్యవస్థితముగ
సర్వాంగీణముగ నుండును.

భారతీయ దర్శనమును పాశ్చాత్య దర్శనముతో పోలనా త్మకముగ నధ్యయనము కావించుటకుఁ పాశ్చాత్య దర్శన [illegible] జ్ఞాన మవసరము. భిన్న భిన్న [illegible] దీనిని విభిన్నరీతులచేఁ జేసిరి; కాని నిష్కృ [illegible] శ్రేణీవిభాగమందు చాలమంది దార్శనికుల కొక మత మున్నది —

పాశ్చాత్య దర్శన శ్రేణీ విభాగము.

(౧) మెటఫిజిక్సు (తత్త్వమీమాంస) — [illegible] యొక్క వివేచ్యపదార్థము 'సత్'. ఈ ప్రపంచములో [illegible] స్వాయముగ జీవుల సమక్షమున సత్యమును [illegible] పదార్థములను బ్రదర్శించుచుండును. అందువలన '[illegible]' ను 'సత్'ను వేఱుచేయుటచే నీ దర్శన విభాగము [illegible] గము కలదు. రెండు విధములగు వస్తువులను [illegible] త్మక రూపముగ సత్యముగ భావించుట కవకాశము [illegible] — (౧) భౌతికపదార్థము (వృక్ష పర్వత నద్యాదులు) (౨) మానసిక స్థితి (సుఖ దుఃఖ ఔదాసీన్యాదులు). ఏ దార్శనికుల [illegible] భౌతిక పదార్థమే వాస్తవిక స్వతంత్ర సత్తాయో, మానసిక దశలు భౌతిక సత్యమునకాభాసమాత్రములో వారిని [illegible] లిట్సు లేక నేచురలిస్టు (భౌతికవాదు) లందురు. [illegible] దృష్టిలో సుఖదుఃఖాది మానసిక దశలను లేక మా[illegible] మాత్రము స్వతంత్ర సత్తాగా నున్నదో, [illegible] కేవలము మానస సత్తాకు ప్రతీతి మాత్రములై యున్న [illegible] ఐడియాలిస్టు (ప్రత్యక్షవాదు) లందురు. కొందఱు [illegible] భౌతిక మానస జగత్తుల రెంటిని నిరపేక్షముగను, [illegible]

ముగను అంగీకరింతురు. వారిని డ్యూఆలిస్టు (ద్వైతవాదు
లందురు. ప్రత్యయవాదమునకు వ్యతిరేక సిద్ధాంతమునకు రియ
లిజమ్ (వాస్తవికవాదము) అందురు. ఈమంతవ్యానుసారముగ
నీజగత్తులోని పదార్థములను మన మేరూపముతో నింద్రియము
లతోఁ జూచుచున్నామో ఆరూపముతో నవి సత్యములే.
వాస్తవ వాదము ప్రత్యక్షవాదము కంటె నధిక వైజ్ఞానికముగను
విషయ ప్రధానముగను నెన్నఁబడుచున్నది.

(౨) ఎపిస్టెమోలజీ (ప్రమాణమీమాంస)—దీనిలోని
విషయము జ్ఞాన వివేచనము. దీని కంతర్గతముగ ననేక మహత్వ
పూర్ణ విషయసమావేశము కావింపఁబడును. జ్ఞాన స్వరూపము,
జ్ఞానమునకు సీమ, జ్ఞాన ప్రామాణికత, సత్యాసత్య నిర్ణయాది
విషయములను గూర్చిన సమీక్ష యీదర్శనమునఁజేయఁబడును.
జ్ఞాన సీమతోఁ బాటుగా జ్ఞాన గమ్యత, జ్ఞానాతీతతలవిచార
కూడ సంవలితమై యుండును. కొన్నిపదార్థములు అనుభవ
ద్వారా అధిగమ్యములు, కాని కొన్ని అనుభవమునకతీతములు.
అను నీ రెంటియొక్క పృథక్కరణము నితాంతమావశ్యకము.
అనుభవము మీఁద నవలంబితమైన సత్తాగల పదార్థములను
ఎపోస్టిరియోరి (అనుభవజన్యము) అందురు. తమ సత్తాకొఱకు
అనుభవమునకు స్వతంత్రములైన పదార్థములను ఎప్రాయొరి
(అనుభవాజన్యము) అందురు. దీని విశదవ్యాఖ్య యీదర్శన
మునఁ జేయఁబడును.

(3) లాజిక్ (తర్కశాస్త్రము) దీని యుపయోగము
జ్ఞానముయొక్క వ్యావహారిక ప్రక్రియా వివేచనమందు చేయఁ

బడును. ఏదైన తర్కము సత్యము, ప్రామాణికము అగుటకు విశిష్ట నియమములను పాలన చేయుట నితాంతావశ్యకమై యున్నది. ఈ నియమములనుగూర్చిన యథార్థ విశద వర్ణనమీ లాజికు నందు చేయఁబడును. లాజిక్ కు రెండు విభాగములు కలవు— డిడక్టివ్ (నిగమన) సామాన్యముకంటె విశేషమైన దాని కనుసంధానము. (౨) ఇన్డక్టివ్ (ఆగమన) విశిష్ట దృష్టాంతముల నధ్యయనము కావించి సామాన్యసిద్ధాంతమును వెదకి పట్టు కొనుట. మొదటి దానిలోఁ గేవలము 'వైధిక సత్యము' ఆవశ్యక మగు చున్నది. కాని రెండవ విభాగములో వాస్తవిక 'భౌతిక సత్యము' కనఁబడును. ఈ మూఁడు విభాగములను సామాన్య ముగ థియొరిటికల్ ఫిలాసఫీ (కల్పనాత్మక దర్శనము) అందురు.

(౪) ఎథిక్సు (ఆచారమీమాంస లేక కర్తవ్యశాస్త్రము) ఆచార లేక కర్తవ్యమీమాంస ఈ దర్శనమునకు ప్రధాన విష యము. మానవుఁడు తన జీవితము నేల యుపయోగముగ నొనర్చుకొనవలెనను మహత్వపూర్ణమగు ప్రశ్న యొకటి కలదు. ఈ ప్రపంచములో రెండువిధములగు దృష్టికోణములతో దీనిని విచారింపవలయును. కొందఱు విద్వాంసుల దృష్టిలో మానవ జీవనము యొక్క స్థితి నిసర్గతః చెడ్డది. ఏకామనాసృష్టి ప్రకృతి సుఖోపలబ్ధికను నుద్దేశ్యములతోఁ గలదో అవి వాస్తవముగ దుఃఖోత్పాదకములే. కావున వాని నేవిధముగనైనను విశ్వసింప రాదు. ఈ జగత్తులో దుఃఖమొక్కటే వాస్తవిక సత్తా. కావున దీనివలనఁ జివరకు నిరాశోత్పత్తియే కలుగఁగలదు. ఈమతము నకుఁ బేరు పెసిమిజమ్ (నైరాశ్యవాదము). కాని అన్య దర్శన

ముల దృష్టిలో మానవజీవనము స్వభావతః శోభనక
దుఃఖమాపాతతః మాత్రమే కనఁబడుచుండును;
మానవ జీవనమును కతిపయ క్షణములపాటు మాత్రవే
తము కావింపఁ గలిగి యుండును, కాని చివరకు ఆనం
విజయము కలుగును; దుఃఖనాశమవశ్యంభావియై య
ఈమతమునకు ఆప్టిమిజమ్— ఆశావాదము అందురు.
నకు ధ్యేయమెద్ది? సుఖప్రాప్తి· లేక కల్యాణోపల
'కర్తవ్యము' అని దేనినందురు? అది యెన్ని విధ
కర్తవ్యాకర్తవ్య నిర్ణయ మే యాధారమునఁ జేయవలెన
ప్రశ్నలన్నిటికిని సముచిత వివేచన మీా ఎథిక్సు నందు
బడును.

(౫) ఎస్థేటిక్సు (సౌందర్యమీామాంస) గ్రీసుదేశపు
ప్రాచీన దార్శనికు లీ విషయమును గూర్చి స్వతంత్రరూ
వివేచన చేయలేదు, కాని ౧౮ వ శతాబ్దములో ఐరో
ములో నీ దర్శనమును గూర్చిన యన్వేషణము ప్రారంభమై
ఇప్పుడది విస్తృతరూపమున దృష్టిగోచరమగుచున్నది.
దార్శనికుఁడగు బావుమగార్టేన్ 'ఎస్థేటిక్సు' శబ్దమును ప్రథ
మున సౌందర్యశాస్త్రమను నర్థమునఁ బ్రయోగించెను. ఈ
మునకు స్వతంత్ర వివేచనము చేసిన భాగ్యమీాతనికే ప్రాప్త
నది. దీనికి ముఖ్యముగ రెండు విభాగములుకలవు. (౧) సౌం
నిర్ణయము— ఏదైన వస్తువును సుందరమనుటకుఁ గారణమే
'సుందరము' అనుదానికి తాత్త్విక వ్యాఖ్యానమేది? ఈ ప్ర
ములకు ఉచితమగు ప్రత్యుత్తర మీా విభాగమున లభించు

(౨) వ్యావహారిక సౌందర్యము — సౌందర్య కళారూపములో పరివర్తితమగు చుండును. దీనికి ప్రతి పాద్యవిషయము కళావివేచనము. చిత్రణీయ వస్తువునకు చిత్రమునకు ఏమి సంబంధము కలదు? కళాకారునిలో ప్రకృతి, కల్పన, స్మృతి మొదలగు నే గుణములుండుటచే సామాన్యవస్తువు కళారూపములో పరివర్తితమగు చుండును? వీటికి ప్రత్యుత్తరమీ భాగములో నీయఁబడును.

(౬) సైకాలజీ (మనోవిజ్ఞానము.) మనస్సు యొక్క వివిధ ప్రవృత్తుల శాస్త్రీయ వివేచనము. ఈ దర్శనము నేఁడు చాలమంది జిజ్ఞాసువులు 'విజ్ఞానము'న కంతర్గతమైనదని తలఁచు పక్షపాతు లగునంతటి యున్నతికి తెచ్చినది. నేఁటి కాలమున ప్రయోగశాలలందు ప్రయోగము (Experiment) ద్వారా మానసిక దశలకు శాస్త్రీయ, యథార్థ వ్యాఖ్యలు చేయఁబడు చున్నవి. డాక్టరు ఫ్రాయిడ్ అనునాయన తన మూలాన్వేషణ బలముచే మనోవిజ్ఞానమునకు నూతనాంగమగు— సైకో ఎనాలిసిస్ లేక మానసిక విశ్లేషణ — ను ప్రవర్తింపఁజేసెను. అతఁడు దార్శనిక జగత్తున కావల కూడ ఒక విశిష్ట క్రాంతి నుత్పన్నము కావించెను.

## ౨. భారతీయ దర్శనము యొక్క కతిపయ విశేషతలు

ప్రకృతి యీ భారతభూమిని మానవజీవనమునకు సమగ్రమగు ఆవశ్యక సామగ్రిని పరిపూర్ణము కావించి యీ దేశవాసుల నైహిక చింతనుండి నిర్ముక్తులను గావించి పారలౌకిక చింతనము వైపునకు స్వతః అగ్రసరుల కావించెను. ఈ దేశము

నైసర్గికముగ విచారప్రధానమగు దేశము. అన్యదేశముల
జీవన సంగ్రామము అతి భీషణకరమైనది. అచ్చటివారు నిత్యవ
హారిక జీవనములోని సమస్యల నుండి బయటపడుటకు
కాలము వ్యయపరచవలసినంతటి విధమున వానిలో ము
పోయి యుండిరి. జగత్తులోని మహత్త్వపూర్ణ తత్త్వ
నన్వేషించుటయు, యథార్థరూపమున విచారించుటయు
జీవితములకు ఆకస్మిక సంఘటనలు; కాని భారతదేశమున
కాదు. ముండకోపనిషత్తు బ్రహ్మవిద్యను సర్వవిద్యాప్ర
యని చెప్పినది. * శ్రీకృష్ణభగవానుడు గీతలో తన వ్యా
విభూతులను వర్ణించునెడ సమస్త విద్యలలో నధ్యాత్మ వి
(విచార శాస్త్రము లేక దర్శన శాస్త్రము) ను తన స్వరు
ముగఁజెప్పి ♦ దాని మహత్త్వమును బర్యాప్తరూపముగఁ ప్ర
ర్శించి యుండెను. అర్థశాస్త్ర నిర్మాతయగు కౌటిల్యు
‡ అన్వీక్షికీ విద్య అన్ని విద్యలకు దీపకమైనది; సమస్త కర్మా
ష్ఠానమునకు సాధనమార్గము, సమస్త ధర్మములకు ఆశ్రయవ
స్వతంత్రత విచారశాస్త్రమునకీ దేశములోఁ బ్రాప్తించిన
ఇంకే దేశములోను అట్టి స్వతంత్రత ప్రాప్తించలేదు. గ్రీసుదే
మత్యున్నత స్థితిలో నున్నప్పుడు ప్లేటో, అరిస్టాటిల్ మొదల

* స బ్రహ్మవిద్యాం సర్వ విద్యా ప్రతిష్ఠా మథర్వాయ జ్యేష్ఠపుత్రా
ప్రాహ. (౧-౧)

♦ అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ - గీత (౧౦-3

‡ ప్రదీపః సర్వవిద్యానాముపాయః సర్వకర్మణామ్ ।
ఆశ్రయః సర్వధర్మాణాం శశ్వదాన్వీక్షికీ మతా ॥

కౌటిల్య అర్థశాస్త్రము (౧-

వారున్న మహత్వపూర్ణకాలము నందుఁగూడ విచారశాస్త్రము రాజనీతి లేక ఆచారశాస్త్రమునకు సహాయకశాస్త్రరూపమున నధ్యయన విషయమై యుండెను; మాధ్యమిక కాలములో క్రైస్తవ ధర్మశాస్త్రముతోఁ గూడియు, పందొమ్మిదవ శతాబ్దమున రాజనీతి, ఇతిహాస, సమాజశాస్త్ర సంగముతో దీని తత్త్వాన్వేషణము కావింపఁబడినది. కాని భారతావనిలో దర్శన శాస్త్ర మెల్లప్పుడు తన కాళ్ళమీఁద నిలిచియే యుండెను. అధ్యయన స్వాతంత్ర్యము, మహత్త్వపూర్ణమగు విషయమున్నది. ఇంతేకాక సర్వదా అన్యవిద్యల ప్రగతియందు సహాత నొసంగుచు వచ్చినది.

దర్శనము - ధర్మము

భారతవర్షములో దర్శన శాస్త్రమునకు లోకప్రియత యున్నంతగా నితరదేశములలో వేటిలోను లేదు. పాశ్చాత్యదేశములలో దర్శనశాస్త్రము విద్వజ్జనమునకు మనోవినోదమునకు సాధనము మాత్రమే. అన్యవిషయముల నధ్యయనము చేయునపుడు వారెట్లు యిష్టము వచ్చినట్లు కల్పనచేయుచుందురో అట్లే యీ మహత్త్వపూర్ణమగు దాని స్థితికూడ, కాని భారతవర్షములో దర్శనమునకును ధర్మమునకును, తత్త్వజ్ఞానమునకును భారతీయ జీవనమునకును గాఢ సంబంధము కలదు. త్రివిధతాపములచే సంతప్తులగు జనుల నుద్ధరించుటకు, క్లేశమయ సంసారమునుండి ఆత్యంతిక దుఃఖనివృత్తి చెందుటకు భారతదేశములో దర్శనశాస్త్ర మావిర్భవించినది. విచార శాస్త్రము పండితుల కమనీయ కల్పనా విజృంభణ మాత్రమే కాదు; కాని దాని అధిరాజ్యమీ వ్యావహారిక జగతీతలమందు

కలదు. అన్య దేశములందు విచారశాస్త్రమునకు, ధర్మమునకు పారస్పరిక సంబంధము అభావముగ నుండును, కాని భారత దేశములో వీటి సంబాధము మిక్కిలి ఘనిష్ఠము. దర్శన శాస్త్రము ద్వారా సుచింతిత ఆధ్యాత్మిక సత్యముల మీఁదనే భారతీయ ధర్మముయొక్క దృఢప్రతిష్ఠ కలదు. విచారమెట్టిదో ఆచార మట్టిది. ధార్మికాచారము ద్వారా కార్యాన్వితులు కానిది దర్శన స్థితి నిష్ఫలము. దార్శనిక విచారముద్వారా పరిపుష్టము కాని ధర్మ మప్రతిష్ఠితము. ఈ రెండిఁటి యొక్క సామంజస్య మీ భారతవర్షములో దృష్టిగోచరమైనట్లు ఇంకొక దేశములో లేదు. పాశ్చాత్య విచార శాస్త్రమునకు చాల విషయములలో ప్రతిష్ఠాతయగు యునానీ (గ్రీసు) దార్శనిక అఫ్లాతూఁ (ప్లేటో) దర్శనము యొక్క యుద్గమము ఆశ్చర్య మున కలుగును అని చెప్పియుండెను. (Philosophy begins in wonder). ఆశ్చర్యజనక, కౌతుక జన్య ఘటన యను వ్యాఖ్య వలన విచారశాస్త్ర ముత్పన్న మగును; కాని భారతదేశములో దీని ఉత్పత్తి దుఃఖము యొక్క వ్యావహారిక సత్తా అను వ్యాఖ్య వలనను, దానిని నిరాకరించుటకు సాధనమార్గము యొక్క వివేచనచే కలుగును. భారతీయ జీవన ధర్మముల మీఁద నింతటి ప్రకృష్ట ప్రభావ ముత్పన్నము కావించుటచేతనే దర్శనమున కింతటిలోక ప్రియత్వము కలిగినది.

భారతీయ దర్శన ప్రవాహము అనాదియగు వైదిక కాలమునుఁడియు నవిచ్ఛిన్నరూపమునఁ బ్రవాహితమై వచ్చు చున్నది. ఈ ప్రవాహమునకు విరామము కనఁబడలేదు. ఇతర

అవిచ్ఛిన్నత

దేశపు దర్శనశాస్త్రములతోఁ బోల్చి చూచునెడల నీ విశేషత యొక్క మహత్త్వము పర్యాప్తరూపమున ననుభవమునకు రాఁగలదు. ఏ యితర దేశములోనైనను విచారధార యింతటి ప్రాచీన కాలమునుండి ప్రవహించు చున్నదా? ఆధునిక కాలమున మహత్త్వమును బొందుచుండిన పాశ్చాత్య దర్శనము తన జీవితములో నింతటి పవ్వుల వికాసమును బొందుటలో సమర్థమై యున్నదా? పాశ్చాత్య దర్శనము పుట్టినది విక్రమునకు పూర్వము 7 వ శతాబ్దములో, గ్రీసుదేశములో, కాని దాని ప్రవాహము ప్రవహించి ప్రవహించి ఆగిపోయినది; మరల నింకొక విశేష దార్శనికుఁడు పుట్టినా వాని ప్రభావమున నా విచారధార కొంచెము ముందుకు పోయెడిది. వాని ప్రభావమున్నంతవఱకు దీని ప్రవాహముకూడ సమీచీనముగఁ బ్రవహించును, కాని వాని ప్రభావము తగ్గిపోఁగానే యీ ప్రవాహము మరల నాగిపోవుచుండెడిది. ఈ విధముగ పాశ్చాత్య దర్శన ప్రవాహము ఒక్కొక్కప్పుడు కనఁబడి, మఱి యింకొకప్పుడదృశ్యమైపోవు నదివలె నుండెను. కాని భారతీయదర్శన ప్రవాహము అనేక నదములు విపులకాయము గల నదుల జలముచే పరిపుష్టిని బొందుచు శుష్కస్థానములను జలప్లావితము కావించుచు, క్షేత్రములను సస్యసంపన్నము కావించుచుఁ దన నిశ్చిత గంతవ్య స్థానము వైపునకు సమభావముతో సదైవ ప్రవహించు పుణ్యసలిలయగు గంగా ప్రవాహము వంటిది. ఇంత దీర్ఘకాల జీవితములో విభిన్న సభ్యతాభిమానులగు జాతులు, ధర్మాభిమానులగు పురుషులతో సంప

ర్కము కలిగినప్పటికిని భారతేతర విచారముల ప్రభావము
దర్శనమం దిసుమంతైనను పడఁజాలకుండెను. పైఁగా తన వి
లత, విశుద్ధతా కారణమున నిదియే యితర దర్శనముల
ప్రకృష్టప్రభావమును నెలకొల్పుటయందు విశేష సామర్థ్యము
బొందెను. ప్రాచీన గ్రీకు విచారమూర్ధన్యుఁడగు పైథాగ
యొక్క రేఖాగణితము, ధర్మము, దర్శనములకు సంబంధిం
సిద్ధాంతములమీఁద — విశేషముగ పునర్జన్మ, అహింస మొదల
వాటి మీఁద — భారతీయ దర్శన ప్రభావము పడినట్లు ఇతిహ
సాక్ష్యమున ప్రామాణికముగ గ్రహింపఁబడుచున్నది. * సూ
యందు వేదాంతము యొక్కయు, తంత్ర సిద్ధాంతము
యొక్కయు ప్రభావము విశేషరూపమునఁ బడినది. దా
శికోహ్ ఉపనిషత్తులను ఫారసీభాషలో ననువదించి వాటి సిద్ధా
తములను స్వధర్మావలంబులలో వ్యాపింపఁ జేయుటకు స్తు
ప్రయత్నము కావించెను. ఈ ఫారశీ భాషలో ననువదింపఁబ
ఉపనిషత్తులను లాటిన్ భాషలోని కనువదించుకొనిరి. వా
వలననే భారతీయ విచారముయొక్క శ్రేష్ఠత్వము సుందరత్వ
యొక్క పరిచయము మొట్టమొదటగ యూరపు దార్శనిక
కయ్యెను. ఈ యనువాదములను జదివి జర్మనీలోని సుప్రసి
దార్శనికుఁడు షోపెన్‌హోవర్ ఉపనిషత్తుల యొక్క సూక్తి
విచారముల మీఁద చాల సంతోషమును జెంది తన యొక
అనేక సిద్ధాంతముల స్ఫూర్తి యీ గ్రంథములవలన నైనవనియ
ఉపనిషత్తులు తన జీవితమునందు సంతోషమును ప్రసాదిం

*కీథ్ : రిలిజియన్ ఎండ్ ఫిలాసఫీ ఆఫ్ వేద్.

Kieth: Religion and the Philosophy of Veda. page 634-6

వనియు, తన మృత్యువునందుఁగూడ సంతోషము నీయఁగల వనియు నుదారమగు హృదయోద్గారమును బయట పెట్టెను. నేఁడు భారతీయ దర్శనమునకు సంబంధించిన మహత్త్వపూర్ణ గ్రంథముల నిప్పుడు ప్రపంచములోని సమస్త సభ్య భాషలు అనువాదము చేసికొనినవి, చేసికొనుచున్నవి. ఈ యనువాద ముల ద్వారా భారతదేశము యొక్క విచారశాస్త్రప్రభావము అలక్షితరూపమున ప్రపంచములోని ధర్మముల మీఁదను, దర్శన ముల మీఁదను పడినవి. ఈ విధముగ నితర విచారధారలచే ప్రభావితము కాకయే అన్యదర్శనములమీఁద తన ప్రభావమును జూపు విశేషత భారతీయ దర్శనమునకే దక్కినదని సూచించు చున్నది.

భారతీయ తత్త్వజ్ఞానము భారతీయ ధర్మమువలె నుదా రము, వ్యాపకము, విశాలము, వివేచనాత్మకముగ నున్నది.

**వివేచనాత్మకత**

పారంపరిక జనశ్రుతి భారమెన్నఁడును దీని యున్నతి మార్గమునకు వ్యాఘాతకముగ నుండలేదు. ఐహిక పారలౌకిక తత్త్వముల విశ్లేషణ కార్యములందు తార్కికబుద్ధి నుపయోగించుటలోనే దర్శనము యొక్క 'దర్శనత' కలదు; ధార్మిక పరంపర యీ నైసర్గిక కార్యమునందు వ్యాఘాతము నేర్పఱచో విచారవికాసము స్వాభావిక రూపమున ముందుకు పోలేదు. యూరపు యొక్క మాధ్యమిక కాలములో క్రైస్తవ మత సంప్రదాయము దర్శనము గొంతు పిసికి వేసెను. అది యా ధర్మము యొక్క అస్వాభావిక తర్కవిరుద్ధమగు సిద్ధాంత ములను పుష్టి యొనర్చుటయే తమ కర్తవ్యమునకు ఇతిశ్రీగా

భావించిరి. ఇంతకు మాధ్యమిక కాలమున యూరోపీయ తత్త్వ జ్ఞాన ప్రవాహ మాగిపోయినది. అది స్రోతోవిహీనమగు ధర్మ జలాశయము మీఁదనే తేలియాడుచుండెను. కాని పుణ్యమయ మగు నీ భారతదేశమునందు ఇట్టి విషమస్థితి యెన్నఁడును సంభ వింపలేదు. ఆరంభమునుండియు భారతీయ తత్త్వజ్ఞానము సమీ క్షాత్మకముగ నుండెను. తార్కిక బుద్ధి యను గీటురాయి మీఁద ధర్మము యొక్క మాననీయ సిద్ధాంతముల నొరిపిడి పెట్టుటకును, గుణదోషపరిశీలనము చేయుటకుఁగూడ అది యెన్నఁడును సంకో చింపలేదు. ఈశ్వరుని వంటి మహత్త్వపూర్ణ విషయముమీఁద కూడ అదితన స్వతంత్ర విచారమును బ్రకటించుటకుఁగూడ వెనుక కేమాత్రము తగ్గలేదు. సాంఖ్యము మాత్రము ఈశ్వరుఁ డున్నాఁడా లేఁడా యను విషయమున మౌనమును వహించు టయే శ్రేయస్కర మనుకొనెను. అయినప్పటికిని అది తార్కిక యుక్తులతో సిద్ధాంతము చేయఁబడఁజాలదనియే అది నిశ్చ యించెను. * యోగ మొక నిరతిశయ జ్ఞానసంపన్నమగు పరమ పురుషుని కల్పననంగీకరించెను, ♦ కాని నైయాయికులవలె వానిని జగత్కర్తగా నొప్పుకొనుట కుద్యమించదు. కర్మమీమాంస ఖండించుటకు పూర్వపక్ష రూపమున నీశ్వరుని తన గ్రంథములలో నుల్లేఖించును; ‡ ఏలననఁగా సమస్తమైన జగద్వ్యాపారమునకు

* ఈశ్వరాసిద్ధేః — సాంఖ్యసూత్రములు ౧-౯౨

♦ క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుష విశేష ఈశ్వరః — యోగసూత్రములు ౧-౨౪

‡ మానమేయోదయము (అడ్యార సంస్కరణము) పుట ౧౬౬-౧౭౧

అది కర్మకే సర్వప్రధాన స్థానమిచ్చు చున్నది. ప్రాచీన బౌద్ధులకు (హీనయాన మతావలంబులు) జైనులకు ఈ జగత్కార్యకలాప వ్యాఖ్య కొఱకు ఈశ్వరుని యెడల నిసుమంతైన పక్షపాతము లేదు. † భౌతికవాదులగు చార్వాకులు స్పష్ట శబ్దములతో నీశ్వరుని నిరాకరించెను, వైదిక విధి విధానములకు అస్వాభావికము, తర్కవిరోధి యగుటచే స్పష్టవాక్యములతో పరిహాసము చేసి బ్రాహ్మణ పురోహితులమీఁద తిట్లజడివానను గురిపించెను; కాని భారతీయ దర్శనశాస్త్రేతిహాసమున వేదానుయాయియగు నైయాయికునివలె వేదబాహ్యుఁడగు చార్వాకుఁ డంతటి మహత్వము కలిగియున్నాడు; నిరీశ్వరసాంఖ్యమునకు బ్రహ్మ ప్రతిపాదక వేదాంతమున కెంతటి మహత్వపూర్ణమగు స్థానముకలదో అంతటి స్థానమున్నది. ఈవిధముగ భారతీయతత్త్వజ్ఞానమునకుఁగల వ్యాపకత, ఉదారహృదయత, వివేచనాశక్తి ఆలోచకులదృష్టి నానందితము కావించును. అది అన్యదేశ తత్త్వజ్ఞానములో లభింపదు.

సర్వదా సత్యాన్వేషణము నెడల నితాంత శ్రద్ధాళుతయే యీ విశాలహృదయమునకు దాఖలా. భారతీయ దార్శనికులలో పారస్పరికముగ దృష్టికోణములో నెంతటి వ్యత్యాస మున్నను వారి యందఱును సమానముగ విశాలహృదయులు, వ్యాపకదృష్టి మైన నుండుఁగాక, వారు ప్రతిపక్షి యొక్క మతమునకు సముచితమగు ప్రత్యుత్తర మీయనిది స్వమతస్థాపనకుఁ బ్రయత్నింపఁడు. సామాన్యరీతిని ప్రతిపక్షి మతము ప్రతిపాదింపఁ బడును; దీనినే పూర్వపక్షమందురు. అనంతరము ప్రబల యుక్తులను బ్రయోగించి దానిని నిరాకరించుటకుఁ బ్రయత్నము

---

† ఈగ్రంథములోనే యీ దర్శనముల వర్ణనమును జూడుడు.

చేయఁబడును—ఇది ఖండనము. ఆతరువాత నీయుక్తుల యాధార మునఁ దన మతము ప్రమాణపురస్సరముగ నుపపాదింపఁబడును. దీనినే ఉత్తరపక్ష (తరువాతమత) మందురు. అనఁగా సిద్ధాంతము. ప్రతిపక్షి యెడల నీ శ్రద్ధాళు భావము వలన భారతీయ దర్శనము యొక్క భిన్న భిన్న సంప్రదాయములలో చమత్కారమగు సర్వాంగీణతా దర్శనము మనకుఁ గలుగును. వేదాంతములో నేదైనఁ బ్రామాణికపు గ్రంథమును దీసికొనుము. దానిలో నన్య మతములగు— బౌద్ధ, జైన, న్యాయ, వైశేషిక, సాంఖ్యాది సిద్ధాంతముల చర్చ పూర్వపక్షత్వేన అవశ్యము లభింపఁగలదు. ఏదైన నుచ్చకోటికి చేరిన జైన బౌద్ధ గ్రంథములందు ఇదేవిధ ముగా బ్రాహ్మణమత సమీక్ష ఆయా దృష్టికోణములతోఁ జేసి యుండవచ్చును. పాశ్చాత్య దర్శనములలో వివేచింపఁబడిన సిద్ధాంతములను గూర్చిన వివేచనను గూడ భారతీయ దర్శన ములో నెచ్చటనో ఒకచోట లభించవచ్చును.

భారతీయ తత్త్వజ్ఞానముయొక్క వ్యాపక దృష్టిని మేమిం కొకవిధముగ ప్రమాణితము కావింపఁ దలఁచుచున్నాము. 'సత్' అను దానిని వ్యాఖ్యానము చేయుమ నిచ్చట

**అనుభవము యొక్క పూర్ణ వ్యాఖ్యానము**

దార్శనికులు అనుభవగమ్య విషయము నైపు నకు అనుభవకర్త విషయము వైపున కంతటి ధ్యానముంచలేదు. తర్కబుద్ధిననుసరించుచు నాత్మను తుచ్ఛమగు అనాత్మనుండి వేఱుచేయుటయే దార్శనికుల ప్రధానకార్యము. ఈ ధముగా "ఆత్మానం విద్ధి"— ఆత్మను దెలిసికొనుము— అను ని భారతీయ దార్శనికులకు మూలమంత్రమైనది. కాని శుష్క

తార్కికయుక్తుల సహాయమున ఆత్మజ్ఞానము పరోక్షముకాక అపరోక్షము కావలయును. దీనికి భారతీయ మనోవిజ్ఞానము మానస ప్రక్రియయొక్క యథార్థనిరూపణను గావించెను. ఏ విధముగా నీదృశ్యమాన వివిధత్వము యొక్క అంతస్థలమందున్న యేకత్వమును బరిశీలించుటకు శిక్షణ నిచ్చు వేదాంతము సూక్ష్మ తాత్త్విక వివేచనము యొక్క పరాకాష్ఠను సూచించుచున్నదో, అట్లే విభిన్న మానసవృత్తులయొక్క సర్వాంగీణ నిరూపణము కావించి యోగ తత్త్వజ్ఞానము యొక్క వ్యావహారిక శిక్షణ నిచ్చుచున్నది. భారతీయ దర్శనమును గూర్చి ఆలోచించుట వలన రెండు సామాన్య సిద్ధాంతములు మనదృష్టికి గోచరించును. మొదటిది—నానాత్మక ప్రపంచముయొక్క పారమార్థిక యేకత్వము. ఇది తార్కిక సిద్ధాంతము—వేదాంతము. రెండవది ధ్యాన ధారణ సమాధి ద్వారా యీ యనుస్యూత ఐక్యమునకు మూలతత్త్వమగు ఆత్మయొక్క సాక్షాదనుభవము. ఇది వ్యావహారిక సిద్ధాంతము (యోగము). భిన్నభిన్న దర్శనములందుకూడ యీ సిద్ధాంతములయొక్క మాన్యత ఆంశికరూపేణ లేక పూర్ణరూపేణ అంగీకరింపఁబడినవి. మనోవైజ్ఞానికాధారముననే తత్త్వజ్ఞానము యొక్క విశాలదుర్గము నిర్మింపఁబడి యున్నది. మనోవిజ్ఞానము మూఁడవస్థ లుండునని చెప్పుచున్నది. జాగ్రత్, స్వప్న, సుషుప్తులు. వీటిని ఆశ్రయించుటచే చైతన్యము కూడ మూఁడు రకములుగ నగును. పాశ్చాత్య దర్శనము జాగ్రదవస్థ నెఱుఁగుట లోనే వ్యస్తమై యున్నది. జాగ్రదవస్థా వ్యాఖ్యానము చేయఁగా ద్వైతవాదము లేక బహుత్వవాదము (ప్లూరలిజమ్)ను సమ

ర్ధించు తత్త్వజ్ఞాన ముదయించును. స్వప్నావస్థవ్యాఖ్య విషయా ప్రధాన దర్శనమునకు జనని. సుషుప్తియొక్క మార్మిక నిరూపణ రహస్యవాదము (మిస్టిసిజమ్) నకు జనకుఁడగును. పాశ్చాత్య దర్శన మీ త్రివిధానుభవములకు ఒక అంశమాత్రపు వ్యాఖ్యానము చేయుటలోనే సంలగ్నమైనది, కాని భారతీయ దర్శనమొక్కటే యీ యనుభవములోని ప్రతి యంశమును గ్రహించి దానియొక్క యథార్థనిరూపణమును గావించుటకు సమర్థమైనది. కావున దీని వ్యాపకత, వివిధ రూపత, సమన్వయ క్షమత, ఉదారహృదయత సర్వతోభావేన ప్రమాణ ప్రతిపన్నమైనది. ఈ విశేషత దీని యొక్క అన్యసంకీర్ణ సిద్ధాంత దర్శనముల కంటె పార్థక్యమును జూపుటయందు పర్యాప్తమైనది. ఈ విధముగా భారతీయ దర్శనము యొక్క ప్రాచీనతను, స్వతంత్రతను, వ్యాపకతను, సర్వాంగీణతను గాంచి భారతీయ సభ్యతాధర్మముల నభిమానించువాఁ డెవఁడు హృదయానందముచే గద్గదికుఁడు కాఁడు? ఎవని మస్తకము గర్వముచే నున్నతము కాదు? ఎవని వాక్కు ప్రశంసచే ప్రవర్తితము కాదు?

## ౩. భారతీయ దర్శన లక్ష్యము

ఆర్యావర్తములోని ప్రాచీన తపోనిష్ఠులగు మహర్షులీ విశ్వరహస్యమును దెలిసికొనుటకు తమకుశాగ్రబుద్ధి బలమునఁ జేసిన ప్రయత్నము విచారశాస్త్రేతిహాసమున నత్యంత గౌరవ వస్తువుగ నున్నది. ఈ అనేకరూపాత్మకమై క్షణక్షణమున విలక్షణ రూపమును ధరించు పదార్థములయొక్క అంతస్తలమందుండు ఏక

రూపత్వము, అనేకరూపత్వమునకు మధ్య ఏకత్వము నన్వేషించి బయటకు లాగుటయే ప్రాచీనవైదిక ఋషులయొక్కయు; దర్శన శాస్త్రము యొక్కయు బహుమూల్యము, మహత్వపూర్ణమగు ప్రసాదము, పరివర్తనశీలమగు బ్రహ్మాండములోపల నొక యపరివర్తన శీలమగు తత్త్వమెట్లున్నదో, అట్లే ఈ పిండాండము (శరీరము) లోపలకూడ ఒక అపరివర్తనశీలమగు తత్త్వ మున్నది. బ్రహ్మాండ నియామక సత్తా పేరు బ్రహ్మ, పిండాండక నియామక సత్తా పేరు ఆత్మ, ప్రాచీనదార్శనికులు బ్రహ్మాండ పిండాండముల యొక్క ఐక్యమును సర్వతోభావేన అంగీకరించి, బ్రహ్మాత్మల కైక్యమును బ్రతిపాదించిరి. బ్రహ్మ అలభ్యము, అలౌకికము, అద్భుతము నగు పదార్థము కాదు; సరికదా ప్రతిప్రాణియుఁ దన లోపల నియామక (అంతర్యామి) ఆత్మరూపమున దానియొక్క సత్తాను అనుభవపూర్వకముగఁ దెలిసికొనుచున్నాఁడు. కావున బ్రహ్మను సాక్షాత్కారము చేసికొనుటకును, గుర్తించుటకును అన్నిటికంటె గొప్ప యుపాయము ఆత్మను గుర్తించుట, దానిని సాక్షాత్కారము కావించుకొనుట. జగత్తులోని సమస్త ప్రియ పదార్థములలో శ్రేష్ఠపదార్థము ఆత్మయే.

**ఆత్మయొక్క శ్రేష్ఠత్వము**

ఆత్మ యొక్క శ్రేష్ఠతను ప్రమాణితము కావింప వలసిన అవసరము కలదా? జీవితములోని సమస్త కార్యకలాపములందును దీని శక్తి పనిచేయుచుండుట కనఁబడుచునే యున్నది. ఎక్కడనుండి యైనను బ్రారంభింపుఁడు. చివరకు ఆత్మతోనే పర్యవసించును. శిక్షాలయములలోని ఛాత్రులెంతటి ప్రీతితో విద్యాధ్యయనము నందు

ప్రవృత్తులై నారు ? ఏ యుద్దేశ్యముతో ? జ్ఞానప్రాప్తిని బొందుట కొఱకు. జ్ఞానోపలబ్ధియొక్క ఫలము ధనము, ధనముచే కౌటుంబిక సుఖము, కౌటుంబిక సుఖముచే నంతిమ లాభము ఆత్మ సుఖము. ఎక్కడనుండి పరికించినను ప్రియపదార్థములను లెక్కించినచో నాత్మయే ప్రియతమముగ నున్నదని మేము చెప్పుచున్నాము. ఈ విశాల విశ్వవృత్తము యొక్క కేంద్రములో నున్నది — ఈ యాత్మయే. ప్రియతమ మగుటచేతనే పుత్ర వత్సలా కరుణామయి యగు తల్లికి వలె శ్రుతి ఆత్మతత్త్వమును సాక్షాత్కరింపఁ జేసికొనుము — 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః' అని చెప్పుచున్నది. ముక్తి విషయములో పర్యాప్తమగు మత భేద మున్నప్పటికిని విభిన్న దార్శనికు లీ విషయములో నితాంతము ఏకమతము కలవారే —'ఆత్మనః స్వరూపేణావస్థితిః మోక్షః'. అది బ్రహ్మకు భిన్నము కానిండు, అభిన్నము కానిండు ప్రతి దార్శనిక లక్ష్యము ఆత్మజ్ఞానము కలిగించుటయే.

యాజ్ఞవల్క్యుని ఉపదేశము

బృహదారణ్యకోపనిషత్తు (౨-౪) లోని యీ ఆఖ్యానము మిక్కిలి సుప్రసిద్ధమైనది— వృద్ధావస్థరాఁగా తన సంపత్తిని విభాగించి తన యిద్దరు భార్యలగు కాత్యాయనీ, మైత్రేయీలమధ్య నుంచెను. అప్పుడు విదుషీమణియగు మైత్రేయి అస్థిరమగు లౌకికసంపత్తిని గ్రహించుటకు చాల అనాస్థను గనుపఱచి 'ఈ సమస్త పృథివి నాకు సంపూర్ణ మగు ధనసంపత్తితో నుండుఁగాక, దాని వలన నా కమరత్వము కలుగునా ?' అని అడిగెను. 'బొత్తుగా కలుగదు' అని మహర్షి సమాధాన మిచ్చెను. 'నీజీవనము ఆనంద సామగ్రు లన్నియుఁ

గలిగిన మానవుని జీవనమువలె నుండును గాని కేవలము ధన ప్రాప్తిచే నమరత్వోపలబ్ధి కలుగునను నాశ యేమాత్రమును లేదు.' "అమృతత్వస్య తు నాశాస్తి విత్తేన" అప్పుడు మైత్రేయి మరల 'అమరత్వమును గలిగింపఁ జాలని ధనమును గైకొని నేనేమి చేయుదును?' అని అడిగెను. నాకు అమరత్వమును గూర్చిన తృష్ణ కలదు. అంత మహర్షి ఆమెను సంపత్తికి మించిన ప్రియతమ మగు వస్తువేదైనఁ గోరుకొనుమని యడిగెను. మైత్రేయి అట్టి వస్తువుల ననేకములగు వాటిని అడిగెను. ఆప్రత్యుత్తరమును విని యాజ్ఞవల్క్యుఁడు మైత్రేయికి చేసిన ఆధ్యాత్మిక జ్ఞానోపదేశము భారతీయ ధర్మదర్శనేతిహాసములందు సదా అమరముగ నుండఁ గలదు. ఆతఁడేమి చెప్పినాఁడో చూడుఁడు——'భర్తకై భర్త ప్రియుఁడైనవాఁడు కాఁడు కాని ఆత్మకొఱకు. భార్యకై భార్య ప్రియమైనది కాదు కాని ఆత్మకొఱకు. పుత్రునికై పుత్రుఁడు ప్రియుఁడగుట లేదు కాని ఆత్మకొఱకు. ప్రపంచములోని సమస్త వస్తువులును వాటికై అవి ప్రియములగుట లేదు కాని ఆత్మ కొఱకు. కావున నన్నిటికంటెఁ బ్రియమైన వస్తువు ఆత్మ. కావున నో మైత్రేయీ యీ యాత్మను బ్రత్యక్షము కావించుకొనవలయును, శ్రవణము చేయవలయును, మననము చేయవలయును, నిదిధ్యాసనము (సంతత ధ్యానము) చేయవలయును. ఏలననఁగా ఆత్మ దర్శనముచే, శ్రవణముచే, మననముచే, విజ్ఞానముచే నన్నియుఁ దెలియఁబడఁగలవు.'

'ఆత్మావా అరే ద్రష్టవ్యః, శ్రోతవ్యో, మంతవ్యో, నిదిధ్యాసితవ్యః.'

'ఆత్మన్నో వా అరే దర్శనేన, శ్రవణేన, మత్యా, విజ్ఞానేనేదం సర్వం విజ్ఞాతం భవతి.' (బృహ - ఉప - ౨-౪-౫)

యాజ్ఞవల్క్య మహర్షియొక్క యీ యుపదేశము భారతీయ దర్శనమునకును, ధర్మమునకును మూలభిత్తియైయున్నది. మానవ జీవితమునకుఁ జరమలక్ష్యము ఆత్మ సాక్షాత్కారము; ఆత్మయొక్క సాక్షాదనుభవము. ఈ యనుభవప్రాప్తి కొఱకు ఉపనిషత్తు త్రివిధ సాధనముల నుపదేశించు చున్నది—శ్రవణము, మననము, నిది ధ్యాసనము. ఆత్మతత్త్వమును శ్రుతివాక్యములచే శ్రవణము చేయవలయును. తార్కిక యుక్తులచే మననము చేయవలయును. యోగప్రతిపాదితమగు నుపాయముల ద్వారా నిదిధ్యాసనము కావింపవలయును.

శ్లో. శ్రోతవ్యః శ్రుతివాక్యేభ్యో, మంతవ్యశ్చోపపత్తిభిః,
మత్వా తు సతతం ధ్యేయః, ఏతే దర్శన హేతవః.

శ్రవణము:- ఆత్మయొక్క సత్యస్వరూపజ్ఞానము ఆత్మనిష్ఠ బ్రహ్మవేత్తలయొక్క సాక్షాదనుభవ సంకలనమగు గ్రంథముల వలననే మనకుఁ బ్రాప్తింప వలయును.

ఆత్మ సాధనకు త్రివిధ సాధనలు

భారతీయ సాహిత్యమునంటిట్టి గ్రంథరత్నము వేదము. సాక్షాత్కృతధర్మ మహర్షుల ప్రతిభాచక్షుస్సుద్వారా అపరోక్షరూపమున అనుభూత అధ్యాత్మ తత్త్వరాశికి యింకొక పేరు శ్రుతి. కావున భారతీయ దర్శనమునందు వేదముల కింతటి మహత్వమున్నది. ఏలననఁగా స్వానుభూతిలేక పరానుభూతి ద్వారా కలిగిన అధ్యాత్మరహస్యములయొక్క

వర్ణనవాక్యములు మనకు సర్వాత్మనా మాన్యములు కావు. అందుకనియే మహర్షులయొక్క స్వానుభూతిని ప్రదర్శించు శ్రుతి తత్త్వములు యథార్థ స్వరూపమును ప్రకటించుటలో నన్నిటి కంటె నధిక ప్రమాణముగ నెన్నఁబడుచున్నవి. *కావున ఆత్మ తత్త్వవిచారమునకు శ్రుతి భగవతిని శరణు బొందుట పరమా వశ్యకము.

మననము:— ఆత్మానుభవమునకు రెండవ సాధనము మననము. మననము యుక్తులసహాయమునఁ జేయవలయును. వేదమునందు ప్రతిపాదింపఁబడిన సిద్ధాంతములు నిస్సందిగ్ధములు. సంశయమునకు వానిలో స్థానము లేదు. అయినప్పటికిని మననము అనావశ్యకమగు సాధనము కాదు. ఏదైన వస్తు స్వరూప విష యమున వాస్తవిక సంశయముతో సమానముగా కాల్పనిక సందేహనిరాకరణమందు తర్కమే మిక్కిలిసమర్థమైనది. తర్కము నుపయోగింపక యేవస్తుస్వరూపమునైనను హృదయంగమము కావించుకొనఁ జాలము. పరానుభూతిని స్వానుభూతియందు పరిణతము కావించుటకు ప్రధానమగునుపాయము నిస్సందిగ్ధ జ్ఞానము. ఈ జ్ఞానమొక్కటియే యుపయోగకరమైన దగుటచే మననము నేవిధముగనైనను అవహేళనము చేయరాదు. ఈ మననరూపమగు ద్వితీయ సాధనము పరమోపయోగకరమైన దగుటచే దర్శనములకు వాస్తవిక మూల్యముకలదు. దర్శనములు ఈ ప్రమేయసిద్ధినే లక్ష్యముగఁ బెట్టుకొని స్వమతానుసార ప్రమా ణములను, వాని పద్ధతి యొక్క వివేచనము గొప్పశాస్త్రీయ

* ధర్మం జిజ్ఞాస మానానాం ప్రమాణం పరమం శ్రుతిః — మను. ౨_౧౩

పద్ధతిని చేయఁబడినది. ప్రమాణముల వాస్తవిక ఉపయోగము ప్రమేయ సిద్ధిలోనే కలదు. "ప్రమేయ సిద్ధిః ప్రమాణాద్ధి" (సాంఖ్యకారికా కారికా. ౪) కావునసే మననోపయోగమగు దర్శనములు ప్రమాణ మీమాంస కెంతేని యధిక మహత్త్వ మిచ్చినవి.

నిదిధ్యాసనము:- ఆత్మసాధనకు తృతీయ సాధనము నిదిధ్యాసనము. యోగదర్శనమందు ఈ సాధనము ప్రధానముగ వర్ణింపఁబడినది, వివేచింపఁబడినది. 'అష్టాంగయోగము' నిదిధ్యాసనమున కుపాయమే. ధ్యానము ద్వారా ఆత్మయొక్క స్వానుభవము కలుగనంత వఱకు పరానుభూతిని నిరంతరము శ్రవణ మననములఁ గావించుటచే నేమిప్రయోజనము? దిక్కాలముల కనవచ్ఛిన్న, శాంత, తేజః స్వరూప పరమాత్మ సత్తాకు ప్రధానమానము—స్వానుభూతి, అనఁగాఁ దనకు తనయనుభవము. కావున భర్తృహరి బ్రహ్మను గూర్చి 'స్వానుభూత్యేకమాన' అని చెప్పినాఁడు.* ధ్యానమే దీనికి ముఖ్యసాధనము. విపక్షీయుల అతాత్త్విక విచారములను సంతతము శ్రవణము చేయుటచే మన హృదయములలో శాశ్వత తథ్యముల విషయములో భ్రాంతు లుత్పన్న మగును. మననము ద్వారా ప్రతిష్ఠిత సిద్ధాంతములను నిరంతరము చింతనము చేయుటచే నివి తొలఁగిపోవును. ఈ భ్రాంతులను తన హృదయము నుండి నాశము కావింపనిది

* శ్లో॥ దిక్కాలాద్యనవచ్ఛిన్నా నంత చిన్మాత్ర మూర్తయే,
స్వానుభూత్యేకమానాయ నమః శాంతాయ తేజసే.

— భర్తృహరి. నీతి శతకము. శ్లో. ౧.

సత్య సిద్ధాంతముల కల్పన బద్ధమూలము కాఁజాలదు. కావున దిధ్యాసనము ఆత్మసాధనమున కంతిమోపాయమని చెప్పఁబడినది.

ఆత్మసాధనకీ త్రివిధ సాధనములలో కేంద్రభూతమగు ఉపాయము — మననము — యొక్క నిరూపణము భారతీయ దర్శనముల సహాయమునఁ జేయఁ బడ వచ్చును. కావున దర్శనముతో భారతీయ ధర్మమునకు నితాంతఘనిష్ఠ సంబంధము గలదు. ఇవి ఒకటొకటికి పరస్పర ముపకారకములు. ధర్మము యొక్క సహాయోగముచే భారతీయ విచారశాస్త్ర జీవనము గాఁద వ్యాపకదృష్టి ఆధ్యాత్మికతచే ననుప్రాణితమైనది. దర్శనము యొక్క ఆధారశిల (పునాది) మీఁదఁ బ్రతిష్ఠింపఁబడియుండుటచే భారతీయధర్మము తర్కవిరోధ మగు సిద్ధాంతమును బ్రతిపాదించును. ఈ విధముగ నీ పుణ్యభూమియగు భారతవర్షమందు గంగా యమునా సంగమమువలె ధర్మదర్శనముల రెంటియొక్క మధుర సమ్మేళనము భారతీయ సంస్కృతికి పరమ సామంజస్య సూచకము. కొన్ని సిద్ధాంతములందు పార్థక్యమున్నప్పటికిని మననాత్మక మగుటచే నీ దర్శనముల కైక్యభావము సూక్ష్మదృష్టి కల విచారకుల సమక్షమున నపరోక్షము గాదు. ఈ సమానతలను గూర్చిన వర్ణనము యథాస్థానమున నందు ముందు చేయఁబడును.

## ౪. భారతీయ దర్శనముపై మిథ్యారోపము.

మన దేశముయొక్క వర్తమాన అవనతదశకు నాల్గు ముఖ్యటి బిందువులను గూర్చు ఆలోచకుల యొక్క సర్వమాన్య

నైరాశ్యవాదము

నిశ్చయము, భారతీయ దర్శనము యొక్క సార్వత్రిక ప్రచారమువలనను, లోకప్రియమైన దను కారణమువలనను భారతదేశములో, అకర్మణ్యతారాజ్యము వ్యాపించినదనియు; భారతదేశాధివాసుల మనుమయ స్వప్నములలోనే గట్టి జాగ్రజ్జగత్తులోని వస్తువుల యెడలను, జీవితఘటనల యెడలను నితాంతముదాసీనులై వ్యస్తులై యున్నారనియు, భారతదేశములోని యీ హీనావస్థ యీ విచార పరంపరాజన్య అకర్మణ్యత యొక్క యుజ్జ్వల పరిణామమే నందురు. భారతీయ దర్శనమునకు నైరాశ్యవాద (పెసిమిజమ్) ప్రచారకమైనదను బిరుదు నిచ్చి యున్నారు. కాని దర్శనము యొక్క తాత్త్విక సమీక్ష చేసిన తర్వాత నీ యారోపణ క్షణమాత్రమైన నిలువఁ గలదా? నైరాశ్య వాదము యొక్క ధూమరేఖ భారతీయ దర్శన ప్రాంజల నభోమండలమును కలుషితము కావించుచు ఆపాతతః అవశ్యము దృష్టిగోచర మగుచుండును; కాని వాస్తవమున కా రేఖ కొన్ని క్షణములు మాత్రమే నిలువఁ గలదు. ఆ గగనమండలముపై బాగుగా దృష్టిపాతము కావించిన యెడల నిశ్చయముగ నా క్షణికరేఖ దాని నధికప్రభాభాసురముగ నొనర్చి శాశ్వతముగ విలుప్తమై పోఁగలదని నిశ్చయముగఁ దోఁచఁ గలదు. వర్తమానమున నసంతోషము చెందనిది మనోరమ భవిష్యత్కల్పన మానవహృదయమం దెన్నటికిని జాగృతి చెందదు. వర్తమానమున నసంతుష్టతను జెందుటచే భారతీయ దర్శనము మీఁద నిరాశావాదులను మిథ్యారోపము చేయు నందురు; అయితే దర్శనమాత్రముచే నిరాశావాదిగ సిద్ధాంత

ంగుచున్నది. ఈ భవసాగరమునందు క్లేశతరంగములచే దెబ్బల ను జీవి యడుగడుగునకు విపత్తు లాక్రమించుటచే విదళితుఁడై న జీవితమును నిరాశామయముగ భావించి దానినుండి బయట డుటకు వివిధోపాయముల నన్వేషించు చుండును. ఈ దుఃఖ ంయవిఘాతకారణముననే యుత్పన్నమైన జిజ్ఞాస భారతీయ ర్శనమునకు ఉద్గమ భూమి. భారత తత్త్వజ్ఞానమీ దుఃఖ హుళమగు వర్తమాన జగత్తు యొక్క వాస్తవికస్వరూపమును తెలిసికొనుటకును, దీనినుండి యుద్ధారమునుబొందు ఉపాయము ను నిరూపించుటకును తన సర్వశక్తులను ఖర్చుపెట్టును. దాని లన నిరాశామయమగు జగత్తునందు ఆశాసంచారము కలుగఁ బారంభించును. అప్పుడు క్లేశప్రవాహము ఆనందప్రవాహముగఁ రివర్తిత మగును. ఇట్టి యాదర్శము నంగీకరించు దర్శనమును రాశావాది యెట్లంగీకరింపఁ గలఁడు ?

అకర్మణ్యతా దోషారోపణము కూడ అదే విధముగ స్సారము, భ్రాంతము, అజ్ఞాన మూలకమైనది. భారతీయ దర్శనము కర్మవాద సిద్ధాంతము నొప్పుకొనును.

కర్మణ్యత

ప్రాణుల జీవితములపై నాతఁడు చేసిన కర్మల యొక్క ప్రకృష్ట ప్రభావము పడును. శుభకర్మల ఫలము శుభ రిణామదాయక మగును, అశుభకర్మ పర్యవసానము క్లేశ దుఃఖములం దుండును. ఇట్టి వస్తుస్థితి కలుగఁగా దుఃఖద వర్త మానమును సుఖమయ భవిష్యత్తులోనికి పరివర్తింపఁగలనను ఆశ నెందు భారతీయ తత్త్వజ్ఞానము జీవులకు అకర్మణ్యతా కుశిక్షణ నేల యొసంగును. దీనికి కారణమేమో మనస్సునకు వచ్చుట

లేదు. సాధారణ మానవుల సంగతి యట్లుంచుడు, శిక్షిత సమాజములోఁగూడ, మాయా వాదమగు వేదాంతము ఈ జగత్తును మాయికముగను, అసత్యముగను చెప్పినదనియు, దీనినుండి దూరముగఁ బోయి యుండుటయే జీవనమున కంతిమ లక్ష్యమని తలఁచినారను అభిప్రాయము ప్రేక్షకతోఁగూడ నాటుకొనినది. కాని యీ యభిప్రాయము పూర్తిగ భ్రాంతి మూలకము. శ్రీశంకరాచార్యులవారు ఉపనిషత్తులయొక్క మహత్త్వపూర్ణమగు నుపదేశములను 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః' ఈ శ్లోకాంశమునందు సిద్ధపము కావించి జగత్తుయొక్క మిథ్యాత్వ శిక్షణ నిచ్చినప్పుడు ఆయన ధ్యానమీ సుశిక్షయొక్క కుత్సిత వ్యాఖ్యానము నైపునకు బహుశః పోయి యుండ వచ్చును. త్రికాలాబాధితమగు బ్రహ్మతోఁ బోల్చినప్పుడే జగత్తుయొక్క పారమార్థిక సత్యతయందు విరోధము గోచరించును. కావున పారమార్థిక దృష్టితోఁ జూచిన జగత్తును మిథ్యగా నొప్పుకొన్నను వ్యావహారిక దశలో దాని సత్యత ప్రమాణ ప్రతిపన్నముగ నున్నది. ఏ జగత్తులో జీవుఁడు పుట్టుచున్నాఁడో, ప్రకృతి ననుసరించి భిన్నప్రకారములగు కర్మలను జేయుచున్నారో చివరకు చచ్చుచున్నారో వ్యవహారమునకు నితాంత సత్యభూతమగు నీగట్టిప్రపంచము యొక్క అసత్యత నేదార్శనికుఁ డంగీకరింపఁగలఁడు ? మాయావాదియగు శంకరాచార్యులవారి జీవిత చరిత్రయే యీ యాపోపమును నిరాకరించుటకు పర్యాప్త సాధనము. ముప్పదిరెండు సంవత్సరముల చిన్నతనములోనే యీ పరమ మేధావియగు దార్శనిక శిరోమణి తనకు నాల్గురెట్ల

వయస్సు గలిగిన విద్వాంసులలో లేని శక్తిని గనపఱచి యాకార్య మును జేసి చూపించెను. పదునాఱవయేట విచారప్రధానము లగు అమర భాష్యగ్రంథములను రచించుటయును, వాటి సహా యతచే నీ విశాల భారత దేశముయొక్క కోణకోణములందు వైదిక ధర్మ పునరుత్థానము కొఱకు మఠములను స్థాపించుటయు, ధర్మమును జాగ్రతగా నుంచుటకు నివృత్తి ప్రధానమగు సన్న్యాస సంప్రదాయ ప్రతిష్ఠను జేయుటయు, వేద బాహ్యులగు బౌద్ధుల నోడించి యీ భూభాగమునుండి చాలవఱకు బయట నడిపించు టయు— ఇది సామాన్యకార్యము కాదు. నితాంత కర్మపరాయ ణుఁడైనవాఁడు మాత్రమే యిట్టి కార్యము లట్లు సముచిత రీతిని సంపన్నము కావింపఁగలఁడు. కావున శ్రీ శంకరాచార్యులవారి యీ కర్మరతయు, ఈ యలౌకిక కార్య కుశలతయు నాతని శిక్షణ ములపైన భాష్యరూపములైనవి. మాయావాద ప్రచారకుఁడై నప్పటికిని శంకరుని వంటి కర్మఠ విద్వాంసులు ఈ భారత భూమి యందు చాల అరుదుగఁ బుట్టుచుందురు.

భారతీయ తత్త్వజ్ఞానము తన సిద్ధాంతములను శ్రుతులను నొరిపిడిరాయిమీఁద రుద్దియే వాటిని విశుద్ధములుగను, సత్యము గను, ప్రమాణికములుగను భావించుచుందురు.

శ్రుతి-తర్కము

తర్కబుద్ధిచే విచారించిన తత్త్వములను ప్రామా ణికత శ్రుతికి విరుద్ధము కాకున్ననే స్వీకరింపఁబడును. శ్రుతి యెడల నిట్టి సమాదర బుద్ధి యుండుటచే ప్రతారితాలోచకులు భారతీయ దర్శన శాస్త్రమును అంధవిశ్వాసముతోఁ గూడిన దనియు, యుక్తి నిరపేక్ష సిద్ధాంతములను బ్రతిపాదించు (Dog-

matic) నదనియుఁ బల్కుచుందురు; కాని యీ యూహాయు నితరయూహలవలె సారహీనమైనది. తర్కమున కంతు లేదు. అతి అప్రతిష్ఠితమైనది. తర్కముచే నిశ్చయమైన సిద్ధాంతములను ఇతర ప్రబలతరతర్కములద్వారా ఖండింపవచ్చును. కావునఁ గేవలము తర్కము నాశ్రయించి నిశ్చిత సిద్ధాంతము లొనర్చుట పూర్ణముగ భ్రమాత్మకమే కాఁగలదు. ఋషులచేఁ బ్రాతిభ చక్షువు ద్వారా సాక్షాత్కరించుకొనిన అపరోక్షదృష్ట తథ్యరాశి యొక్క మఱియొకపేరు శ్రుతి లేక వేదము.* వేదమునకు పరమ మేధావులగు శంకర రామానుజులవంటి విచారకులు కూడ నతమస్తకులు కావలసినదే. కావున వేదమునాశ్రయించుట భారతీయ తత్త్వజ్ఞానమునకు అంధవిశ్వాస సూచకము కాకపోఁగా ఋషుల ద్వారమున అనుభూత అపరోక్ష జ్ఞానమును సాయముగొనుటయే. కావుననే వాక్యపదీయకారుఁడగు భర్తృహరి ఆగమము నెక్కుడుగఁ బ్రశంసించెను. ఆతఁ డిట్లనెను♦ — వివిధ ఆగమదర్శనముల సహాయముచేఁ బ్రజ్ఞావివేకములను, సదసత్తులను, సారాస్సారములను వివేచించు శక్తిని బొందవచ్చును. తన తర్కమునే అనుసరిం

---

* శ్లో॥ ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే
ఏతం విదంతి వేదేన తస్మాద్వేదస్య వేదతా.
— సాయణాచార్య (తైత్తి-భాష్యభూమిక)

♦ శ్లో॥ ప్రజ్ఞా వివేకం లభతే భిన్నైరాగమ దర్శనైః
కియద్వా శక్యమున్నేతుం స్వతర్క మనుధావతా ।
తత్త దుత్ప్రేక్షమాణానాం పురాణై రాగమై ర్వినా
అనుపాసిత వృద్ధానాం విద్యా నాతి ప్రసీదతి.
— వాక్యపదీయము.

చుచో నేతృత్వముల నన్వేషింపఁగలఁడు ? పురాణాగమముల సహాయమును గొనక చేసిన తత్త్వోత్ప్రేక్షయు, వృద్ధుల నుపాసింపక పొందిన విద్యయు నెన్నఁడును రంజింపదు. వేదము నాశ్రయించిన తర్కమున కేవిధమైన నిరోధము కలిగినను ఆతర్కము మనకు పనికిరానిది. కాని యిక్కడ విషయము వేఱు. విశుద్ధ తర్కము నాశ్రయించి, నిశ్చయము కావింపఁబడిన సిద్ధాంతముల ప్రమాణికతను బరీక్షించుటకు దార్శనికులు శ్రుతి నాశ్రయించుచుందురు; ఏలననఁగా పైన చెప్పఁబడినటుల శ్రుతి యోగానుభవము ద్వారా ఉద్భవించిన సిద్ధాంతముల రమణీయరాశి. కావున శ్రుతియందు దార్శనికులకు గల యీ పక్షపాతము అంధ విశ్వాసము కాఁజాలదు.

భారతీయ దర్శనము మీఁదఁగల మఱియొక ఆరోపము ప్రగతి శీలము కానిదని. అదియు నట్టే భ్రాంతిమూలకము. దార్శనిక విచారమీమాంసకు గహన విషయము ఆత్మ, జగత్తు, ఈశ్వరుఁడు మొదలైనవి, ప్రాచీనములగుగాక, దార్శనికులు భిన్న భిన్నదృక్పథములలో వానిని వివేచించుటలోఁ బూర్తిగ మౌలికతను జూపించిరి. ఈ పరమ గహన విషయములు ప్రాచీనములయ్యును నవీనములే. ఏలననఁగా వీని గహనత సదా వీనిని నవీనతగా నొనర్చినది. భాష్యకారులు వ్యాఖ్యానించునపుడు తమ స్వతంత్రతను, ప్రాగల్భ్యమును జూపుటలో తమ నిర్భీకతను, విచారస్వతంత్రతను బ్రకటించిరి. కావున భారతీయ దర్శనము పూర్తిగఁ బ్రగతిశీలము కలది. అది శ్రుతి కారాగారములో బద్ధురాలయ్యు జీవితములో నవీన విషయ వివేచనచేయుటలో

నెన్నఁడును అశుమతను జూపలేదు. కావున నీ యారోపము అనుపయుక్తమే అయినది.

## ౫. భారతీయ దర్శనముయొక్క శ్రేణీవిభాగము, కాలవిభాగము.

హిందూ గ్రంథకారులు భారతీయ దర్శనములను రెండు విభజించిరి. ఆస్తికములు - నాస్తికములు. ఈ ప్రసంగములో వ్యవహారింపఁబడిన యీ శబ్దముల కల్పన ఒక విశిష్టమగు న ములోఁ జేయఁబడినది. (1) సాధారణ వాదుకభాషలో 'ఆస్తికుఁడు' అనఁగా నీశ్వరుఁడున్నాఁడను వాఁడనియు, 'నాస్తికుఁడు' అనఁగ నీశ్వరుఁడు లేఁడనువాఁడనియు వాడఁబడుచున్నది. కాని యీ ప్రచలితార్థములో నీశబ్దములు దార్శనికములలోఁ బ్రయోగింప బడలేదు ఆస్తికదర్శనములలోఁ జేర్పబడినప్పటికిని కర్మమీమాంస కర్మమహత్వమును గ్రహించి, ఫలము కొఱకు అపూర్వకల్పనను ప్రమాణయుక్తముగ నంగీకరించి, ఈశ్వరుని నిషేధించును. సాంఖ్యము ప్రకృతి పురుష సంయోగముచే సృష్టి జరిగినదని పలుకుచు నీశ్వరుఁ డవసరమని యొప్పుకొనుటకు సిద్ధపడలేదు బౌద్ధ, జైన, చార్వాక దర్శనములు ఈశ్వర నిషేధకములగుటచే 'నాస్తిక' శబ్దమును బ్రయోగించుట ఉపయుక్తముగనే యున్నది కాని, మీమాంస, సాంఖ్యములను ఆస్తిక దర్శనములలోఁ జేర్చుట పూర్తిగా నుచితమే. (2) పాణిని వీనికి శాస్త్రీయ వ్యాఖ్య త అష్టాధ్యాయిలోఁ జేసియుండెను. 'అస్తి పరలోక ఇతి మ ర్యస్య స ఆస్తికః' అనఁగా పరలోక మున్నదని విశ్వసించువా

డాస్తికుఁడు. ఆస్తిక, నాస్తిక, దైష్టిక శబ్దముల వ్యుత్పత్తి 'అస్తి నాస్తి దిష్టంమతిః' (4-4-60) ఈ సూత్రముచే ఠక్ ప్రత్యయము ద్వారా సిద్ధమగుచున్నవి. ఈ వ్యుత్పత్తిని బట్టి యేర్పడిన అర్థమందుగల వ్యవహారమునుబట్టి జైన బౌద్ధ దర్శనములుకూడ ఆస్తికమతముల లెక్కలోనికే రాఁగలవు. ఏలననఁగా నీదర్శనములును నన్యదర్శనములవలెఁ గర్మ సిద్ధాంతము నంగీకరించినవి. వీనికి పరలోకములయందు గట్టి విశ్వాసము కలదు. ఈ దృష్టిచేఁ జార్వాక దర్శనమొక్కటియే నాస్తిక దర్శనము కాఁగలదు. (3) కాని యిచ్చట 'ఆస్తిక' శబ్ద ప్రయోగము ఇదివఱకుఁ జెప్పఁబడిన రెండర్థములలోఁగాక మూఁడవ యర్థములోఁ జెప్పఁబడినది. వేద ప్రమాణమందు విశ్వాసముగల మతము 'ఆస్తికము'ను వేద ప్రమాణము నంగీకరింపక నిందించు మతము 'నాస్తికము' అనియుఁ జెప్పఁబడినది. మనువు వేదనింద చేయువాఁడు నాస్తికుఁడనెను. ('నాస్తికో వేద నిందకః' మనుస్మృతి 2-11) ఈ యర్థములో నీప్రయోగ మిచ్చటఁ గావింపఁబడినది. వేదప్రామాణ్యము నంగీకరించుటచే న్యాయ, వైశేషిక, సాంఖ్యయోగ, మీమాంస, వేదాంతములు ముఖ్యముగ ఆస్తిక దర్శనములుగను, వేద ప్రామాణికత నంగీకరింపక పోవుటచే చార్వాక, జైన, బౌద్ధ మతములు నాస్తికదర్శనములుగ నెన్నఁబడినవి. ఈదృష్టిచే నీశ్వరుఁడు, వేదము, పరలోకము వీని నంగీకరింపని చార్వాకుఁడు పక్కా నాస్తికుఁడు. చార్వాకుని నాస్తికత చతురస్రము.

కాని భారతీయ దర్శనములయొక్క యీ శ్రేణీవిభాగము అంత యుక్తియుక్తముగ లేదు. పాంచరాత్ర సంహిత, శైవ

సంహిత, శాక్త సంహిత వీనియందు వైదిక, వేదబాహ్య సిద్ధాంతముల విచిత్రసమ్మేళనము కలదు. బ్రహ్మసూత్రముయొక్క తర్కపాద (2-2) మందు బాదరాయణుడు పంచరాత్రములను శైవసిద్ధాంతములను అవైదికములని సప్రామాణికముగ ఖండించెను. పాంచరాత్రములో గొన్ని అంశములు ఖండనాత్మకములని శంకరాచార్యుడనెను; కాని రామానుజాచార్య మం వ్యానుసారముగ సూత్రములలో వారు వాటిని మండనవ కాపించిరి. పాశుపత, పంచరాత్ర సిద్ధాంతములు మాత్రము వే సమ్మతముగ నంగీకరింపబడ లేదనుట మాత్రము నిశ్చితము శివమహిమ్నా స్తోత్రమందు 'త్రయీ సాంఖ్యం యోగః పశుప మతం వైష్ణవమితి' ఈ పద్యాంశమందు పాశుపతమతము, వైష్ణ మతము వేదత్రయికి వ్యతిరేకమైనదను తాత్పర్య మిదివే కావున తంత్రమూలక దర్శనముల నిర్వాహము పూర్వోక్త వ కరణము నంగీకరించినపక్షమున నందులో జేర్చజాలవు. ఏలనన నీసిద్ధాంతములు (చతుర్వ్యూహాది కల్పనాదులు) వేదానుకూ ములు కాకపోయినప్పటికిని కర్మ సిద్ధాంతము, పునర్జన్మము, దుఃఖ త్యంత నివృత్తి మొదలగు ననేక సిద్ధాంతములు వేదానుకూలము నున్నవి. కావున నీయాగమ గ్రంథాధారమున నిర్మింపబడి దర్శనముల ఉపపత్తి కొఱకు పూర్వోక్త ఆస్తిక, నాస్తిక శ్రే విభాగము పూర్తిగ ననుపయుక్తముగ నున్నది.

ఈగ్రంథము యొక్క ప్రథమ ఖండమందు శ్రుతి, గీత లోని ఆధ్యాత్మికతత్త్వములయొక్క వివేచనము కలదు. ద్వితీయ ఖండమందు నాస్తికదర్శనములనబడు చార్వాక, జైన, బౌ

దర్శనముల వర్ణనము కలదు. తృతీయ ఖండమందు షడ్దర్శనముల (న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, కర్మమీమాంస, వేదాంతము) వివేచనము చేయఁబడును. ఇవన్నియు శ్రుతి మూలకము లగుటచే ఆస్తిక దర్శనములలో సర్వశ్రేష్ఠములుగ నెన్నఁబడుచున్నవి. తర్వాతఁ జతుర్థ ఖండములో భక్తి యొక్క భవ్య కల్పనకు మహత్త్వ మొసఁగునట్టియు, ఆగమముల పునాదుల పై నవలంబించిన పాంచరాత్ర, శైవ, శాక్త దర్శన సిద్ధాంతముల వర్ణనము చేయఁబడును. సాధారణముగ బౌద్ధ దర్శనములోఁగల నాల్గు సంప్రదాయములు— వైభాషిక, సౌత్రాంతిక, యోగాచార మాధ్యమికములుగ విభజింపఁ బడుటచే నాస్తిక దర్శనములుకూడ ఆస్తిక దర్శనములవలె నాలు విధములుగ నగును. ఈ పండ్రెండు దర్శనముల వివేచనము ప్రచలిత దర్శన గ్రంథములందు లభింపఁగలదు. కాని ఆగమమూలక దర్శనముల వివేచనము చేయకపోవుట గొప్ప లోపమే. భారతీయ ధర్మము, సభ్యత నిగమాగమ మూలకములు. ఒక ప్రవాహము నిగమ మూలకము, ఒక ప్రవాహము ఆగమ మూలకము. కావున నీ రెండువిధముల విచారధారలచేఁ బ్రభావితమగు దర్శనముల నిరూపణము కావించుట వ్యాపక దృష్టిచే మిక్కిలి యుపయుక్తము.

## కాల విభాగము

భారతీయ దర్శనేతిహాసమును మనము మూఁడు నిశ్చిత కాలములుగ విభాగింపవచ్చును. (1) వైదిక కాలము. ఈ కాలము గొప్ప మహత్తరమైనది. ఈకాలమందు ఋగ్వేదీయ,

అథర్వవేదీయ సంహితలలో సంకేతము కావింపఁబడిన తత్త్వముల వికాసము బ్రాహ్మణ, ఆరణ్యకములలోఁ గలుగుచు నుపనిషత్తులలోఁ బూర్ణముగ సంపన్నమైనవి. మనకు ఉపనిషత్తులలో ననేక తత్త్వముల పర్యాలోచన దొఱకును. ఈ తత్త్వముల వివేచనము ఆత్మస్ఫూర్తిలేక ప్రాతిభ జ్ఞానబలమున నవి మన అంతస్థలమును దగులునట్లు చక్కఁగఁ జేయఁబడినది. ఉపనిషత్కాలీన దర్శనముల నధ్యయనము కావించుటచే వానిద్వారా చరమతత్త్వ సాక్షాత్కారమైనట్లు మనకు స్పష్టముగఁ దెలియఁ గలదు; లేకపోయిన నావర్ణములలో నింతటి తలస్పర్శిత, రోచకత, సరళత ఇవి కనుపింపవు.

(2) ఆదిమ ఉత్తర వైదిక కాలము:— ఈ కాలము వైదికధర్మమునకు విరోధమగు యుగము. ఉపనిషత్కాలమందే అనేక వేదవిరుద్ధ మతముల గుసగుసలు మన ధ్యానము వాటి వైపు పోఁజాలనంత అస్పష్టముగ వినఁబడుచునే యుండెను. కాని మహత్త్వశాలియగు ఉపనిషద్యుగము దాటి పోఁగానే యీ విరోధిదళములు తమ గొంతును గొంచెముగ నెత్తి చెప్ప సాగినవి. అవి తమ మతఘోషణను కొంచెముచ్చైస్స్వరమునఁ బెట్ట మొదలిడినవి. ఈ విరుద్ధదళములలో ఆజీవక, చార్వాకుల ప్రభావము కొద్దికాలము మాత్రమే వ్యాపించెను. కాని జైన బౌద్ధ దర్శనములు అవాంతర కాలములో బ్రాహ్మణ దార్శనికులచే నవి సదా దెబ్బలు తినుచున్నను సాధారణ జనమునకు ప్రేమ పాత్రములగుటచేఁ దమ వృద్ధిని గావించుకొనుటలోఁ గృతకృత్యములగునట్లు చేసికొనఁ గలిగెను.

(3) దర్శనకాలము:— ఈ కాలమును మనము రెండు
ంతరభాగములుగ భాగింపవచ్చును. (క) సూత్రకాలము.
) వృత్తికాలము. సూత్రకాలమందు న్యాయ, వైశేషిక,
ంఖ్య, యోగ, మీమాంసా, వేదాంత దర్శనముల సూత్ర
నమైనది. ఉపనిషత్తులలో సూచింపఁబడిన తథ్యములను
హించి దార్శనికులు విభిన్న మతములను స్థాపించిన దీ యుగము
. సూత్రరచనచే నా కాలమునందే దార్శనికము లారంభమైన
ు తాత్పర్యము కాదు. అట్లు కాకపోఁగా సూత్రములనేక
ాబ్దముల ఆధ్యాత్మిక గవేషణయొక్క పరినిష్ఠత ఫలస్వరూప
లు. సూత్రములలోఁ బారస్పరిక నిర్దేశములు కనఁబడు
న్నవి. వేదాంతసూత్రములలో ( 3–4–18 ) మీమాంసను
ంచిన ఉల్లేఖనమును, న్యాయసూత్రములో ( 3 అ - 2 ఆ )
శేషిక సూత్రపరిచయము కలదు. సాంఖ్యసూత్ర ( పంచమా
ధ్యాయము ) ములో ఇతర దర్శనముల సిద్ధాంత నిర్దేశము
ు. ఈ సూత్రరచనా కాలమునుగూర్చి విద్వాంసులలో
ఁభిన్న మతములు కలవు. కాని స్థూలముగ విక్రమశకము 400
ర్వమునుండి 200 విక్రమ పూర్వము వఱకు వీని నిర్ణయ
ము అంగీకరింపఁబడుచున్నది.

(ఖ) వృత్తికాలము:— సూత్రముల శబ్దావళి వృత్తి
ేయము లేక బోధగమ్యము కానంత స్వల్పముగను, నిగూఢ
గను నున్నవి. ఈ యుగములో సూత్రగ్రంథముల యర్థమును
్పటకు భాష్య, వార్తిక, టీకాగ్రంథముల రచన జరిగినది.
ర, కుమారిల, వాత్స్యాయన, ప్రశస్తపాద, శంకర,

రామానుజ, వాచస్పతి, ఉదయన మొదలగువారు అవతరించిన శ్రేయము యీ యుగమునకే దక్కినది. టీకాకారులగుటచే వీరి రచనలు మౌలికత తగ్గలేదు సరిగదా మూలలేఖకులవలె వీరును మిక్కిలి ప్రామాణికులైరి. వీని సహాయతచేఁ బ్రాచీన ఆచార్యుల మతముల రహస్యోద్ఘాటన చేయుటయే గాక, తమ స్వతంత్ర మతములను గూడ స్థాపించి తత్తద్దర్శన సిద్ధాంతముల వికాసము కావించెను. తార్కిక యుక్తులచేఁ బ్రతిపక్షమతములను ఖండించుట యీ కాలముయొక్క విశేషత. ఉపనిషద్గ్రంథ పృష్ఠము లందు స్ఫురితమగు తత్త్వములను దర్కము ద్వారమున స్థాపించుట యీ యుగమునకొక గౌరవ విషయము. ఈకాలము విక్రమశకము 300 నుండి 1500 వఱకు గ నెన్నఁబడుచున్నది.

భారతీయ దర్శన కాలవిభాగ సామాన్య రూపురేఖ యిదియే. కాని పూర్వోక్త కాలవిభాగము నియమితముగను, సువ్యవస్థితముగను లేదు. మేమీ గ్రంథములో నీమూఁడు యుగముల యొక్కయు దార్శనిక పరిచయ మొసంగితిమి. ద్వితీయ పరిచ్ఛేదమందు శ్రౌతదర్శన వర్ణన రూపమున వైదిక కాలీన తత్త్వజ్ఞానము యొక్క సామాన్యసిద్ధాంతముల సంక్షిప్త నిరూపణము కలదు. గీతా, చార్వాకమత, జైన, బౌద్ధదర్శనముల ఆవిర్భావము మఱియొక యుగమునకు సంబంధించినది. వీటిని భిన్న భిన్న పరిచ్ఛేదములలో వర్ణించియుంటిమి. గ్రంథములోని తృతీయ, చతుర్థ ఖండములలో నిరూపింపఁబడిన దర్శనముల వివేచనము మూఁడవ యుగమునకు సంబంధించినవి. ఈ విధముగ నీ లఘుకాయ గ్రంథములో భారతీయ దర్శనము

యొక్క విభిన్నయుగములలోని వికాసము సంక్షిప్తముగఁ బరిచ యము కావింపఁబడినది. భిన్న భిన్న కాలములయొక్క ఆధ్యాత్మిక ప్రవృత్తులయొక్క చర్చ ఆయాస్థానములందు ఉచితరీతిని జేయఁబడినది.

## ౬. భారతీయ దర్శన వికాసము

వైదికయుగములో ద్వివిధప్రవృత్తులు- ప్రజ్ఞామూలకము - తర్కమూలకము.

సత్యాన్వేషణము విషయములో భారతీయ విద్వాంసుల యొక్క ఉత్కంఠత అత్యంత ప్రాచీన యుగముల నుండియు కన బడుచున్నది. 'సత్' విషయోపలబ్ధికై వివిధ విభిన్న భాగములను నేసూక్ష్మతచేరను, ఋం ఖానుపుంఖరూపముగను వీరన్వేషించిరో అది వాస్తవముగ విచార శీలురగు పండితమండలి యొక్క ఆదర విషయము. ఋగ్వేదము యొక్క అత్యంత ప్రాచీనయుగమునుండియు భారతీయ విచారములందు ద్వివిధ ప్రవృత్తియు, ద్వివిధ లక్ష్యములు గోచరములగును. ప్రథమ ప్రవృత్తి ప్రతిభామూలకము లేక ప్రజ్ఞామూలకము (Intutionistic). ఇది ప్రాతిభ చక్షుపుద్వారా తత్త్వవివేచనమందు కృత కార్య మగును. రెండవ ప్రవృత్తి తర్కమూలకము (Rationalistic). ఇది తత్త్వసమీక్షకు తార్కిక బుద్ధి ప్రయోగమే మిక్కిలి సమర్థమైన దనును. లక్ష్యములు కూడ రెండు రకములు:— ధర్మోపార్జనము, బ్రహ్మసాక్షాత్కారము. ఋగ్వేదమునకు సంబంధించిన ఒకానొక మహర్షి ప్రాతిభజ్ఞాన బలమున జగత్తుయొక్క మూలతత్త్వమును వ్యాఖ్యానించుచు నద్వైత తత్త్వాన్వేషణము చేయుటలో సమర్థుఁ డయ్యెను.

'ఆసీదవాతం స్వధయా తదేకమ్' (ఆసమయమున ఒకే వస్తువు వాయువు లేకయే తనశక్తిచే శ్వాసించినది. జీవించినది.) అయితే యింకొక మహర్షి ఈ ప్రోత్సాహనమే తర్కమూలక మగు నుత్కృష్టోదహరణ మొసంగి యుండెను. 'సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవో మనాంసి జానతామ్.' (ఋగ్వేద– 10 - 191 - 2) (పరస్పరము కలిసికొనుడు. ఏదైన విషయమును గుఱించి వివేచనచేయుడు. పరస్పరము మనస్సును దెలిసికొనుడు.) ఈ యుభయప్రవృత్తుల యొక్క ప్రభావము వైదిక యుగమందు సర్వత్రదృష్టి గోచరమగుచున్నది. వైదిక కర్మకాండను వివేచించుటకుఁ దర్కమూలక ప్రవృత్తి నుపయోగింపఁగా మీమాంసోత్పత్తియైనది. వేదములోని యజ్ఞయాగాదులలో నాపాతముగ నుపలభ్యమానమగు విరోధములను బరిహరించుటకుఁ దార్కిక బుద్ధి నుపయోగించుటచే మీమాంస యొక్క మూలరూపముత్పత్తియైనది. ప్రజ్ఞామూలక తర్కమూలకములు రెండును బరస్పరము సమ్మిళితమగుటచే నుపనిషత్తత్త్వజ్ఞాన ముదయించినది. ఔపనిషదతత్త్వజ్ఞానము యొక్క పర్యవసానము జీవాత్మ పరమాత్మైక్యమును సాధించు ప్రజ్ఞామూలక వేదాంతమయ్యెనది. దీనికి తోడుగా నుపనిషత్కాలమందు శుద్ధ తర్కమూలక తత్త్వజ్ఞానముయొక్క ఊహాపోహాలుకూడ జరుగుచుండెను దానిమూలకముగ ప్రకృతి పురుషులు వేఱువేఱను సాంఖ్యము వ్యావహారిక యోగము, బహుత్వవాదులగు వైశేషిక, న్యాయ శాస్త్రముల యొక్క యుత్పత్తి కాలాంతరమున నయ్యెను. కొందఱు దార్శనికులు వేదముతో సంబంధ విచ్ఛేదము కావించు

కొని నిరపేక్షముగఁ దమ స్వతంత్ర తార్కిక బుద్ధిచేఁ దత్త్వ సమీక్షను గావించిరి. దీనికి పరిణామముగ జైనుల స్యాద్వాదము, బౌద్ధుల శూన్యవాదము, విజ్ఞానవాదములయు చార్వాకులయు భూతాత్మవాదము లుత్పన్నమయ్యెను.

షడ్దర్శనముల వికాసక్రమము

ఉపనిషత్తుల యనంతరము భారతీయ తత్త్వజ్ఞానము యొక్క వివిధ సంప్రదాయోత్పత్తి కథ చాల మనోరమమైనది. ఔపనిషద తత్త్వజ్ఞానముయొక్క పర్యవసానము 'తత్త్వమసి' మంత్రములోఁ గలదు. ఈ మంత్రము మూలము ననే ఔపనిషదిక మహర్షులు ఢంకామీఁద దెబ్బ కొట్టి త్వం (నీవు) తత్ (బ్రహ్మ) పదార్థముల కేకత్వము కలదని చాటుచుండుదురు. కాని యుపనిషద్యుగా నంతరమున నీ తత్త్వమును సాక్షాత్కరింపఁజేసికొనున దెట్లనునది విషమ సమస్య యయ్యెను. కొందఱు దార్శనికు లిట్లు చెప్పుచుండిరి. —— విభిన్నగుణములు కల ప్రకృతి పురుషులయొక్కయు, జీవ - జగత్తుల యొక్కయు పరస్పర గుణములను సరిగాఁ దెలియకుండుటయే (అనాత్మఖ్యాతి) సంసారమనియు ప్రకృతిపురుషుల యథార్థస్వరూపమును దెలిసికొనిన, తత్ - త్వం పదార్థముల యొక్క ఐక్యము సిద్ధము కాఁగలదు. ఈ జ్ఞానమునకు సమ్యక్ + ఖ్యాతి = సాంఖ్యము అని పేరు. కాని కేవల బౌద్ధిక సాక్షాత్కారముచేఁ బ్రయోజనము లేకపోవుటచే వ్యావహారిక రూపమునఁ బ్రత్యక్షము కావించుకొనవలసిన ఆవశ్యకత యేర్పడినది. ఈ యావశ్యకతాపూర్తి ధ్యానధారణ వ్యవస్థగల యోగము వలన నయ్యెను. ఈ విధముగ సాంఖ్య - యోగములు రెండును

ఒకే తత్త్వజ్ఞానమునకు రెండు పక్షములు. బౌద్ధిక పక్షమునకు సాంఖ్యమనియు, వ్యవహారపక్షమునకు యోగమనియు పేరు వచ్చెను. అనంతరము జీవ - జగత్తుల యథార్థ నిరూపణము కొఱకు వాటి గుణము ( విశేషము ) లను తెలుచుట ఆవశ్యకమయ్యెను. ఈ ఆత్మ అనాత్మల వివేచనము కొఱకై వైశేషికము పుట్టెను; కాని వస్తురూప వివేచనము జ్ఞాన ప్రాప్తియొక్క పరిష్కృత పద్ధతి లేక సుసంపన్నము కాఁజాలదు. కావున నీ జ్ఞానముయొక్క శాస్త్రీయపద్ధతి నిరూపణముకొఱకు న్యాయశాస్త్రము పుట్టెను. కాని న్యాయముయొక్క శుద్ధతర్కము మీఁదనే ఆధారపడుటచే నీ భావన బద్ధమూలమై యుండెను కేవలము శుష్క తర్క సహాయమున నాత్మతత్త్వము యొక్క యథార్థ సాక్షాత్కారము కలుగదు. అందువలన విచారకుల తమ దృష్టిని శ్రుతుల వైపునకుఁ ద్రిప్పిరి. 'వేదముల వద్దక తిరిగి పోవుదమని' అను నీ సిద్ధాంతము ప్రచారము కాఁజొచ్చెను దార్శనికులు వేదములోని కర్మకాండ వివేచన చేయ నారభించిరి. ఈ వివేచనము యొక్క ఫలముగ 'మీమాంస పుట్టెను. కాని మానవుల ఆధ్యాత్మిక ప్రవృత్తులు కేవలవ కర్మోపాసనచేతనే తృప్తి చెందవు. కావున జ్ఞానకాండ యొక్క మీమాంస ప్రారంభమయ్యెను. దీనిపర్యవసానము 'వేదాంతము ఈవిధముగ ఔపనిషద 'తత్త్వమసి' మహావాక్యము యొక్క యథార్థమగు వ్యాఖ్యానము చేయుటకు పూర్వోక్త క్రమము షడ్దర్శనములు ఉత్పన్నమయ్యెను.

ఇప్పుడిఁక మీదృష్టి నొక్కసారి జైన బౌద్ధ ధర్మముల వైపునకు మఱల్చుఁడు. వీటిని ఔపనిషదపరంపరనుండి బహిర్ముక్తులుగ నెన్నుట మిక్కిలి యనుచితము;

బౌద్ధదర్శనోదయము

ఇవి పరంపరను, విచారధారను నడ్డుకొను స్వతంత్ర దర్శనములు లేక ధర్మములు కావు సరిగదా పరిస్థితిని బట్టియుఁ, బరివర్తనమును బట్టియుఁ బరంపరగా నుత్పన్నమైన దోషములను, త్రుటులను బోఁగొట్టఁదలచిన సంస్కార సంప్రదాయులు. ఉపనిషద్యుగానంతరమునఁ గలిగిన సమస్య బ్రహ్మసాక్షాత్కార మెట్లగుననియే. దీనికిఁ బ్రత్యుత్తరముగ గౌతమబుద్ధుఁడు చెప్పిన దిది:- ఈవిషము సంసారముయొక్క ఆవాగమనమునకు జనని తృష్ణ. దానిని మూలమట్టముగ నాశము చేయవలెను. అఖిల స్వార్థపరాయణతను జనన మరణములకుఁ గారణభూతమగు ఆత్మయొక్క అస్తిత్వమందు విశ్వాసముంచకుండుటయు, చక్కని సాత్త్విక జీవనమును వెళ్లఁబుచ్చుటయును ముఖ్యమైనది. 'ఋతే జ్ఞానాన్న ముక్తిః' జ్ఞానములేక ముక్తి కలుగఁజాలదు. ఈ సిద్ధాంతము బుద్ధునకును మాన్యమైనదే. కాని ఆచార సహాయమున శరీరశుద్ధి కావించుకొనక మానవునకు జ్ఞానోపలబ్ధికి అధికారము లేదు. కావుననే బుద్ధుఁడాచారమార్గమునకే విశేషముగ పట్టుదల నొసంగెను. జగత్తుయొక్క మౌలిక తత్త్వాను సంధానము చేయుట కాలమును వృథాచేయుటయే ననెను.

జైన ధర్మాచార్యుఁడగు తీర్థంకరులకు నిదే యాచార విషయకవ్యవహార సమస్య యుండెడిది. ఈసమస్యమూలముననే ఆతఁడు తన తత్త్వజ్ఞానము నన్వేషించెను. జైనదర్శనము సత్య

పక్షపాతి. దాని నిశ్చయము ప్రకారము సత్యాన్వేషణమందు ఉపయోగపడు సమగ్రదర్శనములను 'ఆంశిక సత్య' ప్రాప్తియందే కృతకార్యము లైనవి; కావున నవి వికలాదేశ ములు. కేవలము జైనదర్శనము నయ (వస్తువు యొక్క ఒకదృష్టికోణము) స్యాద్వాదము (వస్తువు ఉండవచ్చును లేకపోవచ్చును అవ్యక్తమై యుండవచ్చునను మొదలగు సిద్ధాంతములు) పక్షము వహించుటచే సమగ్ర సత్యస్వరూప వివేచక మగుచున్నది. కావున నది 'సకలాదేశ' మై యున్నది. ఈవిధముగ వస్తుతత్త్వము నానాత్వముగ నుండుటచే నీ సిద్ధాంతమునకు 'అనేకాంతవాదము' అని పిలుచుచుందురు. ఈ యనేకాంత వాదము మీఁదనే జైన ధర్మముయొక్క సమస్తాచారమార్గము అవలంబితమై యున్నది.

జైనదర్శనోత్పత్తి

ఈవిధముగ శ్రుతులవలన విభిన్నదర్శనము లుద్భవించినవి. పైన నిర్దేశించిన వికాసక్రమము ఐతిహాసికము కాదు, తార్కికము. ఉపనిషత్తులనుండి యే శతాబ్దములలో భారతీయ దర్శనము యొక్క విభిన్న సంప్రదాయముల వికాసము కలిగెనో, దీనిని మనము సరిగాఁజెప్పఁజాలము. ఈసంప్రదాయముల వికాసము సమానాంతర రూపమున జరిగినదని మాత్రము చెప్పఁగలము. ఉపనిషత్తుల తర్వాత నీ సిద్ధాంతముల నూహాపోహములు విశేషముగ జరుగుచుండెను. అనంతరము వీటిని సూత్రరూపమున నేకత్రితము గావించి ప్రత్యేక దర్శనముయొక్క మూలభూతగ్రంథముయొక్క [రచనము] చేయఁబడినది. ఈ సూత్రము లందు స్వమత ప్రతి

దార్శనిక సాహిత్య వికాసము

పాదనముతోఁబాటుగా పరమత ఖండనము కూడ సూక్ష్మముగఁ జేయఁబడినట్లు కనఁబడుచున్నది. న్యాయసూత్ర రచన గౌతమ మహర్షిచేఁ గావింపఁబడినది, వైశేషిక సూత్రములు కాణాదుఁడును సాంఖ్యసూత్రములు కపిలుఁడును, యోగసూత్రములను పతంజలియు, కర్మమీమాంసను జైమినియు, వేదాంతసూత్రములను బాదరాయణుఁడును రచించిరి. ఈ మహర్షిగణము తత్త్వదర్శన సిద్ధాంతములకు కేవలసూత్రకారులే కాని మూల ప్రవర్తకులు కారు. ఏలననఁగా నీ దర్శన సూత్రరచనకుఁ జాల పూర్వమునసే యీ దర్శన సిద్ధాంతము లుదయించినవి. సూత్రములత్యంత సూక్ష్మరూపమున వ్రాయఁబడినవి. ఆరంభమున మౌలిక వ్యాఖ్యాన సహాయమున బోధగమ్యము లగుచుండెడివి. వ్యాఖ్యాన సహాయము లేక వీనిని బాగుగాఁ దెలిసికొనుట మిక్కిలి దురూహమగు వ్యాపారము. అందువలనఁ గాలాంతరమున భాష్యములనఁబడు వ్యాఖ్యానగ్రంథములు వీనికి రచింపఁబడినవి. భాష్యములకువార్త్తికములనుపేర వ్యాఖ్యానగ్రంథములకు పరంపరా మూలసూత్రములు సుబోధములు కావించుటకును, విపక్షులచేఁ గావింపఁబడిన యాక్షేపములను నివారించుటకై వ్రాయఁబడినవి. ఈ విధముగ దార్శనిక సాహిత్యము యొక్క మహత్తు వృద్ధియయ్యెను.

మూలసూత్ర తాత్పర్యమును దెలిసికొనుట మిక్కిలి కఠినకార్యమగునట్లు ఒక్కొక్కప్పుడు ఒక సూత్రగ్రంథము పైననే పరస్పరము విరుద్ధభాష్యగ్రంథములు నిర్మింపఁబడెను. బాదరాయణుని బ్రహ్మసూత్రముల మీఁద నిట్టి పరస్పర విరోధ గ్ర

ములు నిర్మింపఁ బడినవి. అందులో శంకరభాష్య మద్వైతమును, రామానుజ భాష్యము విశిష్టాద్వైతమును, మధ్వ భాష్యము ద్వైతమును, నింబార్కుని భాష్యము ద్వైతాద్వైతమును, వల్లభభాష్యము శుద్ధాద్వైతమును ప్రతిపాదించు చున్నవి. ఈ విభిన్న భాష్యముల మీఁదఁగూడ కాలాంతరమున సిద్ధాంతానుకూలవృత్తి గ్రంథరచన జరుగుచు వచ్చినది. వాని కారణమున వేదాంత దర్శన సాహిత్యము భారతీయ దర్శన సాహిత్యేతిహాసమందు మిక్కిలి గొప్పదిగను, విశాలమైనదిగను, మహత్త్వపూర్ణముగ నున్నది. వేదాంతము తర్వాత గ్రంథ సంపత్తిచే తర్వాత న్యాయము వచ్చును. ఈ దర్శనములలోని మహత్త్వపూర్ణములగు గ్రంథముల వర్ణనము ప్రతి సంప్రదాయసిద్ధాంత వివేచనమునకుఁ బ్రారంభమున సంక్షేపముగఁ జెప్పఁ బడును.

పైన నిర్దేశించిన సిద్ధాంతములందు పార్థక్యమున్నప్పటికిని కొన్ని యంశములలో సమానత గోచరించు చుండును. హిందూ దార్శనికులు అధికారభేదమున దార్శనిక భేదమున్నదని భావింతురు. మానవుని మానసిక వికాసము నైసర్గికముగ భిన్న భిన్న శ్రేణులలోఁ గలదు. మానవుల విచారధారలన్నియు నొకే ప్రవృత్తి నంటి పెట్టుకొని యుండవు. దర్శనములు వ్యావహారికములగుటచే మానవుల బుద్ధివికాసము ననుసరించి దర్శన నిర్మాణ మవసరమనుట ప్రత్యక్ష నిదర్శనమే. ఇది భారతీయ దర్శన దృష్టిలోఁ జక్కఁగా నున్నది. దర్శన వికాసము స్థూలములో నారంభమై సూక్ష్మము వైపునకుఁ బోవుచుండును. అన్నిటికంటె స్థూలమును, ప్రత్యక్షగమ్యవస్తువును ఈ జగత్తు - దీనియొక్క

అనుభవమును. కావున జగత్తుయొక్క అనుభవవ్యాఖ్యానము, దానిని విశ్లేషము చెందుటలోఁ గల ప్రవృత్తి కలిగియుండు టచే న్యాయవైశేషికములు ప్రథమ గణనములోనికి రాఁ గలదు. మానసముయొక్క అనుభవము, మానసిక ప్రక్రియ వీని యొక్క వర్ణనములో విశేషముగ వ్యస్తమగుటచే సాంఖ్య యోగమును దర్వాత శ్రేణిలోఁ జెప్ప వచ్చును. మీమాంసా, వేదాంతములు దీని తర్వాత వచ్చును. మీమాంసము ధర్మ మును, వేదాంతము పరమాత్మతత్త్వమును మిక్కిలి సూక్ష్మ ముగ వివేచన చేయును. ఈ విధముగ షడ్దర్శనములను మూఁడు భాగములుగ విభజింప వచ్చును.

(1) న్యాయ, వైశేషికములు. (2) సాంఖ్య, యోగ ములు) (3) కర్మమీమాంస ( మీమాంస ) జ్ఞానమీమాంస (వేదాంతము). ఇవన్నియు విభిన్నముగ నున్నను, వీనికి విశేష ముగ సమానత్వము కలదు. ఆ విషయము ముందు వర్ణింపఁ బడఁ గలదు.

## ౨. భారతీయ దర్శనముల పారస్పరిక సమానత్వము

ఏదేశము యొక్క విచారశాస్త్రము ఆదేశముయొక్క సభ్యతాసంస్కృతులకు అత్యుత్తమ మగు మూల్యవంతమగు పదార్థముగనుండును. ఆదేశముయొక్క ధార్మిక, సాంస్కృతిక వాతావరణ ప్రభావము విచారశాస్త్రము యొక్క విభిన్న ధారలలో నిశ్చిత రూపమునఁబడుచుండును. అందువలన నే దేశ ములోఁ బుట్టిన విచారశాస్త్రములోఁగల విభిన్న సంప్రదాయ

సిద్ధాంతములలో కొద్దిగా భేదములున్నను, వాతావరణములో సమానత్వ ముండుటచే నీసాంప్రదాయములం దనేక సమాన భావములు దృష్టిగోచరము లగుచుండును. ఈ కారణమున భారతీయ దార్శనిక సంప్రదాయములలోని అనేక సిద్ధాంతములం దేకత్వము దృష్టిగోచరమగు చున్నది.

భారతీయ దర్శనములలో నన్నిటికంటె గొప్ప విశేషత వాటి ఉద్దేశ్యము వ్యావహారికమగుటయే. జనుల ఆధివ్యాధి ప్రపూరిత విషమ దైనిక జీవనమునుండి శాంత, నీరవ, కాల్పనిక జగత్తున విహరించుటకాదు. విపద్గ్రస్తులను విపత్తులనుండి శాశ్వతముగ ముక్తినిం బొందించుట వాటియొక్క ప్రధానలక్ష్యము. వాటి లక్ష్యము మానసిక కౌతూహలమును నిరాకరించుటయే కాదు, రాగద్వేషములయొక్క తుముల ద్వంద్వ యుద్ధమునుండి బహిష్కృతమగుటచే నితాంతాదరణీయమును స్పృహణీయ జీవనమును గడుపుటను నేర్పుటయే.

వ్యావహారికోద్దేశ్యము

ఈ వ్యావహారికోద్దేశ్యమునకుం గారణమేమనఁగా భారతీయ దర్శనము వర్తమాన జీవన ఆధ్యాత్మిక అసంతోషము మీఁద నాధారపడుటయే. భారతీయ దర్శనము నైరాశ్యవాదమునుండి లాంఛనముగ రక్షించుచు నైరాశ్యవాదము ఆరంభికమనియు, అవసానికము కాదనియుఁ బైనఁ జెప్పియుంటిమి. వర్తమానమునఁగల అసంతోషము, దినదిన దుఃఖసంఘటనల వలన నాధ్యాత్మిక నైరాశ్యము విచారశాస్త్రమునకు జనకమగుచున్నది. ఈసిద్ధాంతము నిదివఱకే

వర్తమానమున నసంతోషము

మేము ప్రతిపాదించి యుంటిమి. దుఃఖమయమగు వర్తమానము నందు అసంతుష్టిజనింపనిదే సుఖమయభవిష్యత్తుకొఱకు ఆశించుట దురాశామాత్రమే కాఁగలదు. కావున భారతీయదర్శన సంప్రదాయము ఈసమకాలికప్రశ్నను గ్రహించియె సాగుచున్నది. నిరతిశయ గాఢ సమాధిబలమున బుద్ధుఁడు కనుగొనిన నాల్గు 'ఆర్యసత్యములను' అన్ని సంప్రదాయకుల వారును మన్నింతురు. వ్యాసుఁడు, * విజ్ఞాన భిక్షువు ♦ చెప్పినట్లు అధ్యాత్మశాస్త్రము చికిత్సాశాస్త్రమువలె, చతుర్వ్యూహముగా నున్నది. చికిత్సా శాస్త్రము రోగము, రోగనిదానము, ఆరోగ్యము, భైషజ్యమను నాల్గు తథ్యములను ప్రతిపాదించునట్లు, అధ్యాత్మశాస్త్రము దుఃఖము, దుఃఖహేతువు, మోక్షము, మోక్షోపాయము అను ఈ సిద్ధాంతచతుష్టయమును మూలభూతముగ గ్రహించి వీనికి వ్యాఖ్యయందు యథాశక్తిగఁ బ్రయత్నము చేయుచున్నది. ఈ జగత్కలాపమునందు వివేకలోకసారి దృష్టిని సారించుచో, నీ సంసారము నితాంతదుఃఖమయమైన దనియు, దుఃఖమే పరమ సత్యభూతమగు పదార్థమనియు నిశ్చయించుకొనఁ గలము. ‡ ఇది ప్రథమ సత్యము. రెండవ సత్యము ఈ దుఃఖమునకుఁ గారణమగు ద్రష్టృదృశ్యముల సంయోగము (యో. సూ. ౨-౧౭) మూఁడవ సత్యమిది దుఃఖమును బూర్తిగ నిరోధించుట. ఇఁక

---

* యథా చికిత్సాశాస్త్రం చతుర్వ్యూహమ్ — రోగో రోగహేతుః ఆరోగ్యం భైషజ్యమితి ఏవమిదమపి శాస్త్రం చతుర్వ్యూహమ్ తద్యథా సంసారః సంసారహేతుః మోక్షో మోక్షోపాయ ఇతి" వ్యాసభాష్య ౨-౧౫.

♦ సాంఖ్య ప్రవచన భాష్య — ౬ పుట.

‡ దుఃఖమేవసర్వం వివేకినః । హేయం దుఃఖమనాగతమ్ ॥

నాల్గవ సత్యము ఈ నిరోధమునకు గల మార్గమును గూర్చి వ్యాఖ్యానించుట. ఈ విధముగ భారతీయ దర్శనము దుఃఖ సత్తా ఈ జగతీతలమునఁ గలదనియే ప్రవర్తించు చున్నది. కాని అది యచ్చటనే సమాప్తిచెందుటలేదు. దానిని మూలమట్టముగ నివారించుట కుపాయము నన్వేషించు చున్నది. సాంఖ్యకారికారంభములో విచారశాస్త్రప్రవృత్తికి ఇదియే కారణముగఁ జెప్పఁబడినది.* ఈ విధముగ భారతీయ దర్శనముయొక్క ప్రతి సంప్రదాయమందును వర్తమానమున నసంతోషమును ప్రకటించి దానిని నివారణ చేయుటకుఁ బ్రయత్నము చేయఁబడి యున్నది. భారతీయ సంస్కృతియందు నిరాశావాదము లేదని సాహిత్యక ప్రమాణములు కూడకలవు. సంస్కృతనాటకములలో దుఃఖాంత నాటకములులేవు. సంస్కృత నాటకకారులు మానవహృదయమందు ఆశాసంచారమునకు సంబంధించిన ఉన్నత భావనను ప్రేరేపించుటవలన దుఃఖాంతములను జూపుట కిష్టపడకుండిరి. నాటకమధ్యమున దుఃఖ సంఘటనములను జూపినను జివరకీ సంఘటనముల నన్నిటిని సుఖమయములుగఁ బరివర్తింపఁ జేయుట కేమియును సందేహించెడువారుకారు.

## నైతిక వ్యవస్థయందు విశ్వాసము

మానవుఁడు స్వభావము చేతనే ఆశావాది. నిరాశావాదమను చీఁకటి జీవన నభోమండలమును క్షణకాలము మూషితమొనర్చినను ఆశావాదముయొక్క నైసర్గికప్రవృత్తి యీ చీఁకటిని శీఘ్రముగఁ బోఁగొట్టగలదు. ఈ విశ్వములో సవ్యవస్థకు

* దుఃఖత్రయాభిఘాతాజ్జిజ్ఞాసా తదపఘాతకే హేతౌ॥ సాం. కా. ౧కా

స్థానము లేదను సంగతి క్రాంతదర్శనులగు కవిజనులును, సిద్ధపురుషులు నిదివఱకే దర్శించియుండిరి. సర్వత్ర సువ్యవస్థ సామ్రాజ్యము చేసినది. ఈ జగత్తు వ్యవస్థాన ర్తకికి మనోరమ రంగశాల. ఇందులో నొంత చిన్నవస్తువైనను యాదృచ్ఛికముగఁ బ్రవర్తింపదు. అంతయు నొక వ్యాపక నియమమునకు, వశీభూతమై తన జీవితమును విస్తారము కావించుచున్నది. పగలు దాటఁగానే రాత్రి, రాత్రిదాటఁగానే నిత్యము ప్రాతఃకాలమున సువర్ణమయ రశ్ములను వెదఁజల్లుచు పూర్వక్షితిజమందు భువనభాస్కరుఁ డుదయించుట, రాత్రులందు రజతరశ్ములను వెదఁజల్లుచుఁ జంద్రుఁడుదయించుట, క్రమముగ వృద్ధి హ్రాసములు చెందుట మొదలగు ప్రాకృతిక దృశ్యములను గాంచఁగానే మన వైదిక ఋషుల హృదయమందు ఈ జగత్తుకు మూలమందు వ్యవస్థా సిద్ధాంతము పనిచేయుచున్నదని తోఁచినది. ఋగ్వేదీయ ఋషులీ యపరివర్తనీయ నైతిక వ్యవస్థకు 'ఋత' మని పేరిడిరి. జగత్తునందన్నిటికంటె ప్రప్రథమమున నుత్పన్నమైన దీ 'ఋత' మే. "ఋతం చ సత్యం చాభీద్ధాత్తపసో౽ ధ్యజాయత" (ఋ. వే. ౧౦-౧౯౦-౧) ముందుగా ఋతము పుట్టినది. తర్వాత సత్య ముద్భవించినది. భారతీయ దార్శనికు లీ ఋతముయొక్క సిద్ధాంతమును భిన్నభిన్నములుగ గ్రహించిరి. వైదిక కార్యకలాపముల ననుష్ఠించుటచే నవి సర్వథా లుప్తములుకావు సరిగదా ఒక యపూర్వ సృష్టిని జేయఁజాలియుండును. ఇదియే యపూర్వ ఫలోత్పత్తికి ప్రధాన కారణము. అందువలన మీమాంస ఋత

మునే 'అపూర్వ'మను రూపమున గ్రహించినది. న్యాయ
షికమందు గల 'అదృష్టము'నకు మూలకల్పనము 'బుద్ధి

జగత్తుయొక్క నైతికసువ్యవస్థను మూలకారణము
సిద్ధాంతము. దానిని ప్రతి దర్శన మంగీకరించును. మన
ముతో జేయు ప్రతికార్యము ఫలమ
కర్మసిద్ధాంతము
న్నము కాపించును. దానికి నాశ మెప్పు
డదు. (కృతప్రణాశ) ఇప్పుడు మనమనుభవించునది పూ
ములో జేయబడిన కర్మపరిణామమే. ఇది కారణములేక
నది కాదు. (కృతాభ్యుపగమః) కర్మ సిద్ధాంతము
తాత్పర్య మేమనగా నీ విశ్వమందు యదృచ్ఛకు స్థాన
లేదు. సర్వత్ర నైతిక సువ్యవస్థా సామ్రాజ్యము విరాజిల్లు
కర్మ సిద్ధాంతము నంగీకరించుటచే మానవుని యొక్క
శక్తి వికాసమునకది అవసరము చున్నది. కర్మ సిద్ధాం
యుపనిషత్కాలమున గలిగినది.* వేదమూలక దర్శనమ
బాటుగా జైన బౌద్ధ దర్శనములుకూడ నీ సిద్ధాంతము
నుండియే గ్రహించినవి.

ప్రాపంచిక బంధములన్నిటికిని మూలకారణము
అవిద్యవలననే ఈ జగత్తునందు జనన మరణములు కలుగు

* (క) పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేనే
బృహ. ఉప.

(ఖ) యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః।
స్థాణుమన్యేఽను సంయంతి యథాకర్మ యథాశ్రుతమ్
కఠ. ఉప.

అవిద్యవలన బంధనము విద్యవలన ముక్తి

అవి మనకు విపుల క్లేశములకుఁ గారణమైనవను నీ సిద్ధాంతమును భారతీయ దర్శనము యొక్క సమస్త సంప్రదాయముల వారును నొకేరీతిగ నంగీకరించుచున్నారు. అవిద్యా స్వరూప నిరూపణము విషయమునను సర్వత్ర ఒక్కటే అభిప్రాయముగ నున్నది. యోగసూత్రానుసారముగ ననిత్య, అశుచి, దుఃఖ, అనాత్మలను క్రమముగ నిత్య, శుచి, సుఖ, ఆత్మలుగ భావించుటకే అవిద్యయనిపేరు. ('అనిత్యాశుచి దుఃఖానాత్మను నిత్యశుచి సుఖాత్మఖ్యాతిరవిద్యా' యో. సూ ౨-౫) ఈ యవిద్యయే యన్య సమస్త అస్మితా, రాగ, ద్వేష, అభినివేశ క్లేశములకు జనని. వస్తువు యొక్క యథార్థ స్వరూపమును నిర్ధారించ లేకపోవుటకే అవిద్యయని పేరు. సమస్త దార్శనిక జ్ఞానముయొక్క సహాయమువలన నీ యవిద్యను నిరాకరించుటకే యత్నించుదుము. జ్ఞానమే ముక్తికి ఏకమాత్రమగు నుపాయము. 'ఋతేజ్ఞానా న్నముక్తిః' అను నీ యుపనిషత్ సిద్ధాంత మందఱకును సామాన్యముగ మాన్యమైనదే.

మోక్షము.

తత్త్వజ్ఞాన సాధనముచేఁ గేవలము మానసిక కౌతూహల నివృత్తి గావించుటయే ధ్యేయముకాదు. దాని యుపయోగము వ్యావహారిక జగత్తుయొక్క తాపత్రయము (ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక సంతాప) ములనుండి జీవి ముక్తిని బొందుటలోఁ గలదు. ఈ సిద్ధాంతమును గుఱించి యిదివఱలోఁ బ్రతిపాదింపఁ బడినది. ఈ కారణముననే జైన ధర్మాచార్యులకు 'తీర్థంకరు' లను పేరు కలిగినది. ఈ శబ్దమున

కర్థమేమనఁగా నదిపైన ఆవలియొడ్డునకుఁ బోవుటకు మార్గ మును నిర్మించువాఁడు. సాధన మార్గోపదేశకులగు నాచార్యులే. య్యాధివ్యాధి ప్రపూరితమగు భవసాగరమును దాఁటుటకు సాధన భూతమగు తత్త్వజ్ఞాన సాధనమును జూపింతురని యీ పేరువలనఁ దెలియుచున్నది. మానవజీవితమునే ధ్యేయములను లక్ష్య ములో నుంచుకొని ప్రవృత్తుఁడగు చుండునో, వాటికి శాస్త్రీయ పరిభాషలోఁ బురుషార్థము లందురు. హిందూమతానుసారముగ ధర్మార్థకామమోక్షములని పురుషార్థములు నాలుగు. వీటిలో మోక్షమన్నిటికంటె శ్రేష్ఠమైనది. విచారశాస్త్రరూప మగు కల్పతరువునకు మోక్షము అమృతఫలము. మోక్షప్రాప్తిస్థానమీ శరీరము కాదను నొక విచిత్రభావన లోకములో వ్యాపించినది కాని యథార్థస్థితి యట్టిది కాదు. చాల దర్శనములలో నీ జన్మ యందే ఆత్యంతికతాపసంతాప నివృత్తి కలుగుటకే జీవన్ముక్తి స్థితి యనియు, నదియే చరమలక్ష్య మనియు నంగీకరింపఁ బడి యున్నది. ఇది చాల దూరస్థమగు ఆదర్శమను మాట నిజము. కాని యీ జన్మములో సాధ్యము కానిది కాదు. మానవ జీవిత లక్ష్యము కాల్పనిక పరలోకమందు దుఃఖనివృత్తి యగుటలోఁ గాక బ్రతికియుండఁగానే ఈ దేహమందే దానిని బొందుటలోఁ గలదు. జైన, బౌద్ధ, వేదాంతాది షడ్దర్శనములును జీవన్ముక్త స్థితియే జీవిత లక్ష్యమని చెప్పుచున్నది. పశిష్టాద్వై* తాద్వైతదర్శ నములందు జీవన్ముక్తి ఆదర్శముగఁ జెప్పఁ బడకున్నను తత్త్వ సాధనముచే జీవితోద్దేశ్యము సాధారణకోటినుండి మారి

* శ్రీభాష్యము ౪-౧-౧౩ ను జూడుఁడు.

బకానొక మహిత్వపూర్ణమగు వైశిష్ట్యమును బొందునట్టి యున్నతావస్థకు వచ్చునని అంగీకరింపఁ బడినది. జీవన్ముక్తి ఉపనిషత్తులొసంగిన బహుమూల్యమగు నాదర్శము. కఠోపనిషత్తు ♦ (౨-౩-౧౪) హృదయమునుండి సమస్త కోరికలెప్పుడు బయటకుఁ బోవునో అప్పుడు మానవుఁ డమరత్వమును బొందుననియు, నిచ్చటనే ఆతనికి బ్రహ్మోపలబ్ధి కలుగుననియు స్పష్ట శబ్దములతోఁ జెప్పుచున్నది. మోక్షధ్యేయము విషయములో దార్శనికులందు మతైక్యమున్నప్పటికిని, తత్స్వరూపమునందు పూర్తిగా మతవైషమ్యము కలదు. కొందఱు దార్శనికులు (న్యాయ, వైశేషికులు) మోక్షముయొక్క ఉన్నతస్థితిలో కేవలము దుఃఖనివృత్తి స్థితియేనని (అభావాత్మక) పలుకుచుందురు. కాని అన్యదార్శనికుల (మీమాంసా, వేదాంత, జైన, మహాయాన బౌద్ధ) మతమందు ఆసమయమున నానందోపలబ్ధి నిశ్చితరూపమునఁ గలదని (భావాత్మకము) చెప్పుదురు.

మోక్షప్రాప్తికిఁ జెప్పిన విభిన్నోపాయములలో నొక విచిత్రమగు నేకత్వము దృష్టిగోచర మగుచుండును. విచార

మోక్షమార్గము

శాస్త్రము సిద్ధ ద్వారము వఱకుఁ జేర్చి వదలిపెట్టును. ఈ ద్వారము లోనికిఁ బ్రవేశించుటకు సాధనము మిక్కిలి యావశ్యకము. మన మీ గాఢాంధకారపూరితమగు నీ సంసారమందు మన గమ్యస్థానమును జేరుటకు

♦ యదా సర్వే విముచ్యంతే కామాహ్యస్య హృదిస్థితాః ।
తదామర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥
కఠ. ఉప. ౨-౩-౧౪.

మన మార్గములను వెదకుకొనుచున్నాము. దర్శన శాస్త్రము ఉజ్జ్వల ప్రకాశ కిరణ దీప్తిని బ్రసరింపఁజేసి మనకు మార్గమును జూపించుచున్నది. కాని శుష్క-జ్ఞానము మనకు లక్ష్యమును జేరుట కేమాత్రమును సహాయమొనరింపఁజాలదు. సువిచారిత ఔషధమైనను నామమాత్రాతురులగు వారి రోగమును బోఁగొట్టఁగలిగియుండునా? వానికి కాల్పనిక తత్త్వజ్ఞానము వ్యావహారిక రూపమునఁ బరివర్తనము కావలెను. దీని వర్ణనము పూర్ణముగ యోగసూత్రములలోఁ గలదు. యోగదర్శనములోఁ జెప్పఁబడిన ప్రక్రియలను భారతీయ దర్శనము లన్నియు నంగీకరించును. బౌద్ధమతమందు మోక్షోపయోగమగు త్రివిధ సాధనములందు సమాధి విశిష్ట సాధనముగ నంగీకరింపఁబడినది.✝ జైనమతము 'సమ్యక్చారిత్ర్య'ముకొఱకు యమ, నియమ, ధ్యానములవధిక ప్రోత్సాహ మొసంగుచున్నది.* న్యాయదర్శనమందును యౌగిక ప్రక్రియలు ఆత్మసాక్షాత్కారమున కవసరమని చెప్పఁబడినది.♦ సాంఖ్యదర్శనములలో నీ ప్రక్రియలు గైకొనఁబడుట ప్రసిద్ధము. వేదాంత దర్శనమందును, జ్ఞానమున కాంతరిక సాధనరూపమున యోగసమ్మతమగు యమ, నియమాదు లంగీకరింపఁబడినవి. కాని వాని కల్పనలోఁ గొలఁది పార్థక్యము లేకపోలేదు.‡ తర్కము ద్వారా సిద్ధాంతము చేయఁబడిన దార్శనిక సిద్ధాంతమును మనము ఆత్మసాక్షాత్కారము చేసికొనునంతవఱకు అది

✝ చూడుడు _ దీఘ నికాయ.

* తత్త్వార్థసూత్ర ౯_౩౯_౪౬

♦ న్యాయసూత్ర ౪ అధ్యా_ఆహ్నిక ౨_సూ_౩౮_౪౮

‡ వేదాంతసారః ౪౭_౫౦ పుటలు

మన యజ్ఞానమును బోఁగొట్టఁజాలదు. దీని కొఱకు నిరంతరా విచ్ఛిన్నరూపమున నీ తత్త్వముల నభ్యసించుటయును, మననము చేయుటయును నత్యంతావశ్యకములు. మన వ్యావహారిక జీవనములో అవిద్యా, రాగ, ద్వేషములను తమోపటలము గాఢముగ నావరించినది. జ్ఞాన తత్త్వమును నిరంతరము మననము చేయక, అభ్యాసముచేయక ఆ తమోపటలమును ఛిన్నాభిన్నము కావింపఁ జాలము. అందుకనియే భారతీయ దర్శనమందు తర్క సిద్ధ తత్త్వములను నిరంతరము గాఢ మననము గావించుట, నిదిధ్యాసన మొనర్చుట యంగీకరింపఁ బడినది.

మానవునకు జీవన యాపనకు ప్రేయోమార్గ * మనియు, శ్రేయోమార్గమనియు రెండు మార్గములు కలవని ఉపనిషత్తు చెప్పుచున్నది. ప్రేయోమార్గమందు మానవుఁడు ఆపాతతః రమణీయ విషయములచే నాకర్షింపఁబడి సంసారమునఁ బ్రవృత్తుఁడగుచుండును. ఈ ప్రవృత్తికి మూలకారణము రాగద్వేషములు. సుఖము నొసంగు పదార్థములవలన రాగానురాగములు, ప్రేమ యుత్పన్నమగును. (సుఖానుశయీ రాగః) దుఃఖము నొసంగు పదార్థములను జిత్తము స్వతః ఏవగించుకొనును. (దుఃఖానుశయీ ద్వేషః) ఈరాగద్వేషములు మన చిత్తము నింద్రియముల నావేశించి, అవశముగ శ్రేయోమార్గము నవహేళనము కావించి ప్రేయోమార్గము నవలంబించునట్లు చేయును. శ్రేయోమార్గము

---

* శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్య మేతస్తౌ సంపరీత్య వివినక్తి ధీరః
శ్రేయో హి ధీరోఽభి ప్రేయసో వృణీతే ప్రేయో మందో యోగ
క్షేమాత్ వృణీతే॥ కఠ. ఉప. ౧-౨-౨

నిజముగఁ బరమ మంగళ సాధనమొసంగు మార్గము. విషయో న్ముఖులగు నింద్రియములను బాహ్య పదార్థములనుండి బలాత్కారముగ లాగి అంతర్ముఖ మొనర్పనంతవఱకు కల్యాణము కలుగఁ జాలదు. ఈవిధముగ మంగళమార్గమునఁ బోవుటకు ఆత్మ సంయమము, శుద్ధి అత్యంతావశ్యకములు. చిత్తశుద్ధి కొఱకు యోగదర్శనము యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులను నష్ట యోగాంగములను జెప్పియుండెను. ఈ ఉపాయము లత్యంతావశ్యకములని ప్రతిదర్శనము నంగీకరించినది.

ఈవిధముగ భారతీయ దర్శనము యొక్క విభిన్న సంప్రదాయములందు ఆలోచకుల దృష్టికి ఒక గొప్ప యేకత గోచరించుచున్నది. భారతీయ దర్శనము ఒకే పరమాత్మతత్త్వమును గూర్చి అనేక దృష్టులతో వివేచించి దానియొక్క సర్వాంగీణతను గూర్చి పర్యాప్త పరిచయ మొసంగుచున్నది. పరమార్థభూతపదార్థముయొక్క ప్రమాణమీమాంస, జ్ఞేయమీమాంస, ఆచారమీమాంస, మనోవిజ్ఞానము వీనిని దృష్టిలోఁబెట్టుకొని జతురస్ర వివేచనము భారతదేశమందు చేయఁబడినది. కావున భారతీయ దర్శనమును సంశ్లేషాత్మక మన్నను అనుచితము కానేరదు.



# భారతీయదర్శనము

## ద్వితీయ పరిచ్ఛేదము

### శ్రౌత దర్శనము

వేదమహత్త్వము

వేదము భారతీయ ధర్మమునకును దర్శనమునకును ప్రాణము. భారతీయ ధర్మమందు గనఁబడు జీవశక్తికి మూల కారణము వేదమే. వేదము అక్షయ విచారములకు మానససరోవరము. ఇచ్చటనుండి విచారధార బయలుదేరి భారతభూమిలోని మస్తిష్కముల నుర్వరము గావించుచు నిరంతరము ప్రవహించుచుఁ, దన సత్తాకొఱకు ఆ ఉద్గమక్షేత్రమును ఆధారముచేసికొని యున్నది. ఇది భారతీయ సాహిత్యమునకే సర్వప్రథమ గ్రంథము కాదు సరిగదా మానవమాత్రేతిహాసమునందు ఇంతకు మించిన ప్రాచీన గ్రంథ మింతవఱకు దొఱకలేదు. భారతీయ ధర్మ, తత్త్వజ్ఞానముల యొక్క ఆకృతి, ప్రకృతి, ఉద్గమ, వికాసములయొక్క సముచిత అనుసంధానము కొఱకు, ఈగ్రంథమణులయొక్క పర్యాలోచనము

మిక్కిలి యావశ్యకము. కాని శ్రుతి సమ్మత దార్శనిక విచారముల రూపురేఖా విషయములోఁ బర్యాప్తమగు మత భేదము కలదు. వేదాధ్యయనము నేఁడు ప్రాచీన పద్ధతిని, అర్వాచీన పాశ్చాత్య పద్ధతిని రెండు విధముల జరుగుచున్నది. పాశ్చాత్య పద్ధతి వేదార్థ పరిశీలనమునకు అన్యదేశీయుల సాహిత్యము యొక్క సహాయమును గొనవలసి యుండును. ప్రాచీన పద్ధతిని ఇతిహాస పురాణములు వేదార్థోపబృంహణములుగ * నెన్నఁబడినవి. వైదిక రహస్యముల యథార్థజ్ఞానము కొఱకు వాటి సహాయము బహుమూల్యముగఁ జెప్పఁబడినది. ఈ దృష్టిభేదము వలననే వైదికధర్మమీమాంస ఉభయమతములందు భిన్నభిన్నముగఁ జేయఁ బడినది. పాశ్చాత్యవర్గము వేదములు అసభ్య లేక అర్ధసభ్య. ఆర్యజనులయొక్క తెలియని గాయనములకు మించి విలువనొసంగరు. కాని భారతీయ సభ్యత ననుసరించి వేదము నిత్యము. నిఖిలజ్ఞానమునకు అమూల్య భాండాగారము. ధర్మమును సాక్షాత్కారింపఁజేయు మహర్షుల ద్వారా అనుభూతమైన పరమతత్త్వమును దెలుపునవిగ నున్నవి. ఇష్టప్రాప్తిని, అనిష్టనివృత్తిని గలిగించు నుపాయమును దెలుపు గ్రంథము వేదము. ♦ వేదములు ప్రత్యక్షమునకు అగమ్యమును, అనుమానము ద్వారా అనుద్భావిత అలౌకికోపాయములను

---

* శ్లో॥ ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్
బిభేత్యల్పశ్రుతా ద్వేదో మామయం ప్రహరిష్యతి॥
మహాభారతము_ (ఆదిపర్వ. ౧_౨౬౭)

♦ చూడుఁడు సాయణకృత తైత్తిరీయ సంహితాభాష్యభూమిక.

బోధించుటలో వాటి వేదత కలదు. * ఈ భారతీయ దృష్టికోణ మును ధ్యానమందుంచుకొని శ్రుతిప్రతిపాదిత ఆధ్యాత్మిక రహస్యములను గూర్చిన సంక్షిప్త వివేచన మీ పరిచ్ఛేదమునఁ జేయఁ బడినది.

'మంత్రబ్రాహ్మణాత్మకో వేదః' (అప. పరి. ౩౧) మంత్రము, బ్రాహ్మణమని వేదమునకు రెండు విభాగములు కలవు. ఒకానొక దేవతాస్తుతియందు ప్రయుక్తమైన అర్థస్మారక వాక్యమునకు మంత్రమని పేరు. యజ్ఞానుష్ఠానమును విస్తారముగ వర్ణించు గ్రంథమునకు బ్రాహ్మణ మందురు. మంత్రసముదాయమునకు 'సంహిత' యందురు. సంహితలు నాలుగు_ఋక్ సంహితా, సామ సంహితా, యజుస్సంహితా, అథర్వ సంహితా. ఈ సంహితా చతుష్టయ సంకలనమును యజ్ఞావశ్యకతను దృష్టిలోఁ బెట్టుకొని వేదవ్యాసమహర్షి చేసియుండెనని పురాణములు చెప్పుచున్నవి.

వేదవిభాగసంహితా

◆ యజ్ఞానుష్ఠానమునకు హోత, ఉద్గాతా, అధ్వర్యు, బ్రహ్మ యని నల్గురు ఋత్విజులవసరము. హోతా (పిలుచువాఁడు) దేవతా ప్రశంసాత్మకమగు మంత్రముల నుచ్చరించి తత్తద్దేవతల నాహ్వానించును. హోత్రకార్యమునకుఁ బనికివచ్చు మంత్రసముదాయ సంకలనము ఋగ్వేదమందు చేయఁబడినది. ఋక్కులను స్వరయుక్తముగ మధురస్వరముతో గానముచేయుట ఉద్గాత

* శ్రుతిశ్చ నః ప్రమాణ మతీంద్రియార్థ విజ్ఞానోత్పత్తౌ.
శంకరభాష్యము ౨_౩_౧.

◆ చూడుఁడు. శ్రీమద్భాగవతము. ౧ స్కం. ౪ అ. ౧౯ _ ౨౨ శ్లో.

యొక్క కార్యము. వివిధ యాగాంగ, ఉపాంగభూతములగు ననుష్ఠానములను విధిగ నెఱవేర్చుట అధ్వర్యుఁడు చేయవలసిన పని. ఈ ఆధ్వర్యవ కర్మకు యజుస్సంహిత నుపయోగింతురు. బ్రహ్మ యొక్క మహత్వపూర్ణమగు కార్యమేమనఁగా యాగమంతయు విధ్యుక్తముగ జరుగుచున్నదా లేదా యని చూచుటయు, అనుష్ఠానము నే విధమగు పొరపాటు రాకుండ జూచుచు ననుష్ఠానమునకు పూర్ణత నాపాదించుట. బ్రహ్మ వేదము లన్నిటిని తెలిసికొని యుండవలెను. ఈతనికి విశిష్టమగు వేదము అథర్వవేదము. ఈ విధముగ యాగ విధానమును జక్కగ నెఱవేర్పఁగలిగియుండుటకు భిన్న భిన్న ఋత్విక్కుల ఉపయోగముకొఱకు భిన్న భిన్న సంహితలు సంకలనము చేయఁబడినవి. వేదమును 'త్రయీ' యనియుఁ బిలుతురు. ఈ నామకరణమందును నొక రహస్యము కలదు. ఈ సంజ్ఞావిధానము మంత్రముల యుపయోగము కంటె మంత్రస్వరూపము మీఁద నాధారపడి యున్నది. పాదయుక్తమగు ఛందోబద్ధ మంత్రములకు 'ఋక్కు' లని పేరు. ఈ ఋక్కుల గానగతికి 'సామ' మందురు. ఈ రెంటికి భిన్నముగఁ గేవలము గద్యాత్మక వాక్యములకు 'యజుః' అందురు. * వేదము ఋగ్యజుస్సామములుగ విభజింపఁబడుటచే 'త్రయీ' యను పేరువచ్చినది. వేదప్రతిపాదిత ధర్మమునకు 'త్రయీధర్మ' మని పేరు. ధర్మమర్మజ్ఞులగు విద్వజ్జనులు దీనిని 'త్రైవిద్య' యందురు. ♦

---

* తేషామృగ్ యత్రార్థవశేన పాదవ్యవస్థా. గీతిషు, సామాఖ్యా. శేషే యజుః శబ్దః. జైమినిసూత్ర ౨-౧-౩౫-౩౭.

♦ చూడుఁడు. గీత ౯ అ. ౨౦-౨౧ శ్లోకములు.

సంహితా, బ్రాహ్మణ, ఆరణ్యకములని వేదమునకు మూఁడు విభాగములుకలవు. మంత్రసమూహమునకు 'సంహిత' యందురు. బ్రాహ్మణములలో యజ్ఞయాగానుష్ఠానము యొక్క విస్తృత పరినిష్ఠిత వర్ణనము చేయఁ బడినది.

బ్రాహ్మణములు ఉపనిషత్తులు

'బ్రాహ్మణ' ములను పేరుపెట్టుటకు కారణము— ఇందుగల ప్రధానవిషయము బ్రహ్మ (బృహా వర్ధనే అనఁగా వ్యాప్తిచెందునది అనఁగా వితానము, యజ్ఞము). బ్రాహ్మణముల యనంతరము ఆరణ్యకములు. ఇవి అరణ్యము లలోఁ బఠనీయము లగుటచే వీనికి ఆరణ్యకములను పేరువచ్చి నది. ఈ గ్రంథములలో వానప్రస్థాశ్రమమున కుపయోగించు క్రియాకలాపవర్ణనము కలదు. విశేషముగ యాగవిధానము యొక్క ఆధ్యాత్మిక రహస్యము యొక్క మీమాంస యీ గ్రంథ ములందు లభింపఁగలదు. ఆరణ్యకములకు చివరభాగములు ఉపని షత్తులు. ఉపనిషత్తులందు ఆధ్యాత్మవిషయక మహత్వపూర్ణ సమస్యలకు విద్వత్తాపూర్ణమగు వివేచనము చేయఁబడినది. ఉపని షత్తునే వేదాంతమందురు. ఈ నామకరణమునకు రెండు కారణ ములు కలవు. మొదటిది ఇవి వేదమునకుఁ జివరనుండుట. ఉపని షత్తులు వేదమునకు చివరభాగములు కావున వానికి వేదాంతము (వేద + అంత) లను పేరు వచ్చినది. రెండవ కారణ మేమనఁగా వీనిలో వేదములలో నిశ్చిత ప్రతిపాద్య సిద్ధాంతము వివేచింపఁ బడినది. ఈ కారణమున నుపనిషత్తులు ఆధ్యాత్మశాస్త్రవిషయక సమస్యలందు గల చిక్కులను విడదీయుటలోఁ బ్రకృష్ట మహా త్వము కలిగియున్నవి. ప్రతిపాదిత విషయ దృష్టిచే వేదమును

కర్మకాండ, జ్ఞానకాండలుగ విభజింప వచ్చును. సంహితా, బ్రాహ్మణ, ఆరణ్యకములందు ముఖ్యముగఁ గర్మకాండ వివేచింపఁబడుటచే నివి కర్మకాండాంతర్భూతములు. జ్ఞానవివేచన ఉపనిషత్తులందు చేయుటచే నవి జ్ఞానకాండాంతర్భూతములు. భారతీయ దర్శనము యొక్క మూలసిద్ధాంతము లీ యుపనిషత్తులందుఁ బ్రతిపాదింపఁ బడినవి, కాని కర్మప్రధానము లయ్యును సంహితాది భాగములందు విపులమగు అధ్యాత్మ రహస్యములు చెప్పఁబడినవి. కావున నీపరిచ్ఛేదమందు సంహితారణ్యకములందు గల దార్శనిక విచార వివేచనము ముందుగాఁ జేయఁబడును. అనంతరము ఉపనిషత్ సిద్ధాంత ప్రతిపాదనము సాక్షేపముగఁ జెప్పఁబడును.

వైదికసాహిత్యము

వైదిక సాహిత్యమునందుఁ బ్రకాశింపఁ జేయఁబడిన యంశము అధికముగనే యున్నది. అప్రకాశితాంశముకూడ తక్కువగ లేదు. కాని దుఃఖింపవలసిన విషయమేమనఁగా మన యవహేళనముచే వేదములలోని అనేక శాఖలు లుప్తములైనవి. మహాభాష్యాను (పస్పశాహ్నిక) సారముగ ఋగ్వేదమునకు ఇరువదొక్క శాఖలు కలవు. యజుర్వేదమునకు నూఱుశాఖలు, సామవేదమునకు వేయిశాఖలు, అథర్వవేదమునకుఁ గేవలము తొమ్మిది శాఖలు మాత్రమే కలవు. ఈ విధముగ మొత్తము ౧౧౩౦ శాఖలుండవలెను. కాని యిప్పుడు పది పండ్రెండు శాఖలుకంటె నెక్కువగ దొరకుట లేదు. విషయదృష్టిచే ఋగ్వేదసంహిత సమస్తసంహితలలో గొప్పదిగను, ప్రథమముగను నెన్నఁబడు చున్నది. ఋగ్వేదసూక్తము లన్నియును

గలిసి ౧౦౨౮. ఋగ్వేద విభాగము రెండువిధములుగ నుపలబ్ధ మగుచున్నది. (౧) మండలము, అనువాకము, సూక్తము. (౨) అష్టకము, అధ్యాయము, సూక్తము. ఋగ్వేదమంతయు పదిమండలములుగ విభక్తమైనది. ప్రతిమండలమందు అవాంతర విభాగమునకు అనువాకమందురు. వాటి విభాగమునకు సూక్త మందురు. అష్టకములసంఖ్య యెనిమిది. ప్రతి అష్టకమున నెనిమిది అధ్యాయములు కలవు. ఈ విధముగ మొత్తము ఋగ్వేదమున అఱువదినాలుగు అధ్యాయములు కలవు. అధ్యాయములందు సూక్తములుండును. ఈ రెంటిలో ప్రథమ విభాగము ఐతిహాసిక దృష్టిచే మహత్వపూర్ణమైనది. ఈ మండలములలో ప్రథమ దశమ మండలములందు భిన్న భిన్న ఋషులద్వారా దృష్టమంత్ర సంగ్రహము కలదు. నవమ మండలమందు కేవలము 'సోమ' విషయక మంత్రములు కలవు. కాని యన్యమండలము లందొక్క ఋషియొక్క మంత్ర సంగ్రహమే కలదు. ద్వితీయ మండలము నుండి అష్టమ మండలము వఱకు ఋషులయొక్క నామములు క్రమముగా గృత్సమద, విశ్వామిత్ర, వామదేవ, అత్రి, భారద్వాజ, వసిష్ఠ, కణ్వులు. ఈ ఋషులు మంత్రద్రష్టలేకాని రచయితలు కారు. ఋగ్వేదములోని ఆధ్యాత్మిక తత్త్వ వివేచనమే మన కిచ్చట ఆవశ్యకమగు చున్నది. కావున దాని ననుసంధించుటలో మనము ప్రవృత్తులమగుదము.

వేదములలో దేవతాస్తుతియే ప్రధానవిషయము. నిరుక్తకారుఁడగు యాస్కుఁడు స్థాన విభాగ దృష్టిచే దేవతలను మూఁడు విభాగములు చేసెను. పృథివీస్థానము, అంతరిక్ష

దేవతాబహుత్వము

స్థానము, ద్యుస్థానము. పృథివీస్థానదేవతలలో అగ్నిస్థానము చాల గొప్పది. అంతరిక్షస్థాన దేవతలలో ఇంద్రుని స్థానమును, ఆకాశ స్థానములో సూర్య, సవితా, విష్ణు మొదలగు సౌరదేవతాస్థానములు గొప్పవి. అగ్ని ప్రాణుల కన్నిటికంటె మిక్కిలి హితకారక మగు దేవత. అగ్ని ప్రాచీన, అర్వాచీన ఋషులచేఁగూడ స్తుతింపఁ బడుచున్నాఁడు. ఆయన కృపవలననే ప్రతినిత్యము ప్రాణులు ధన, అన్న, పుత్ర, పౌత్ర, సమృద్ధిని బొందుచున్నాము. వరుణుని స్థానము వైదిక దేవతలందు మిక్కిలి మహత్వపూర్ణ మైనది. ఆతఁడు విశ్వతశ్చక్షుః ( సర్వత్ర దృష్టికలవాఁడు ) ధృతవ్రత ( నియమములను ధరించువాఁడు ) సుక్రతు ( శోభన కర్మలను జేయువాఁడు ). సామ్రాట్ ( బాగుగా ప్రకాశింపఁ జేయువాఁడు, శాసనము చేయువాఁడు.) అని చెప్పఁబడినది. * సర్వజ్ఞుఁడగు వరుణుఁడు ప్రాణుల శుభాశుభకర్మలను జూచి, ఆ యా ఫలముల నొసంగును. ఇంద్రుఁడు♦ వీరులకు రణరంగమున విజయమును గలిగించు దేవత. వజ్రబాహు ( వజ్రమువలె బలముగల బాహువులు కలవాఁడు) ఇంద్రుని చేతిలోని వజ్రము. ఈతని సహాయముచే నాతఁడు వృత్రాది అనేక దానవులను జంపును. శత్రువుల కోటలతోఁ గూడిన నగరములను ఛిన్నాభిన్నము కావించును. ( పురందర ). ఈతని యనుగ్రహముననే ఆర్యులు నల్లని రంగుగల దస్యులను లేక దాసులను కొండలకుఁ దరిమి, వృత్రాసుర

* ఋగ్వేద _ ౧ మండలము ౨౫ సూక్త

♦ ఋగ్వేద _ ౨ మండలము ౧౨ సూక్త.

నిచే హరింపఁబడిన గోవులను గుహను బ్రద్దలుకొట్టి బయటకుఁ గొని వచ్చెను. ఇంద్రుఁడు వృష్టికి దేవత. విష్ణువు ఆకాశగామియు సంతత క్రియాశీలుఁడగు సూర్యునకుఁ బ్రతీకము. ఆతఁడు మూఁడడుగులతో నీ విశ్వము ను గొలిచెను.‡ ఈ కారణముననే ఉరుగాయు, ఉరుక్రముఁడని పిలువఁబడు చున్నాఁడు. మూఁడవ లోకమందు, ఆతని తృతీయపాదవిన్యాసము చేసిన చోట మధుకూపమున్నది. ఆలోకమందు శీఘ్రముగఁ బోవు భూరి శృంగములను గోవులు (కిరణములు) అటునిటు సతతము వచ్చుచుఁ బోవు చుండును. ( యత్రగావో భూరిశృంగా అయాసః. ఋగ్వే. ౧-౧౫౪-౬ ) ( వైష్ణవుల గోలోకకల్పనమున కాధార మిదియే ! భగవంతుని పరమపదమునకు గోలోకమని పేరు. అనఁగా సూర్య కిరణములు నిరవచ్ఛిన్నముగ ననవరతము ప్రసరించు లోకము. బృహద్బ్రహ్మ సంహిత ) సవితృదేవుఁడు సుప్తప్రాణులయందు జీవనసంచారము కావించి పునః ప్రవృత్తులను గావించును. పూషుఁడు (ఋ. వే. ౬-౫౩) దారితప్పిన వారికి దారినిఁ జూపించును. ఆతని రథమును మేఁకలు లాగును. ఆతని చేతిలో కొఱడా యుండును. ఆతఁడు చచ్చినవారిని పితరుల కడకుఁ గొని పోవును. మిత్రుఁడు మానవుల కందఱకు కల్యాణ సాధనము కావించును. దేవతల కందఱకును దేవులుకూడ కలరని ఋగ్వేదమునఁ గలదు. ఆకాశ (ద్యౌ) పుత్రియగు ఉషాదేవి అందఱిలో

‡ ఈ కల్పనయే వామనావతారమునకు జనని. ఈ కారణమున వామనుఁడు త్రివిక్రముఁ డనఁబడు చున్నాఁడు. పురాణములలో 'ఉరుగాయ' 'ఉరుక్రమ' అను పదములు ఈతత్త్వమును మనస్సులోఁ బెట్టుకొనియే విష్ణువునకుఁ జెప్పఁబడినవి.

నందకర్తె. ఆమె తమోమయమగు రజనికి రమణీయ రూపధారిణి యగుచెల్లెలు. ఆమె పురాణయువతి. పురాణయయ్యును యువతియే. వైదిక మంత్రములలో ఉషాదేవి యొక్క స్తుతి కమనీయమైనది. (ఋగ్వే. ౩.౬౧) పోనుపోను దేవతల సంఖ్యయందు కూడ వృద్ధిహ్రాసములు కలవు. వరుణుని మహిమ తగ్గెను. మన్యు, శ్రద్ధా మొదలగు దేవతాసృష్టి జరిగెను.

వైదిక దేవతలు పాశ్చాత్యమతము

ఈ దేవతా స్వరూప వివేచనము చేయుట మిక్కిలి యావశ్యకము. ప్రకృతియొక్క విచిత్రలీలలు మానవులకు నిత్యానుభవ విషయములు. ఈ భూమిపైఁ బుట్టినప్పటినుండి కౌతుకావహమగు ప్రాకృతికదృశ్యములచేఁ జుట్టుకొనఁబడి యున్నాఁడు. ప్రాతఃకాలమునఁ బ్రాచీదిశయందు కమనీయ కిరణ ప్రసారము కావించి భూతలమును గాంచనరంజిత మొనర్చు అగ్నిపుంజమయ సూర్యబింబము, సాయంకాలమందు రజతరశ్ములను వెదజల్లి జగన్మండలమును శీతలతా సముద్రమున ముంచు సుధాకర బింబము ఏ మానవుని హృదయమునఁ గౌతుకమయ విస్మయమును గలిగింపదు ? వర్షాకాలీన నీలగగన మండలమందు నీలమేఘముల పరుగులు, వాటి పారస్పర సంఘర్షణముచే వెలువడిన మెఱపు తీఁగలు, కర్ణకుహరములను బ్రద్దలుచేయు నురుములు మొదలగు ప్రాకృతిక దృశ్యములు మానవహృదయమున నొక విచిత్ర ప్రభావమును గలిగింపకుండఁ జాలవు. వైదిక ఆర్యులు ఈ ప్రాకృతిక లీలలను సుగమముగఁ దెలుపుటకై భిన్నభిన్న దేవతలను గల్పించిరి. ఈ విశ్వము భిన్నభిన్న దేవతలకుఁ గ్రీడానికేతనము. ఈ

దేవతల యొక్క అనుగ్రహముచే జగత్తులోని సమస్త కార్యములు నెఱవేరుచున్నవనియు, భిన్న భిన్న ప్రాకృతిక సంఘటనములు వారివలననే కలుగుచున్నవనియు వైదికార్యుల విశ్వాసము. వైదిక దేవతలు భౌతిక జగత్తులోఁ బ్రాకృతిక దృశ్యముల కధిష్ఠాతలని పాశ్చాత్య వైదిక విద్వాంసుల యభిప్రాయము. భౌతికఘటనల ఉపపత్తి కొఱకు వారిని దేవతలుగా భావించిరి. ఋగ్వేదము యొక్క ఆదిమకాలమునఁ జాలమంది దేవతలున్నట్లు భావించిరి. దానికి వారు బహుదేవతావాద (Polytheism) మని పేరిడిరి. కాలాంతరమున వైదికార్యులకు మానసిక వికాసము కలుగఁగానే వారీ బహుదేవతల కధిపతిగా ప్రధాన దేవతను జెప్పిరి. దీని నేకేశ్వరవాద* (Monotheism) మని పల్కిరి. కావున బహుదేవతా వాదమునకు తర్వాత ఏకేశ్వర వాదము జనించెను. దాని తర్వాత సర్వేశ్వరవాదము (Pinetheism) ప్రభవించినది. సర్వేశ్వర వాదమును సూచించునది పురుషసూక్త దశమ మండలముయొక్క తొంబదవ సూక్తము. పాశ్చాత్యుల లెక్క ననుసరించి యిది పదవ మండలములో మిక్కిలి అర్వాచీనమైనది.

పాశ్చాత్య విద్వాంసుల అభిప్రాయము ననుసరించి వైదిక దేవతల ఉత్పత్తి వికాసముల సంక్షిప్తచరిత్రయిది. కాని మనయొక్క దృఢవిశ్వాసము వైదిక ధర్మము యొక్క యీ వికాసక్రమము నితాంతము నిరాధారము. దేవతాత్త్వమును

* Macdonell : History of Sanskrit Literature.
Pages 116 - 138

తెలిసికొనక పోవుటయే దీనికి కారణము. వైదిక గ్రంథపఠనముచే దేవతాకల్పన మింత భౌతికము కాదని తెలియఁగలదు.

యాస్కుని నిరుక్తములో దైవతకాండ (సప్తమాధ్యాయ) మందు దేవతాస్వరూప వివేచనము మిక్కిలి స్పష్టశబ్దములతోఁ జేయఁ బడినది. నిరతిశయ ఐశ్వర్యశాలిని యగుటచే 'ఈశ్వరుఁ' డని పిలువఁబడు నొక మహత్తరమగు శక్తి ఈ జగత్తునకు మూలమందు కలదు. అది యేకము, నద్వితీయమును. ఆ యేకదేవతనే బహురూపముల స్తుతించుచుందురు.

దేవతా తత్త్వము

"మహాభాగ్యాత్ దేవతాయా ఏక ఏవ ఆత్మా బహుధా స్తూయతే।
ఏకస్యాత్మనోఽన్యే దేవాః ప్రత్యంగాని భవంతి॥ (౭-౪-౮,౯)

కావున యాస్కుని యభిప్రాయము ననుసరించి దేవతాగణము ఒకే దేవతయొక్క భిన్నభిన్నశక్తులయొక్క ప్రతీకములు. బృహద్దేవతాగ్రంథము నిరుక్తాభిప్రాయ గ్రంథము ననుమోదించుచున్నది.* కావున వెనుకటి సాహిత్యమును నిరీక్షింప వలసిన పనిలేను ఋగ్వేదాధ్యయనముచే దేవతాతత్త్వ రహస్యమును మనము బాగుగాఁ దెలిసికొనఁ గలము.

సర్వవ్యాపియు, సర్వాత్మకుఁడు నగు బ్రహ్మను నిరూపించుటయే ఋగ్వేదముయొక్క ప్రధాన లక్ష్యము. ఇదియే 'కారణసత్తా' కార్యవర్గమం దనుప్రవిష్టమై సర్వత్ర భిన్నభిన్న ఆకారములచేఁ బరిలక్షితమగు చున్నది. ప్రకృతకార్యములకు

* బృహద్దేవతా - అధ్యా ౧ శ్లో॥ ౬౧ - ౬౫,

మూలమున నొక్కే సత్తా కలదు. ఒకేవియంత, ఒకే దేవత యున్నది. ఇతర దేవతలందఱును ఈ మూలభూత సత్తాకు వికాశమాత్రములు మాత్రమే. ఇట్టి మహత్త్వపూర్ణ మగు సిద్ధాంత ప్రతిపాదనములను వివిధవిధముల వైదికఋషులు చేసి యుండిరి. ఐతరేయ ఆరణ్యకము* స్పష్ట శబ్దములతోఁ బ్రతిపాదనము చేసినదేమనఁగా ఒకే మహతీసత్తాను గుఱించిన ఉపాసనను ఋగ్వేదీయులు 'ఉక్థ' మునను, దానినే యజుర్వేదీయులు 'యాగ్నికాగ్ని' రూపమునను, సామవేదీయులు 'మహావ్రత' యాగమునను జేయుదురు. శంకరాచార్యులవారు (౧-౧-౨౫ సూత్రభాష్యమున) ఈ మంత్రము నుల్లేఖించెను. ఋగ్వేద ప్రమాణ మీ విషయమున మిక్కిలి సుస్పష్టము.

దేవతాగణము ఋగ్వేదమున 'అసుర' అని పిలువఁబడినది.♦ 'అసుర' యనఁగా అసువిశిష్ట లేక ప్రాణశక్తి సంపన్నులని అర్థము. ఇంద్ర, వరుణ, సవితా, ఉషా మొదలగు దేవతలు అసురలు. దేవతలు బలస్వరూపులు. దేవతాగణము అవినశ్వర శక్తిమాత్రులు. వారు ఆతస్థివాంసః (స్థిరముగ నుండువారు), అనంతాసః (అనంత) అజిరాసః, ఉరవః, విశ్వతస్పరి (౫-౪౭-౨) అని పిలువఁబడిరి. వారు విశ్వములోని సమస్త ప్రాణులందును

ఏతం హ్యేవ బహ్వృచా మహత్యుక్థే మీమాంసంత ఏతమగ్నావధ్వర్యవ ఏతం మహావ్రతే ఛందోగాః — ఐతరేయ ఆరణ్యకము - 3-౨-3-౧౨.

తద్దేవస్య సవితుః అసురస్య ప్రచేతసః (౪-౫3-౧)

(పర్జన్యః) అసురః పితానః (౫-౮3-౬)

మహద్విష్ణోః (ఇంద్రస్య) అసురస్యనామా (3-3౮-౪)

వ్యాపించి యుందురు. వారు 'సత్య' 'ధ్రువ' అను పేర్లతోఁ బిలువఁబడు చుండెరి. ఇంతేకాదు, ఒకసూక్త మంతటను (ఋగ్వే, తృతీయ మండలము ౫౫ సూ.) దేవతల అసురత్వ మంగీకరింపఁ బడినది. అసురత్వ మనఁగా బలము లేక సామర్థ్యము. దేవతలలోఁ గల సామర్ధ్యము ఒక్కటే భిన్న భిన్నములు స్వతంత్రములు కావు. ఈ సూక్తములో ప్రతి మంత్రము చివర నీ పదము మాటిమాటికి వచ్చుచుండును. 'మహద్దేవానా మసురత్వమేకమ్' దేవతల మహాత్సామర్ధ్య మొక్కటే. ఒకే మహామహిమాన్విత శక్తి వికసించుటచే నాశక్తులు స్వతంత్రములు కావు. వీని లోపలనుండున దొక్కటే. జీర్ణౌషధము లందును, క్రొత్త దానిని బుట్టించు ఔషధములందును, పల్లవ, పుష్పములతోఁ గూడిన ఔషధము లందును, గర్భధారణము కలిగించు ఔషధము లందును ఒకే శక్తి కలదు. దేవతల యొక్క మహాత్సామర్థ్య మొక్కటియే.

ఋతము

ఋగ్వేదములో 'ఋతము'*నకు చాల మనోరమ కల్పన కలదు. ఋతమనఁగా సత్యము లేక అవినాశమగు సత్తా. ఈ జగత్తులో ఋతము కారణముననే సృష్టియగుచున్నది. సృష్ట్యాదిని 'ఋత'మే మొట్ట మొదటగ నుత్పన్నమైనది.♦ విశ్వమందు సువ్యవస్థకు, ప్రతిష్ఠకు, నియమనమునకుఁ గారణభూతమైన దీ 'ఋత'మే. ఈ 'ఋత' ముండుటచేతనే విష

* చూడు ఋ. వే. 3_౫౫_౫.

♦ ఋతం చ సత్యం చాభీద్ధాత్ తపసోఽధ్యజాయత।

ఋ. వే. ౧౦_౧౯౦_౧

మతా స్థానమున సమత యొక్కయు, అశాంతిచోట శాంతి యొక్కయు సామ్రాజ్యము విరాజిల్లుచున్నది. ఈ సువ్యవస్థకు కారణమేది ? 'ఋత' మనగా సత్యభూతమగు బ్రహ్మ. దేవతా గణము కూడ ఋతముయొక్క స్వరూపము లేక ఋతము నుండి ఉద్భవించినవి. సోముడు ఋతము నుండి పుట్టి (ఋతజాత) వర్ధిల్లినాడు. ఆతడు స్వయముగ ఋత స్వరూపుడు. (ఋగ్వేదము ౯-౧౦౮-౮) సూర్యుడు ఋతమును పస్తారము కావించుచున్నాడు. నదులీ ఋతమునే ప్రవహింపజేయుచున్నవి.✝ (ఋ. వే. ౧-౧౦౫-౧౫) సకల దేవతలలో సకల కార్యాంతరములందు ఇదే ఋతము లేక కారణసత్తా అనుప్రవిష్టమై యున్నది. ఈసత్తాను అవలంబించియే కార్యవర్గము తమ స్థితిని నిలుపుకొనుచున్నవి.

దేవతలయొక్క ద్వివిధరూపములు - స్థూలము, సూక్ష్మము.

ఋగ్వేదములో దేవతలకు రెండురూపము లున్నట్లు కనబడుచున్నది_ ఒకటి స్థూలము. దృశ్యరూపము. రెండవది సూక్ష్మము. అదృశ్యముగనుండు గూఢరూపము. మన నేత్రములకుగనబడునది వారి స్థూలరూపము (ఆధి భౌతిక రూపము). కాని మన యింద్రియముల కతీతములైన రూపములు, భౌతికమగు నింద్రియములచే గ్రహింపరానివి వారి గూఢరూపము (ఆధి దైవిక రూపము.) ఇవికాక ఇంకొక తృతీయ రూపము కలదు_ అది ఆధ్యాత్మిక రూపము_ దీని వర్ణనము కూడ కొన్ని మంత్రములలో లభించుచున్నది. ఉదాహరణము

✝ ఋత మర్షంతి సింధవః ।

దొఱకు విష్ణువు, సూర్యుఁడు, అగ్నియొక్క త్రివిధరూపములను సమీక్ష చేయుఁడు. ఏ రూపమున విష్ణువు పార్థివలోకములను నిర్మించినాఁడో, 'ఉత్తర సధస్థ' అంతరిక్షము స్థిరముకావించెనో, మూఁడు క్రమములచే (త్రివిక్రముఁడై) నీ విశ్వమును గొలిచినాఁడో అది అతని ఒకరూపము;* కాని యివిగాక అతని పరమపదము గలదు. అక్కడ విష్ణుని సూక్ష్మరూప ముండును. దానిలో మధుచక్రమున్నది, అమృతరూపమున్నది.♦ ఆ పరమపదమును జ్ఞానసంపన్నులును, జాగరణశీలురగు విప్రులగు విద్వాంసులు మాత్రమే యెఱుఁగుదురు.‡ విష్ణు పరమపద ప్రాప్తి బ్రహ్మోపలబ్ధియే. అందువలన శ్రుతి విష్ణువు మనకు నిజమైన బంధువని చెప్పుచున్నది.

ఈ విధముగ సూర్యుని త్రివిధరూపములను గూర్చి మిక్కిలి స్పష్టవర్ణనము దొఱకుచున్నది. ఋషులు అంధకారమును దూరముచేయు సూర్యునియొక్క మూఁడురూపములను వర్ణించుచున్నారు— ఉత్, ఉత్ + తర = ఉత్తర, ఉత్ + తమ = ఉత్తమ — ఇవి క్రమముగ మాహాత్మ్యములో నొకదానికంటె నొకటి మిగులుచున్నవి. ఈ భువనములోని యంధకారమును బోఁగొట్టు యీ జ్యోతియొక్క నామము 'ఉత్'. దేవస్వరూపముతో దేవతలమధ్య నుండురూపము 'ఉత్తర' రూపము; కాని

*. ఋ. వే. ౧_౧౫౪_౧.

♦ ఋ. వే. ౧_౧౫౪_౫

‡ తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే।
విష్ణోర్యత్ పరమం పదమ్॥ ఋ వే. ౧_౨౨_౨౧

యీ రెండు రూపములకు మించిన ఒక విశిష్ట జ్యోతికలదు. దానినీ మంత్రములో 'ఉత్తమము' అన్నారు కావున నీ మూఁడు శబ్దములును సూర్యునియొక్క కార్యాత్మక, కారణాత్మక, కార్యకారణాతీత స్థితిని దెలుపుచున్నవి. కావున నీయొక్క మంత్రములలో సూర్యుని ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక స్వరూపములు చాలచక్కఁగ వర్ణింపఁబడినవి.* 'సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ' (స్థావర జంగమాత్మకమగు సమస్త విశ్వమునకు ఆత్మ సూర్యుఁడు.) ఈ మంత్రమునకు లక్ష్యము ఆధిభౌతిక సూర్యుఁడా? 'ఆత్మా' శబ్దము స్పష్టముగ సూర్యుని యొక్క పరమాత్మ తత్త్వమును లక్ష్యముగఁ బెట్టుకొని ప్రయోగింపఁబడినది.

అగ్నియొక్క స్థూలసూక్ష్మరూపముల మనోరమ కల్పన కూడ యిదేవిధముగ ఋగ్వేదములో లభించుచున్నది. ఐతరేయ ఆరణ్యకము అగ్ని రెండు విధములుగనుండునని చెప్పుచున్నది.— (౧) తిరోహితాగ్ని (౨) పురోహితాగ్ని. 'తిరోహిత' శబ్దము అగ్నియొక్క అవ్యక్త, గూఢ, సూక్ష్మరూపములను జెప్పును. కావున పురోహితాగ్ని వ్యక్తము, పార్థివాగ్నిని ప్రతిపాదించును. 'అగ్నిమీడే పురోహితమ్'♦ మంత్రములో పురోహిత లేక అభివ్యక్త పార్థివాగ్నిని గూర్చి నిర్దేశింపఁబడినది. దేవతలు భౌతిక దృశ్యమున కధిష్ఠాతలు, ప్రతీకరూపములను పాశ్చాత్య కల్పన నిర్మూలకమనియు, దానితోఁబాటుగా వైదిక ధర్మ వికాసము

* ఉద్ వయం తమసస్పరి జ్యోతిః పశ్యన్త ఉత్తరమ్ ।
దేవం . దేవత్రా సూర్యమగన్మ జ్యోతి రుత్తమమ్॥ ఋ॥ వే॥ ౧-౫౦-౧౦

♦ దేవతా తత్త్వముయొక్క విశద వివేచనము కోఁకిల కోకిలేశ్వరశాస్త్రి యొక్క అద్వైతవాదము (వంగభాష) పంచమాధ్యాయమును జూడుఁడు.

యొక్క కల్పితక్రమముకూడ అట్టి నిస్సారము కలదనియు నీ ప్రమాణములను బట్టి మనము నిస్సందేహముగఁ జెప్ప వచ్చును. సమస్త విశ్వమునకును అనుపమ శక్తిశాలిని యగునొక నియంత కలదనియు, విభిన్న దేవతలందఱు నాతని ప్రతినిధులనియు ఋగ్వేదము వలన మనకు నిశ్చయమగు చున్నది. కావున వైదిక ధర్మమే అద్వైత తత్త్వముమీఁద నాధారపడి యున్నది. నానాత్వములో నేకతయు, భిన్నతలో నభిన్నతయు దార్శనిక జగత్తులో మూలతత్త్వము. ఈ నిగూఢతమ తత్త్వము ననుసంధానము చేయు గౌరవమంతయును మన వైదిక కాలీన ఆర్షచక్షు స్సంపన్నులగు మహర్షులకే దక్కినది.

ఈ యేకదేవతకు విభిన్న సంజ్ఞలు లభించుచున్నవి — ప్రజాపతి, హిరణ్యగర్భుఁడు, పురుషుఁడు మొదలగునవి. ఋగ్వేదము యొక్క దశమ మండలములోని ౧౨౧-వ సూక్తము హిరణ్యగర్భ స్తుతిని బ్రతిపాదించు చున్నది.

హిరణ్యగర్భుఁడు

ఈ సూక్తము గాఢ ఆధ్యాత్మిక తత్త్వములతో నిండి యున్నది. ఉచ్చ దార్శనిక విచారములచే నీ సూక్తము ఋగ్వేద సూక్తములలో మహత్త్వపూర్ణమైనదిగ నెన్నఁబడు చున్నది. ఆనందరూపుఁడగుటచేతను, ఇదమిత్థమ్మని నిర్ణయింప వీలులేనివాఁడగుటచేతను, ఈ ప్రజాపతి 'కః' శబ్దము ద్వారా వ్యవహరింపఁ బడినాఁడు.* "ఈ హిరణ్యగర్భుఁడే

* "కస్మై దేవాయ హవిషా విధేమ" ఈ మంత్రము (౧౦-౧౨౧-౧) లోని "కస్మై" అనుదాని అర్థము విషయములోఁ జాల మతభేదము కలదు. పాశ్చాత్య వైదిక విద్వాంసులు దీనిని ప్రశ్నవాచక సర్వనామముగఁ జెప్పు

అన్నిటికంటె ముందుగాఁ బుట్టినాఁడు. పుట్టఁగానే యీతఁడు సమస్త జీవకోటికి అద్వితీయ మగు నధిపతి యయ్యెను. ఈతఁడీ పృథివిని, అంతరిక్షమును, ఆకాశమును ధారణచేయు వాఁడయ్యెను. యజ్ఞయాగాదులలో నాతని ప్రసాదనార్థమే మనము హావిష్యమును హోమము చేయు చుందుము", ఆతఁడు సమస్త జీవులకు ప్రాణదాత (ఆత్మదా) బలదాత యునై యున్నాఁడు. అమరత్వము, మృత్యువు ఛాయనలె నాతనికి వశములై యున్నవి.* బ్రాహ్మణ గ్రంథములలో ప్రజాపతియే సర్వశ్రేష్ఠమగు దేవత యని చెప్పఁబడినది. దేవతా సంఖ్య ముప్పది మూఁడనియు, కాని ముప్పదినాల్గవ దేవత ప్రజాపతి యనియు, నన్నఁగా సర్వశ్రేష్ఠుఁడనియు శతపథబ్రాహ్మణము (౪-౧-౨-౧౧) లోఁ జెప్పఁబడినది.

బ్రహ్మ సర్వవ్యాపియను మహత్త్వ పూర్ణమగు కల్పనా వర్ణనము అనేక సూత్రములలో లభించుచున్నది. దీనిని గూర్చిన

పురుషుఁడు — చక్కని దృష్టాంతము పురుష సూక్తము (౧౦-౯౦) లోను, అదితిసూక్తము (౧-౮౯) లోను లభించు

దురు, కాని వైదికపరంపరలో ఈ శబ్దమున కర్థము 'ప్రజాపతి' - "అత్ర కిం శబ్దోఽనిర్జ్ఞాత స్వరూపత్వా త్ప్రజాపతౌ వర్తతే యద్వా కిం సుఖమ్ తద్రూపత్వాత్ప్రజాపతిః కం ఇత్యుచ్యతే" — సాయణ భాష్యము.

హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్ ।
స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మైదేవాయ హవిషా విధేమ ॥
(ఋ. వే. ౧౦-౧౨౧-౧)

* యస్య ఛాయాఽమృతం యస్య మృత్యుః (౧౦-౧౨౧-౨)

చున్నది. ఆతఁడు వేయిశిరస్సులు (సహస్రశీర్షా పురుషః), వేయి కన్నులు, వేయికాళ్లు గల పురుషుఁడు. ఆతఁడీ నల్దిక్కులను ఈ భూమిని వ్యాపించి యింక పది అంగుళములధికముగ నున్నాఁడు. "ఇప్పుడున్నదియు, ఇది వఱకున్నదియు (భూతకాలమున) నికఁ బుట్టఁబోవునదియు (భవిష్యత్కాలమున) అంతయు పురుషుఁడే."

" పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్ "

ఈసూక్తములో సర్వేశ్వరవాద సిద్ధాంత ప్రతిపాదనము సుస్పష్టము. ఇట్లే అదితిని వర్ణించునపుడు రాహూగణపుత్రుఁడగు గౌతమ ఋషి 'అదితియే ఆకాశము, అదితి అంతరిక్షము, అదితి మాత, అదితియే పితాపుత్రులును. అదితి సమస్త దేవతలు, అదితి పంచజనులు (నిషాదులతో చతుర్వర్ణములు) పుట్టినదియుఁ బుట్టఁబోవునదియు అంతయు నదితియే—

" అదితిర్ద్యౌ రదితి రంతరిక్ష మదితిర్మాతా సపితా సపుత్రః ।
విశ్వేదేవా అదితిః పంచజనా అదితిర్జాత మదితిర్జనిత్వమ్ ॥

( ఋ. వే. ౧_౮౯_౧౦ )

ఈవిధముగ పురుషుఁడు, అదితి సర్వవ్యాపకులని చెప్పఁబడి విశ్వమున కభిన్నులుగ నంగీకరింపఁబడిరి.

స్కంభము. అథర్వవేదము యొక్క స్కంభసూక్తము (౧౦కాండ, ౭వ, ౮వ సూక్తములు) ను, ఉచ్ఛిష్ట సూక్తమును (౧౧-౯) పరీక్షించుటచే బ్రహ్మ యొక్క వ్యాపకతయు, ఆత్మ కభిన్నత్వ మనుటయు నథర్వ వేదమునకు సర్వథా మాన్యములను సంగతి మనకు స్పష్టముగ గోచరించు

చున్నది. బ్రహ్మకింకొకపేరు స్కంభము. (ఆధారము.) ఈ విశ్వములోని సమస్తపదార్థము దాని యాశ్రయముననే నివసించు చున్నవి. కావున దానికి స్కంభసంజ్ఞ అన్వర్థకము. స్కంభము విశ్వమునకుఁ గారణభూతమైనది. బ్రహ్మకుఁ గూడ అది కారణ భూతమే. కావున దానిని జ్యేష్ఠబ్రహ్మ యనియు నందురు. "దేనిలో భూమి, అంతరిక్షము, ఆకాశము సమాహితములై యున్నవో, అగ్ని, చంద్రుఁడు, సూర్యుఁడు, వాయువు దేనిలో నాకర్షితములై నివసించుచున్నవో అదియే స్కంభము." (౧౦-౭-౧౨) ద్యావాపృధివ్యంతరిక్ష ప్రదిశలను ధరించునదే స్కంభము. (౧౦-౭-౩౫) ఇంతేకాదు, అది భూతభవిష్యద్వర్తమానముల కధీశ్వరము. (౧౦-౮-౧) ఈ మంత్రము స్కంభము నకు ఆత్మకు ఐక్యమును స్పష్టశబ్దములతోఁ బ్రతిపాదించు చున్నది —

"అకామో ధీరో అమృతః స్వయంభూ, రసేన తృప్తో న కుతశ్చనోనః ।
తమేవ విద్వాన్ న విభాయ మృత్యో, రాత్మానం ధీరమజం యువానమ్॥"

(౧౦-౮-౪౪)

**ఉచ్ఛిష్టము**

ఉచ్ఛిష్ట సూక్తములో ఉచ్ఛిష్ట నామముతో బ్రహ్మ ప్రతిపాదనము కావింపఁ బడినది. 'ఉచ్ఛిష్ట' మనఁగా మిగిలిన పదార్థము. దృశ్య ప్రపంచమును నిషేధింపఁగా మిగిలినది ఉచ్ఛిష్టము అనఁగా బాధారహితమగు పరబ్రహ్మ. బ్రహ్మయొక్క యీ స్వరూపము నభివ్యక్తము కావించుటకు బృహదారణ్యకోపనిషత్తు బ్రహ్మను 'నేతి, నేతి'

అని పిలుచుచున్నది.* సూక్తమంతటను విశ్వములోని సమస్త పదార్థములు ఉచ్ఛిష్టము మీఁద నాధారపడియున్నవని చెప్పఁబడినది. సూక్తములో ప్రథమమందు♦ ప్రతిపాదింపఁబడిన "ఉచ్ఛిష్టము మీఁద నామరూపము లవలంబితములైనవి" అను సిద్ధాంతము అద్వైత వేదాంత దృష్టితో నెంత మహత్త్వపూర్ణమైనదో చూడుఁడు! 'నామరూపము'లను ఈ దృశ్యమాన జగత్తునకుఁ బ్రయోగించుట యెంత సారగర్భితమైనది? సమస్త వేదపురాణోత్పత్తి యీ ఉచ్ఛిష్టమువలననైనది. (౨౪); ప్రాణాపాన చక్షుశ్శ్రోత్ర, అక్షితి (స్థితి) క్షితి (లయము) — అన్నియు నుచ్ఛిష్టమువలనే యుత్పన్నమైనవి. (౨౫) కావున 'ఉచ్ఛిష్ట' మహిమ అవర్ణనీయము. ఈ సూక్తానుసంధానముచే ప్రజాపతి, పురుష, హిరణ్యగర్భ, స్కంభ, ఉచ్ఛిష్ట అను శబ్దములన్నియు నొకే పరమతత్త్వమునకు వాచకములు. ఉపనిషత్తుల బ్రహ్మతత్త్వమునకును, బ్రహ్మాత్మైక్య వాదమునకును ఇదియే పూర్వపీఠిక. ఈ సంకేతములయొక్క పల్లవీకరణమే ఉపనిషత్తుల ప్రధాన లక్ష్యము. ఈ వివేచనమును జదివి గీత (౧౫-౧౫) లోని 'వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః' 'ఆదావంతేచ మధ్యేచ హరిః సర్వత్ర గీయతే' అను పురాణవాక్య మందలి విషయములో నేవిధమైన సందేహమును లేదు.

---

* అథాత ఆదేశో నేతి నేతి  బృహ. ఉప. ౨-౩-౧౧
 నేహ నానాస్తి కించన  ,, ,, ౪-౨-౨౧

♦ ఉచ్ఛిష్టే నామ రూపం చోచ్ఛిష్టే లోక ఆహితః।
ఉచ్ఛిష్ట ఇంద్రశ్చాగ్నిశ్చ విశ్వమంతః సమాహితమ్॥  అ. సం. (౧౧-౯-౧)

వాయువు లేకయే తన సామర్థ్యమున శ్వాసను బీల్చుచున్నది. అది తప్ప వేఱువస్తువు లేనేలేదు.

నాసదాసీన్నో సదాసీత్తదానీం నాసీద్రజో నో వ్యోమా పరో యత్,
కిమావరీవః? కుహకస్య శర్మన్? అంభః కిమాసీత్ గహనం గభీరమ్॥
న మృత్యురాసీదమృతం న తర్హి న రాత్ర్యా అహ్న ఆసీత్ ప్రకేతః,
ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్న పరః కించనాస॥

ఇది నితాంతము ఉదాత్త ఏకత్వభావన. "తదేకమ్" అది ఒకటే. దాని లింగమును నిర్ధారణచేయలేక వైదికఋషులు సర్వత్ర ఆపరమ తత్త్వమునకు నపుంసకమగు 'తత్' 'సత్' శబ్దములను ప్రయోగించిరి. అదియే యీ జగత్తునకు మూలకారణము. దానివలననే చేతనాచేతనమగు యావత్ప్రపంచ ముత్పత్తియైనది. అది ఏకము, అద్వితీయము. దానితో సరిసమానమగు వస్తువింకొకటి వాస్తవమునకు లేదు. అగ్ని, మాతరిశ్వుడు, యముఁడు మొదలగు దేవతలు ఆతనియొక్క భిన్నభిన్న రూపములు. ఆతఁడొక్కఁడే, కాని కవు లాతనిని భిన్నభిన్న నామములతోఁ బిలుచు చుందురు.* మానవుల మధుర వాక్కులలో నాతఁడే పలుకుచున్నాఁడు, పక్షుల కలరవములలో నాతఁడే కూయుచున్నాఁడు, వికసిత పురుషుల రూపములో నాతఁడే నవ్వుచున్నాఁడు; ప్రచండగర్జనములలోను, తుపానులలోను ఆతఁడే క్రోధభావమును జూపుచున్నాఁడు; నభోమండలమందు చంద్రసూర్య

* ఇంద్రం మిత్రం వరుణమగ్నిమాహురథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్
ఏకం సద్విప్రా వదంతి బహుధా అగ్నిం యమం మాతరిశ్వానమాహుః॥

(ఋ. వే. ౧-౧౬౪-౪౬)

లను తారలను తత్తత్ స్థానములందు స్థిరముగ నిలుపు చున్నాఁడు.♦ భిన్నత్వములో నభిన్నత్వము నెవరైన చూచి నారా యనిన నది వైదిక ఆర్యులే. ఈ అభిన్నత్వము యొక్క పల్లవీకరణమే ఉపనిషత్తులయొక్క ప్రధాన విషయము; కాని దీని బీజము ఋగ్వేదీయ సంహితలో సుస్పష్టముగ నిహితమై యున్నది. దానిని సందేహించుట కేమాత్రము వీలులేదు.

బ్రాహ్మణారణ్యకములను సమీక్షచేయుటచే మనము వాటి సిద్ధాంతములను దెలిసికొనఁగలము. ఈకాలము సంహితోపనిషత్కాలములకు మధ్యయుగము. దీనిలో వర్ణాశ్రమధర్మ ప్రతిష్ఠ బాగుగఁ జేయఁ బడినది. తైత్తిరీయ బ్రాహ్మణము (3-౧౨-3) చతుర్వర్ణములతోఁ బాటుగా చతురాశ్రమముల ధర్మములనుగూడ వర్ణించి యుండెను.

బ్రాహ్మణములు–ఆరణ్యకములు

'బ్రాహ్మణము' లలో కర్మకాండ విస్తార మధికముగఁ జేయఁబడినది. యజ్ఞమహత్త్వము ఏదో దేవతా విశేషోద్దేశ్యముచే ద్రవ్యమును త్యాగరూపమున నొసంగుటయే కాదు సరిగదా అది యీ విశ్వమునకు నియామకరూపమున నున్నదిగ గ్రహింపఁబడినది. సమస్త విశ్వము యజ్ఞరూపమే. యజ్ఞకారణమున దేవతలు తమ తమ అధికారములను నిర్వర్తించుచుందురు. యజ్ఞనిష్పత్తిచే సమస్త విశ్వమునకుఁ గల్యాణ సాధనము కాఁగలదు. యజ్ఞము విష్ణుస్వరూపముగఁ జెప్పఁబడినది (విష్ణుర్వైయజ్ఞః) ఆరణ్యకములలో యజ్ఞమునకు దార వ్యాఖ్యయు, దాని రహస్యమును గూర్చి యథార్థ మీమా

♦ ఋ. వే. ౧౦_౧౨౧_౫

కలదు. ఆరణ్యకములలో కర్మఫలముల యెడల అశ్రద్ధాభావము కనఁబడుచున్నది. స్వర్గక్షయమగుటచే కర్మమార్గమాత్యంతిక సుఖసంపాదకముగఁ జెప్పఁబడలేదు. అందువలన కర్మలనుండి ప్రజల యభిరుచి తగ్గిపోసాగెను. అప్పుడు జ్ఞానమార్గము వైపునకును, దానిధ్యానము వైపునకును మనస్సాకర్షింపఁ బడుచుండెను. కావున ఉపనిషత్కాలమున ప్రధానముగనుండిన జ్ఞానకర్మల సమన్వయ విషయము ఈయుగములోనే ఆరంభమైనది.

## ఉపనిషత్తులు

వేదమునకు అంతిమభాగములు ఉపనిషత్తులు. ఈ గ్రంథ రత్నములలో వైదికఋషులు ఆధ్యాత్మిక విద్యలోని గూఢ రహస్యములను గూర్చి విశద వివేచనమును గావించిరి.

**మహత్వము** భారతీయ తత్త్వజ్ఞానము యొక్క మూలస్రోత ఈ ఉపనిషత్తులలోఁ గలదు; ఉపనిషత్తులు వాస్తవముగ ఆధ్యాత్మిక మానస సరోవరములు. వాటినుండి భిన్నభిన్న జ్ఞానస్రవంతులు బయలుదేఱి యీ పుణ్యభూమియగు నార్యావర్తములో మానవమాత్రులకు ఐహికాభ్యుదయమును, ఆముష్మికకల్యాణమును బ్రసాదించుటకుఁ బ్రవహించుచుండును. వైదిక ధర్మానుసారముగ గంతవ్యమార్గమును, దాని సాధనమును బ్రతిపాదించు ప్రస్థాన గ్రంథములు హిందూమతమునకు మూఁడు కలవు. భారతీయ విచారశాస్త్రమునకు సర్వశ్రేష్ఠమగు నుపజీవ్య గ్రంథమగుటచే నుపనిషత్తులు ప్రస్థానత్రయాంతర్గతమున ప్రథమ ప్రస్థాన రూపమున గ్రహింపఁబడినవి. సమస్తోపనిషద్రూపమగు

గోవువలన వత్సరూపియగు పార్థుని కొఱకు గోపాలకృష్ణస్వామి ద్వారా పితుకఁబడిన సుధాసహోదరమగు సారభూతమగు క్షీరములగు శ్రీమద్భగవద్గీత ద్వితీయ ప్రస్థానము. తృతీయ ప్రస్థానము బాదరాయణ వ్యాసవిరచితమగు బ్రహ్మసూత్రములు. దీనిలో నాపాతతః విరుద్ధమగు నుపనిషద్వాక్యములను సమన్వయపఱచి; ఏకమాత్రాభిప్రాయమును బ్రహ్మమందుఁ జూపి, అన్యతార్కికయుక్తులు ఖండింపఁబడినవి. ఈ ప్రస్థానత్రయము — ఉపనిషత్తులు, గీత, బ్రహ్మసూత్రములు — మీఁద భారతీయ వైదికధర్మము, దర్శనము ఆధారపడి యున్నది; కాని గీతా బ్రహ్మసూత్రములు ఉపనిషదాశ్రితము లగుటచే నుపనిషత్తుల మహత్త్వ మన్నిటి కంటె నధికమైనది. దీనివలన నవీనమత సంస్థాపకాచార్యులు తమ సిద్ధాంతములయొక్క ప్రామాణికతను, అక్షుణ్ణతను ప్రదర్శించుట కొఱకు ఈ గ్రంథరత్నములను మూఁడింటి మీఁద స్వమతానుకూల భాష్యగ్రంథములను రచించిరి.

ఉపనిషత్ శబ్దము ఉత్, ని ఉపసర్గకమగు సత్ ధాతువు వలన క్విప్ ప్రత్యయమును జోడించుటచే నిష్పన్నమైనది. సత్ ధాతువునకు మూఁడర్థములు కలవు —

'ఉపనిషత్' శబ్దార్థము

విశరణ=నాశమగుట, గతి=ప్రాప్తించుట, అవసాధన=శిథిలము చేయుట, ఉపనిషత్ అనఁగా అధ్యాత్మవిద్య. ఏవిద్యను అధ్యయనము చేయుటచే దృష్టానుశ్రవిక విషయముల నుండి వితృష్ణ ముముక్షు జనముల సంసారబీజ భూతమగు నవిద్య నశించునో, ఏవిద్య బ్రహ్మప్రాప్తిని గలుగఁజేయునో, దేనిని బరిశీలించుటచే గర్భవాసాది దుఃఖబృందములు పూర్తిగా

శిథిలములగునో అట్టి ఆధ్యాత్మిక విద్య ఉపనిషత్తు.* శంకరాచార్యులవారి యీ వ్యాఖ్యానానుసారముగ ఉపనిషద్భాష్యమునకు ముఖ్యార్థము బ్రహ్మవిద్య, గౌణార్థము,♦ — బ్రహ్మవిద్యా ప్రతిపాదకమగు గ్రంథ విశేషము. బ్రహ్మస్వరూపము, దానివలనఁ బుట్టిన జీవ జగత్తులతో దానికి గల వాస్తవిక సంబంధము, బ్రహ్మప్రాప్త్యుపాయము మొదలగు విషయములను గూర్చిన విశద వివేచన మీ గ్రంథమునఁ జేయఁబడినది. కావున వీనికి 'ఉపనిషత్' సంజ్ఞ అన్వర్థకము.

ప్రాచీనకాలమున ప్రతి వైదిక శాఖకు ప్రత్యేకోపనిషత్తు కలదు, కాని నేఁ డన్ని ఉపనిషత్తులు దొరకుటలేదు. ముక్తికోపనిషత్తులో దొరకు ఉపనిషత్తుల సూచిక యీయఁబడినది‡

సంఖ్య

దానిననుసరించి ఉపనిషత్తులు ౧౦౮. అందులో ౧౦ ఋగ్వేదమునకు సంబంధించినవి. ౧౯ శుక్ల యజుర్వేదమునకు, ౩౨ కృష్ణయజుర్వేదమునకు, ౧౬ సామవేదమునకు, ౩౧ అథర్వణ వేదమునకు సంబంధించినవి. కాని ముక్తికోపనిషదధ్యయనముచే నుపనిషత్తు లింక నెక్కువగ నున్నవని తెలియుచున్నది. అష్టోత్తర శతోపనిషత్తులు ఉపనిషత్సాహిత్యమునకు సారభూతములైనవి.† కొద్దికాలము క్రిందట అడయారు (మద్రాసు) థియసాఫికల్

* కఠోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తుల శంకరభాష్యోపోద్ఘాతము జూడుడు.

♦ తస్మాద్విద్యాయాం ముఖ్యయా వృత్త్యా ఉపనిషచ్ఛబ్దో వర్తతే, గ్రంథేతు భక్త్యా — కఠభాష్యము పుట. ౨.

‡ ముక్తికోపనిషత్తు ప్రథమాధ్యాయము (ఉపనిషత్సంగ్రహము. పుట ౫౪౯-౫౫౯)

† సర్వోపనిషదాం మధ్యే సారమష్టోత్తరం శతం ।
సకృచ్ఛ్రవణ మాత్రేణ సర్వాఘౌఘ నికృంతనమ్॥ ముక్తికోపనిషత్తు (౧-౪౪)

సొస్సైటీవారు అప్రకటితములగు నుపనిషత్తులను షుమారు అఱువదింటిని బ్రకటించిరి. వానిలోఁ గొన్ని యుపనిషత్తుల కనువాదమును దారాశికోహ్ (షాహజహాన్ జ్యేష్ఠపుత్రుఁడు) పారశీ భాషలో ౧౭ శతాబ్దములోఁ జేసియుండెను.

ఈ ౧౦౮ ఉపనిషత్తులలోఁ గూడ పన్రెండు పదమూఁడు ఉపనిషత్తులు విషయప్రతిపాదనము యొక్క విశదతను బట్టియు, ప్రాచీనతను బట్టియు మిక్కిలి ప్రామాణికములుగ నెన్నఁబడినవి. ఋగ్వేదీయ ఉపనిషత్తులలో ఐతరేయ, కౌషీతకీయ, సామ ఉపనిషత్తులలో ఛాందోగ్య, కేన ఉపనిషత్తులును; కృష్ణయజుస్సులోనివి తైత్తిరీయ, మహానారాయణ, కఠ, శ్వేతాశ్వతర, మైత్రాయణీయములును; శుక్లయజుస్సులో ఈశావాస్య, బృహదారణ్యకములును; అథర్వోపనిషత్తులలో ముండక, మాండుక్య ప్రశ్నోపనిషత్తులు నితాంత ప్రసిద్ధములుగను, ప్రాచీనములుగను, ప్రామాణికములుగను అంగీకరింపఁబడినవి. శంకరాచార్యులవారి ౧౧ ఉపనిషత్తుల మీఁద భాష్యమును వ్రాసి యుండెను. — ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండుక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యక, నృసింహపూర్వతాపినీ. ఇవి కాక తన భాష్యములలో నాతఁడు దాదాపు ౭ యితరములగు నుపనిషత్తులను బ్రమాణము కొఱకు ఉద్ధృతము కావించి యుండెను. వీనిలో శంకరాచార్యులచే వ్యాఖ్యానింపఁబడిన ఉపనిషద్గ్రంథము లత్యంత మహత్వశాలినిగ నెన్నఁబడుట చేతను, లోకప్రియము లగుటచేతను వాటియొక్క పఠన పాఠనములు నేఁడధికముగ జరుగు చున్నవి. వీనిలోఁగూడ ఛాందోగ్యబృహదా

రణ్యకములు అన్నిటికంటె నవీనములుగాను [illegible]గాను, ప్రాచీనములుగాను అంగీకరింపబడెను. కొన్ని ఉపనిషత్తులు గద్యాత్మకములు, కొన్ని పద్యాత్మకములు, కొన్ని గద్యపద్యాత్మకములు. ఉపనిషద్రచనా కాలము విషయములో ఆలోచకులలో పర్యాప్తమగు మతభేదము కలదు. ప్రధానమగు ఉపనిషత్తులు బుద్ధునికి చాల ముందుగానే రచింపబడిన వనుట నిశ్చితము; కాని సమస్తోపనిషత్తుల నిర్మాణ మొకనాటి విషయముకాక అనేక శతాబ్దముల ప్రయత్నపరిణామము. విషయ [illegible] దృష్టిచే ఉపనిషచ్ఛ్రేణీవిభాగము చేయవచ్చును. కొన్ని ఉపనిషత్తులు వేదాంత (ఆత్మ-బ్రహ్మల స్వరూపము, పరస్పర సంబంధము) ప్రతిపాదకములు, కొన్ని యోగస్వరూప నివేదనము [illegible]ము లైనవి, కాని ఉపనిషత్తులలో చాలవరకు శివ, విష్ణు, శక్తి దేవతాపరకములు.

ఉపనిషత్ప్రతిపాద్య సిద్ధాంతమును గైకొని భారతీయ దార్శనికులు చాలగ పరిశీలించిరి. ప్రాచీన [illegible] ఉపనిషత్తులలో నొకే సిద్ధాంతము [illegible] కలదని ముఖ్యతాత్పర్యము అంగీకరించిరి. ఉపనిషత్తులలో అద్వైత శ్రుతి, విశిష్టాద్వైతశ్రుతి, ద్వైతశ్రుతులు [illegible] కాదనలేరు. ఈ శ్రుతులన్నియు [illegible] భేదమే. ఆచార్యులు స్వసిద్ధాంత [illegible] శ్రుతులను ప్రధానత్వేన గ్రహించి, అన్యశ్రుతులను గౌణములనుచు వాటి యొక్క యుపపత్తిని జూపించిరి. శ్రీ శంకరాచార్యులవారు ఉపనిషత్తులకు భాష్యమును వ్రాసి వానిలో అద్వైతమునే

ప్రతిపాదించిరి. శ్రీ రామానుజాచార్యులవారు స్వయముగ నుపనిషత్తులకు భాష్యమును వ్రాయలేదు కాని ఆతని శిష్యులు విశిష్టాద్వైతానుసారముగ నవాంతరకాలమున వృత్తులను లిఖించిరి. రామానుజులవారి వ్యాఖ్యానానుసారముగ ఉపనిషత్తులు విశిష్టాద్వైతసిద్ధాంత ప్రతిపాదకములు. శ్రీమన్మధ్వాచార్యులవారు కొన్ని ప్రధాన ఉపనిషత్తులమీఁద భాష్యమును వ్రాసిరి. వారి దృష్టిననుసరించి ఈ గ్రంథరత్నముల ముఖ్యతాత్పర్యము బ్రహ్మకు, ఆత్మకు భిన్నత్వము — ద్వైతమును ప్రతిపాదించుటలోఁ గలదు; కాని ఆధునిక ఆలోచకుల మతముచే నుపనిషత్తులలోఁ సమస్తదర్శనముల బీజము లున్నవనియే, ఈ సూక్ష్మ సూచనలను గ్రహించి తర్వాత వచ్చిన దార్శనికులు తమ తమ సిద్ధాంతములను పల్లవితము కావించి, వాటిని స్వతంత్రరూపేణ ప్రతిష్ఠితము కావించిరి. ఆస్తిక దర్శనముల సంగతి కేమి కాని జైన బౌద్ధ దర్శనములవంటి నాస్తిక దర్శనములయొక్క మూల సిద్ధాంతములుకూడ ఉపనిషత్తులలో లభించుచున్నవి. నిజమునకు ఉపనిషత్తులు వైదికకాలీన ఋషుల ఆధ్యాత్మిక విచారముల బహుమూల్య భాండాగారములు. ఈ విచారములలో సువ్యవస్థ యున్నప్పటికిని అక్కడక్కడ వికీర్ణత అధికముగ నున్నది. ఋషుల యొక్క ఆధ్యాత్మికానుభవము సూత్రరూపేణ యీ గ్రంథములలో వర్ణింపఁబడినవి. అందువలన నీ యుపదేశములలో సామంజస్యము లేకపోవుట స్వాభావికమే అయినప్పటికిని ఉపనిషత్తుల యొక్క తారతమ్య పరీక్షవలన వాని మూలభూత సిద్ధాంతముల స్పష్టీకరణము చేయవచ్చును.

## (౧) ఆత్మతత్త్వము

ఉపనిషత్తులలో ఆత్మ స్వరూప వివేచనము మిక్కిలి క్షుణ్ణముగఁ జేయఁబడినది. ఆత్మ యీజీవితాంతము వఱకే యుండునా? లేక యీజీవితము సమాప్తిఅయిన తర్వాత కూడ ఉండునా? ఈ సమస్యను గూర్చిన మీమాంస కఠోపనిషత్తులో మిక్కిలి చక్కఁగఁ జేయఁబడినది. నచికేతుఁడు యమరాజుతో ఈ సమస్య చిక్కువిడదీయ వలసినదని పట్టుపట్టెను. మృత్యువు సమస్త రహస్యములకు రహస్యము. దానిని గూర్చిన యథోచిత వివేచనమును యముఁడు స్వయముగఁజేసెను. ఆత్మ నిత్యవస్తువు. అది యెన్నటికిని చావదు. అవస్థాది కృతదోషములు దానినంటవు. అది విషయగ్రహణముచేయు మన సమస్తేంద్రియముల చేతను, సంకల్ప వికల్పాత్మకమగు మనస్సుచేతను, వివేచనాత్మకమగు బుద్ధి చేతను, మన సత్తాకు కారణభూతమగు ప్రాణములకతీతమైనది. ఒకరమణీయ రూపకముద్వారా యీ తత్త్వము వర్ణింపఁబడినది. "ఈ శరీరము రథము, బుద్ధి సారథి, మనస్సు ప్రగ్రహము (కళ్లెము.) ఇంద్రియములు గుఱ్ఱములు, ఇవి విషయరూపమగు మార్గమున నడచుచుండును. ఆత్మ రథస్వామి* ఆత్మను రథినిగాఁ జెప్పి యముఁడు ఆత్మయొక్క సర్వశ్రేష్ఠతను ప్రతిపాదించెను.

---

* ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు।
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ॥
ఇంద్రియాణి హయానాహు ర్విషయాం స్తేషు గోచరాన్।
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః॥

కఠోపనిషత్తు _౩_౩_౪_౧౦_౧౧

రథస్వామి యొక్క కార్యముకొఱకే రథాది వస్తువ్యాపారము జరుగుచుండును. అట్లే రథిస్థానీయ ఆత్మకొఱకే శరీరాది విషయ వ్యాపారము జరుగుచుండును. బాహ్య విషయములనుండి ఆరంభమై శ్రేష్ఠతాక్రమమున విచారము చేయునెడల ఆత్మయే సర్వశ్రేష్ఠముగఁ దేలుచున్నది.

**'ఆత్మన్' శబ్దోత్పత్తి**

'ఆత్మన్' శబ్దోత్పత్తిని గూర్చి విచారించినచో దాని స్వరూపము యొక్క యథార్థపరిచయము లభింపఁ గలదు. అనేకకారణములచే నీ నామకరణము చేయఁ బడినది. శంకరులొక ప్రాచీనశ్లోకము నుదాహరించి సమస్త వ్యుత్పత్తుల నొక్కసారిగ ప్రదర్శించెను. ఆత్మజగత్తులోని సమస్త పదార్థము లందును వ్యాపించి నది. ( ఆప్నోతి ) సమస్త వస్తువులను తన స్వరూపములోనికి గ్రహించును. (అత్తి) ఇది యెల్లప్పుడుండును. (సంతతో భావః) ఈ కారణమున నాత్మకు 'ఆత్మత్వము' సిద్ధించినది.* కల్పిత వస్తు వున్నదనుటకు అధిష్ఠాన మున్నదని యొప్పుకొన వలయును. కొన్ని సర్పములున్నవనుటకు తదధిష్ఠానభూతమగు రజ్జువు నిరంతరముండి తీరును. అట్లే కల్పిత జగత్తు ఉన్నదనుటకు ఆత్మ నిరంతర మున్నదని అనఁగా సంతతసత్తా ( నిత్యత్వము ) అంగీకరింపఁబడినది. "ఏ మానవుఁడైనను ప్రాణమువలనను జీవింప లేఁడు, అపానమువలనను జీవింపలేఁడు; కాని యీ ప్రాణాపాన

---

* శ్లో॥ యదాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ ।
యచ్చాస్య సంతతో భావ స్తస్మాదాత్మేతి కీర్త్యతే ॥
కఠ. ఉప. (౨-౧-౧) శంకరభాష్యము.

ముల రెంటికి ఆశ్రయమైయున్న యా తత్త్వమందు జీవించును.”
ఆతత్త్వమేది ? ఆత్మ. ( కఠ. ఉప. ౨-౨-౫ )

ఆత్మస్వరూప వివేచనము ఉపనిషత్తులలోఁ జాల చక్కగ చేయఁబడినది. ఋషులచే చేతనమునకు నాల్గు స్థితులు చెప్పఁబడినవి. క్రింది తరగతులకుఁ జెందిన మూఁడు

శుద్ధాత్మయొక్క చైతన్య స్వరూపత్వము

తరగతులలోను ఆత్మ యుండదు. కాని అన్నిటికంటె నుచ్చకోటికి జెందిన చైతన్యములో ఆత్మస్వరూప తాత్త్వికోపలబ్ధి కలుగును. శరీరచైతన్యము, స్వప్నచైతన్యము, సుషుప్తి చైతన్యములనుండి సర్వథా వేఱుగా నుండి తన శుద్ధ అమిశ్రిత రూపమున నుండును. ఈ సిద్ధాంతమును బ్రతిపాదించుటకు ఛాందోగ్యోపనిషత్తులో (౮-౭) ఒక మిక్కిలి రోచకమగు నాఖ్యాయిక వర్ణింపఁ బడినది. దేవతలు, అసురులు ఆత్మతత్త్వ జిజ్ఞాసచేఁ బ్రేరితులై ఇంద్ర విరోచనులను బ్రజాపతి దగ్గఱకుఁ బంపిరి. ప్రజాపతి ముప్పది రెండు సంవత్సరములు తపస్సు చేసిన తర్వాత కన్నులలోను, జలమందును, అద్దమందును కనఁబడు పురుషుఁడే ఆత్మయని ఆత్మతత్త్వమును బోధించెను. విరోచనున కీ బోధవలన సంతోషము కలిగెను కాని యింద్రుని మనస్సులో సుందరాలంకారములచే శరీరము నలంకరించినచో నాత్మభూషితమైనట్లు తోఁచు చున్నది, కాని శరీరమే ఆత్మయా ? అను శంక యుదయించెను. శరీరమునకు ఆత్మకు తాదాత్మ్యమున్నచో శరీరమునకు అంధత్వ, బధిరత్వాది దోషములు ఆత్మకుకూడ ఉన్నట్లొప్పుకొనవలయును. ఈ శంకను నిరాకరించుటకు ప్రజాపతి స్వప్నచైతన్యమే ఆత్మ

యని చెప్పెను; కాని దోషనిరాసము కాలేదు; ఏలననఁగా స్వప్నములో మనము దుఃఖానుభవమును బొందు చున్నాము, కన్నులనుండి అశ్రుధారలు కారుచుండును, కాని ఆనందరూపముగు ఆత్మకు దుఃఖమున్నదని అంగీకరించుటెట్లు ? ఇంద్రుఁడు మరల రాఁగా ప్రజాపతి సుషుప్తికాలములో నుండు చైతన్యము ఆత్మ యని చెప్పెను. కాని విచారింపఁగా నింద్రుని మనస్సులో మరల శంక కలిగెను. సుషుప్తి కాలములో తానున్న జ్ఞానమును లేదు, బాహ్యావస్తు జ్ఞానమును లేదు. ఆ సమయమున జీవుఁడు కొయ్యమొద్దువలెఁ జైతన్యహీనుఁడుగఁ దోఁచును. ఇట్లు శంకింపఁగాఁ జివరకు ప్రజాపతి ఈ మూఁడు చైతన్యములకు వేఱుగ నుపాధి రహితముగ నున్న శుద్ధచైతన్యమే ఆత్మస్వరూపమని చెప్పెను. ఆత్మ స్వచైతన్యరూపము. భిన్నభిన్న దర్శనములు భిన్నభిన్న చైతన్యములనే ఆత్మగాఁ జెప్పినవి, కాని వాస్తవిక ఆత్మ వీటి అన్నిటికి భిన్నముగనున్న శుద్ధచైతన్యరూపము.

**ఆత్మ యొక్క నాల్గు అవస్థలు**

మాండూక్యోపనిత్తులోఁగూడ శుద్ధాత్మ 'తురీయ' ముగఁ జెప్పఁబడినది. జాగ్రత్, స్వప్న, సుషుప్తులు ఆ ఆత్మకు విభిన్నావస్థలు. జాగ్రదావస్థలో ఆత్మ బాహ్యావస్తువులఁ దెలిసికొనును. స్వప్నావస్థలో నభ్యంతర మానస జగత్తు ననుభవించును. సుషుప్త్యవస్థ (ఘోర నిద్రితావస్థ) లో నాతఁడు కేవలము తన ఆనందస్వరూపము ననుభవించును. ఈ మూఁడవస్థలును ఆత్మ యొక్క అపరావస్థలను సూచించును. వీనిలో నున్న ఆత్మకుఁ గ్రమముగ విశ్వ, తైజస, ప్రాజ్ఞులను సంజ్ఞ వచ్చును. కాని యీ

మూఁడవస్థలలోను ఆత్మయొక్క అంశమాత్రమే పరిచయమగు చున్నది. కాని యీయవస్థలలోఁ గల గుణములన్నియు పూర్ణాత్మలోఁ గనఁబడవు. "ఆసమయములో బాహ్యచైతన్యముగాని, అంతశ్చైతన్యముగాని, రెంటియొక్క సమ్మిశ్రణముగాని, ప్రజ్ఞగాని, అప్రజ్ఞగాని యుండదు. అదృష్ట, అగ్రాహ్య, అవ్యవహార్య, అలక్షణ (లక్షణము లేక చిహ్నము లేనిది) అచింత్యనీయ, అవ్యపదేశ్య (నామరహితము) కేవలాత్మప్రత్యయసార (ఒక్క ఆత్మ యొక్క సత్తాయే కేవలము భానమగుచుండును) ప్రపంచోపశమ (సమస్త బాహ్యజగత్తు శాంతించుచోటు) శాంత, శివ, అద్వైత మను చతుర్థలక్షణములచేఁ జెప్పఁబడునది. ఇదియే ఆత్మ. దీనినే యెఱుఁగవలయును." (మాండూక్య ఉప. ౭) ఈ యాత్మ తురీయ (జాగ్రదాది అవస్థాత్రయమునకు వేఱుగ నుండుటచే చతుర్థము.) మనఁబడుచున్నది. ఈయాత్మ కూటస్థమగు నవికారి. ఈకూటస్థ ఆత్మయొక్క ఏకత నిర్గుణ బ్రహ్మతో సర్వతోభావేన కలుగునని చెప్పఁబడినది. ఓంకార మీ ఆత్మకు ద్యోతకాక్షరము. ఈ విధముగ శుద్ధాత్మ యొక్క వాస్తవ స్వరూపము నిషేధముఖేన వర్ణింపఁగలము.

## (౨) బ్రహ్మతత్త్వము

ఉపనిషదధ్యాత్మవేత్తలగు ఋషులు ఈనానాత్మక సతత పరివర్తన శీలమగు నీ యనిత్య జగత్తునకు మూలమందున్న శాశ్వత సత్తాత్మక పదార్థాన్వేషణము తాత్త్విక దృష్టిచేఁ జేసిరని చెప్పఁబడినది. ఈ యన్వేషణకార్యమందు వారు మూఁడు విభిన్న పద్ధతుల నుపయోగించిరి. ఆధిభౌతికము, ఆధిదైవికము, ఆధ్యా

త్మకము. అధిభౌతిక పద్ధతి యీ భౌతిక జగత్తుయొక్క ఉత్పత్తి స్థితిలయములను బరిశీలించి విలక్షణ నిత్యపదార్థ నిర్వచనమందు సమర్థమగుచున్నది. అధిదైవిక పద్ధతి నానారూప నానాస్వభావ ధారులగు దేవతలందు శక్తి సంచారము కావించు ఒకే పరమాత్మతత్త్వము నన్వేషించి బయటకు దీయును. అధ్యాత్మిక పద్ధతియందు మానసప్రక్రియలను, శారీరక కార్యకలాపముల నవలోకించుటచే దానికి మూలభూతమగు నాత్మతత్త్వ నిరూపణము చేయఁబడుచున్నది. ఈ మూఁడు పద్ధతుల నుపయోగించుటచే నుపనిషత్కాలీన దార్శనికు లే పరమతత్త్వ పరమసత్యభూత పదార్థము నూహ కావించిరో దానిని బ్రహ్మ మందురు.

ద్వివిధ బ్రహ్మలు — సగుణము — నిర్గుణము.

ఉపనిషత్తులలో బ్రహ్మయొక్క ద్వివిధ స్వరూపముల విశదవర్ణనము లభించుచున్నది — సవిశేషము లేక సగుణ రూపము, నిర్విశేషము లేక నిర్గుణ రూపము. ఈ రెండు భావములలో భేద నిర్దేశము చేయుటకు నిర్విశేషభావమును పరబ్రహ్మయనియు, సవిశేషభావమును అపరబ్రహ్మయనియు, మఱియు శబ్దబ్రహ్మ యనియుఁ జెప్పబడినది. ఏదైన విశేషముచేఁ గాని, లక్షణముచేఁగాని లక్షితము గానిదియు, నే చిహ్నముచేనైనఁ దానిని గుర్తించుటకు బరిచయముచేయఁ దగనిది, అది ధరించు గుణమును దేనినైనఁ జెప్పసాధ్యముకానిది నిర్విశేషబ్రహ్మము. అందువలన నీ నిర్విశేష భావమునకు ని ణము, నిరుపాధి, నిర్వికల్పము మొదలగు పేర్లతోఁ బిలుచుచుందురు. సవిశేషభావము పూర్తిగా దీనికి విపరీతముగనుండును.

దానియందు గుణము, చిహ్నము, లక్షణము, విశేషణము లుం డును. వాని ద్వారా దాని స్వరూపమును హృదయంగమము కావించుకొన వచ్చును. ఈ రెండు భావములను ప్రదర్శించుటకు ఉపనిషత్తులు రెండు విధములగు వాక్యములను ప్రయోగించినవి. ఒకటి నిర్విశేషలింగము, రెండవది సవిశేషలింగము. సవిశేషలింగ శ్రుతులు సర్వకర్మా, సర్వకామః, సర్వగంధః, సర్వరసః మొదలగునవి. నిర్విశేషలింగ శ్రుతులు అస్థూలమ్, అనణు, అహ్రస్వమ్, అదీర్ఘమ్ మొదలగునవి.* ఈ వాక్యములలో నొక విశేషత ధ్యానయోగ్యమైనది కలదు. సవిశేష బ్రహ్మమునకు సర్వకర్మా, సర్వరసః మొదలగు పుంలింగ శబ్దములను ప్రయోగించి యుండెను; కాని నిర్విశేష బ్రహ్మమునకు నపుంసకలింగము ద్వారా పరబ్రహ్మ నిర్దేశము కావించి యుండెను. కారణ మే మనఁగా పరబ్రహ్మ 'తత్' పదము ద్వారా నిర్దేశింపఁ బడును కాని 'సః' పదముద్వారా నిర్దేశింపఁ బడదు. శ్రుతి వాక్యములలో నిట్టిపార్థక్యమున్నప్పటికిని తద్ద్వారా ప్రతిపాదింపఁ బడిన పదార్థమం దే విధమగు వైషమ్యమును లేదు. నిర్విశేష, సవిశేషములు భావ విభేద సూచకములు; వీనిలో వస్తుగత విభేదము లేనేలేదు. సగుణ నిర్గుణ, సోపాధి నిరుపాధి శబ్దము లొకే బ్రహ్మతత్త్వ నిర్దేశకములు. ఏలనఁగా బ్రహ్మతత్త్వ ప్రతిపాదక శ్రుతులు ఒకే మంత్రమందు ఉభయలింగ శబ్దములను ప్రయో

---

* సంతి ఉభయలింగాః శ్రుతయో బ్రహ్మవిషయాః । సర్వకర్మేత్యాద్యా సవిశేషలింగాః, అస్థూల మనణు ఇత్యేవమాద్యాశ్చ నిర్విశేష లింగాః ॥

శంకరభాష్యము.

గించి యుండెను. ముండకోపనిషత్ (౧-౧-౬) లో బ్రహ్మ వర్ణన మిట్లు చేయఁబడినది.

యత్ తత్ అద్రేశ్యమగ్రాహ్యమ్, అగోత్రమ్, అవర్ణమ్, అచక్షుః శ్రోత్రమ్, తత్ అపాణిపాదమ్ (ఇంతవఱకు నిర్విశేష బ్రహ్మసూచన) నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం తదభూతయోనిం పరిపశ్యంతి ధీరాః (ఈ పుంలింగ శబ్దములచే సవిశేష బ్రహ్మ నిర్దేశము కావింపఁబడినది.) ఈ విధముగ నొకే మంత్రము ఉభయవిధ పదములద్వారా బ్రహ్మ తత్త్వ ప్రతిపాదనము కావించినప్పుడు దానిలో నేవిధమగు వస్తుగత పార్థక్యము లేదని నిశ్చయ మగుచున్నది. భాష్యకారులలో నీ యుభయలింగ వాక్యములను గైకొనుటచే గాఢమతభేదము కలదు. శంకరాచార్యులవారు శ్రుతి నిర్గుణబ్రహ్మనే ప్రతిపాదించుచున్న దందురు, కాని రామానుజులవారు దానిని సగుణబ్రహ్మ ప్రతిపాదకముగ నంగీకరించు చున్నారు. కాని పరమతత్త్వ మొక్కటే, దానిని సగుణమనుఁడు లేదా నిర్గుణమనుఁడు.

## సగుణ బ్రహ్మ

అపర లేక సగుణ బ్రహ్మ పరిచయము ఉపనిషత్తులలో రెండు విధములుగ నీయఁబడినది. ఏదైన వస్తుపరిచయమునకొఱకు దాని లక్షణము లవసరము లగు చున్నవి. ఈ లక్షణములు రెండు విధములుగ నుండును — తటస్థలక్షణము, స్వరూప లక్షణము. దేనిద్వారా వస్తువుయొక్క శుద్ధస్వరూప పరిచయము ప్రాప్తించునో, వస్తువుయొక్క తాత్త్విక రూపములభించునో,

దానిని స్వరూపలక్షణ మందురు. తటస్థ లక్షణము ద్వారా వస్తువు యొక్క అస్థాయియై, పరివర్తనశీలమగు గుణవర్ణనము చేయఁ బడును. సగుణబ్రహ్మకు ఉభయవిధ లక్షణములు ఉపనిషత్తులలో లభించు చున్నవి.

స్వరూప లక్షణమును బట్టి బ్రహ్మ సత్యము, జ్ఞానము, అనంతరూపము. ( సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ : తైత్తి. ఉప. ౨-౧ ) అది విజ్ఞానము, ఆనందరూపము ( విజ్ఞానమానందం బ్రహ్మ - బృహ. ఉప. ౩-౯-౨౮ ) ఉపనిషత్తులలో బ్రహ్మకు మూఁడు శక్తులున్నట్లు చెప్పఁబడినవి. జ్ఞానశక్తి, బలశక్తి, క్రియాశక్తి. ( పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబల క్రియా చ - శ్వేతా. ఉప. ౬. ౮ )

బ్రహ్మ యొక్క స్వరూప లక్షణము

సగుణ బ్రహ్మయొక్క తటస్థలక్షణము ఛాందోగ్యోపనిషత్తులో కేవలమొక శబ్దములోఁ జేయఁబడినది. అది తజ్జలాన్ * అని, తజ్జ, తల్ల, తదన్ — ఈ మూఁడు శబ్దముల యొక్క సంక్షేపమీ శబ్దమునఁ జేయఁబడినది. ఈ జగత్తు బ్రహ్మవలన నుత్పన్నమగు చున్నది. ( తజ్జ ) దానిలోనే లీన మగును. ( తల్ల ) దాని కారణముననే స్థితికాలమందు ప్రాణధారణచేయుచున్నది. ( తదన్ ) ఈ జగత్తుయొక్క ఉత్పత్తి స్థితిలయములకుఁ గారణభూత మగు పరమతత్త్వమును బ్రహ్మ అందురు. తైత్తిరీయోపనిషత్తులో

బ్రహ్మ యొక్క తటస్థ లక్షణము

* తజ్జలానితి శాంత ఉపాసీత ( ఛా. ఉప. ౩-౧౪-౧ )

నీ సిద్ధాంత ప్రతిపాదనము చాల చక్కని శబ్దములతోఁ జేయఁబడినది.* బ్రహ్మసూత్రములోని 'జన్మాద్యస్యయతః' (౧-౧-౨) సూత్రములో బ్రహ్మ యొక్క యీ తటస్థలక్షణమే కలదు. "అది అన్నిటికధిపతి, సర్వజ్ఞము, అంతర్యామి. అది అన్నిటికిని గారణభూతమైనది. దానివలననే అన్ని జీవులు ఉత్పన్నమగుచున్నవి. దానిలోనే లీనమగుచున్నవి." (మాండుక్య. ఉప. ౬) సగుణబ్రహ్మ యీ ప్రపంచమునకు శాసకుఁడు. ఆతఁడీ జగత్తులోని సమస్త నివాసులకు భాగ్యవిధాత. శుభకర్మలు చేయువారల కాతఁడు కల్యాణసాధనము గావించును. భుక్తిముక్తుల నొసంగును; కాని యశుభకర్మలు చేయువారల నెల్లప్పుడును దండించును. ఈతఁడే ఈశ్వరుఁడు, విరాట్, హిరణ్యగర్భుఁడు అని పిలువఁబడును. ఈ విశ్వములోని సమస్త ప్రాణులు ఆతని శరీరములు— అందఱ కాళ్లతో నడచును, అందఱ చేతులతోఁ బనిచేయును, అందఱ కండ్లతోఁ జూచును, అందఱ చెవులతో వినును. బ్రహ్మ అఖండ శక్తుల కాధారము. ఆతఁడు ప్రకృతి శక్తులను శాసించును. ఆతని శక్తివలననే దేవతలలో శక్తిసంచారము కలుగుచున్నది. కేనోపనిషత్తు (తృతీయ ఖండము) లో బ్రహ్మయొక్క సర్వశక్తిమత్త్వమును గూర్చి మిక్కిలి రోచకమగు నాఖ్యాయిక కలదు. దాని తాత్పర్యమిది. అగ్నిలో స్వతః దాహక శక్తి లేదు. వాయువులో తృణమును గదలించు సామర్థ్యమును లేదు. ఈ ప్రాకృతిక శక్తులు తమ ప్రబల సామర్థ్యమును జూచుకొని గర్వించునెడల అది అనుచితమే. బ్రహ్మయొక్క శక్తి

* యతో వా ఇమాని భూతాని జాయంతే, యతో జాతాని జీవంతి, యత్ప్రయం త్యభివిశంతి, తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ (తైత్తి ఉప. ౩-౧)

బలమున జగత్పదార్థములలోని శక్తి పరిచయము కలుగు చున్నది. నమ్రత బ్రహ్మజ్ఞానమునకు సహాయకము, అభిమానము అజ్ఞానమునకు బాధకము. ఇంద్రుని యొక్క నమ్రతచేతనే ఉమాహైమవతీదేవి (జ్ఞానదేవి) బ్రహ్మను పరిచయము కావించుట కావిర్భించినది. ఆమె కృపవలననే ఇంద్రుఁడు దేవతల కధిపతియయ్యెను.

## నిర్గుణబ్రహ్మ

బ్రహ్మయొక్క నిర్విశేష, నిర్గుణభావము ఏ విశేషణము చేతను విశేషింపఁబడదనియు, ఏ చిహ్నముచేనైనను చిహ్నితము కాదనియు, గుణములచే నిర్దిష్టము చేయఁబడఁ జాలదనియు నిదివఱకే నిరూపించితిమి. అనఁగా పరబ్రహ్మ నిర్విశేష నిర్వికల్ప, నిరుపాధికము. అది అనిర్దేశ్యము— దాని నేవిధముగనైనను నిర్దేశింప వీలులేదు. వస్తు నిర్దేశమేదైన గుణముద్వారానే అగును. కాని బ్రహ్మ నిర్గుణుఁడైనప్పుడు దానిని నిర్దేశించుట మిక్కిలి అసంభవము. ఆకారణముననే బాష్కలఋషి బ్రహ్మవిషయమును గూర్చి మాటిమాటికి అడుగఁగా బాధ్వఋషి మౌనము నవలంబించి ఆతని ప్రశ్నమునకు సమాధానమిచ్చెను.* గుణములు బొత్తుగా లేకపోవుటచే బ్రహ్మభావాత్మక వర్ణనముండఁ జాలదు. ఇది యిట్టిది కాదని నిషేధముఖముననే తెలిసికొనవలసి

* బాష్కలినా చ బాధ్వః పృష్టః సన్నవచనేనైవ బ్రహ్మ ప్రోవాచేతి శ్రూయతే- సహోవాచ అధీహి భో ఇతి। స తూష్ణీం బభూవ। తం హ ద్వితీయే వా తృతీయే వా వచన ఉవాచ "బ్రూమః ఖలు త్వం తు న విజానాసి। ఉపశాంతో ఽయమాత్మా" శంకరభాష్యము 3-౨-౧౭

యున్నది; అందువలన శ్రుతి సదా నేతినేతి (ఇదికాదు ఇదికాదు) అని చెప్పి దానిపరిచయము కావించును. బృహదారణ్యక శ్రుతి (౪-౪-౨౨)— స ఏష నేతి నేతి ఆత్మా। అథాత ఆదేశో భవతి, నేతి నేతి, నహ్యేతస్మాత్ అన్యత్ పరమ్ అస్తి' అని చెప్పుచున్నది.

అందువలన పరబ్రహ్మను వర్ణించుటలో శ్రుతివాక్యములందు 'న' అవ్యయము చాల బాహుళ్యముగ దృష్టిగోచరమగు చున్నది. బృహ. (3-౮-౮) అనుసారముగ నది అస్థూల, అనణు, అహ్రస్వ, అదీర్ఘము. కఠ ( ౧-3-౧౫ ) దానిని అశబ్ద, అస్పర్శ, అరూప, అవ్యయ, అరస, అగంధవత్, అనాది, అనంతముగఁ జెప్పినది.

బృహదారణ్యకోపనిషత్తు ( 3-౮-౮ ) యాజ్ఞవల్క్యుఁడు గార్గికి ఉపదేశించు సమయమున 'అక్షర' స్వరూపముగ వివేచించెను. — "ఓ గార్గీ ! ఆ అక్షరబ్రహ్మము స్థూలము కాదు, అణువు కాదు; హ్రస్వముకాదు, దీర్ఘము కాదు, రక్తము కాదు, మనువు కాదు, ఇది ఛాయకు భిన్నమైనది, అంధకారమునకు వేఱైనది; వాయువునకు అకాశమునకు వేఱైనది; అసంగము, రస గంధములు లేనిది, చక్షువు దానిని గ్రహింపఁజాలదు, శ్రోత్రమును గ్రహింపఁజాలదు; మనోవాక్కుల కది విషయము కాదు; అది తేజోరహితమైనది. ప్రాణ, ముఖములతో దానికి సంబంధము లేదు; అది పరిమాణ రహితమైనది, లోపల లేదు; బయటను లేదు; అది యేమియుఁ దినదు, దాని నేదియుఁ దినఁజాలదు."

కేనోపనిషత్తులో నిష్ప్రపంచబ్రహ్మను గూర్చి గొప్ప సజీవ వర్ణనము కలదు.

యద్వాచాఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే।
తదేవబ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే॥ (౧-౫)

దేనిని వాక్కు చెప్పఁజాలదో, కాని దేనిశక్తిచే వాక్కు పలుకుచున్నదో, దానినే నీవు బ్రహ్మ యని తెలిసికొనుము. నీవు ఉపాసించునది మాత్రము కాదు.

కాని బ్రహ్మ నిరుపాధి. దేశకాల, నిమిత్తరూప మగు నుపాధులు లేనిది. అది దేశాతీత, కాలాతీత, నిమిత్తాతీతమైనది. ప్రమాణాతీతమైన దగుటచే నది పూర్తిగ నప్రమేయమైనది. చైతన్యాత్మకమగుటచే బ్రహ్మ స్వయముగ విషయమగుచున్నది. కావున నది యే ప్రాణియొక్క అంతఃకరణవృత్తి జ్ఞానమునకు విషయ మెన్నటికిని గాఁజాలదు; బ్రహ్మను 'అరసం' 'అశబ్దం' అను కారణము. అది శబ్దస్పర్శాదులకు తుల్యమగు విషయము కాఁజాలదనియే. అది విపులకాయ అగాధప్రశాంత సముద్రము వంటిదని చెప్పవచ్చును. ఈ జగత్తులోని సమస్త ప్రకాశమునకు హేతుభూతమైనదీ బ్రహ్మయే. "అచ్చట సూర్యుఁడు వెలుఁగఁడు, చంద్రుఁడును వెలుఁగఁడు. చుక్కలుగాని, విద్యున్మెఱుపులు గాని మెఱయవు; ఈ యగ్ని యెట్లు వెలుఁగఁ గలదు? అది వెలుఁగుటచే సమస్త వస్తువులు మెఱయు చున్నవి; దాని ప్రకాశముచే నివియన్నియుఁ బ్రకాశించు చున్నవి. (కఠ. ఉప. ౫-౧౫)

బ్రహ్మయే యీసృష్టికి ఉపాదాన కారణము, నిమిత్త కారణమును. ముండకోపనిషత్తు (౧-౧-౭) యిట్లు చెప్పుచున్నది.

సాలెపురుగు తన శరీరమునుండి దారమును దీసి మరల తన శరీరములోనికే యెట్లు గ్రహించునో, పృథివినుండి ఓషధులెట్లుత్పన్నము లగుచున్నవో; పురుషుని నుండి కేశలోమము లుత్పన్నములగుచున్నవో అట్లే యీ నిత్యబ్రహ్మ (అక్షరము) నుండి యీ సమస్తవిశ్వము ఉత్పన్నమగు చున్నది.* పరమాత్మనుండి మొదటగా నుత్పన్నమైనది ఆకాశము; ఆకాశమునుండి వాయువు; వాయువువలన అగ్ని; అగ్నివలన జలము; జలమువలన పృథివి, పృథివినుండి సమస్త జీవ జంతుమయ మగు జగత్తు. ఈ జగత్తు లయమగు క్రమము దీనికి పూర్తి వ్యతిరేకము.

జగత్తు

## (౩) ఉపనిషత్తుల వ్యవహారపక్షము.

ఉపనిషత్తుల వ్యవహారపక్షము మిక్కిలి సుందరమైనది. దార్శనిక తత్త్వములను వ్యవహారములోనికి దెచ్చి దానిచే మానవ జీవితమును ప్రభావాన్వితము కావించుటలో విచార శాస్త్రముయొక్క విశేషతకలదని మేమిదివఱకే చెప్పియుంటిమి. ఉపనిషదాచార మీమాంస మిక్కిలి యుపయోగము, మనోరమము. ఉన్నత ఆధ్యాత్మిక పథమున నారూఢులగుటకు అనేక సద్గుణము లుండుట ఆవశ్యకము. బృహదారణ్యకోపనిషత (౫-౨-౧-౩) ఒక మిక్కిలి రోచకమగు నాఖ్యాయిక ద్వా దమము (ఆత్మసంయమము) దానము, దయను గూర్చి శిక్ష.

---

* యథోర్ణనాభిః సృజతే గృహ్ణతేచ యథా పృథివ్యా మోషధయః సంభవంతి
యథాసతః పురుషాత్ కేశలోమాని తథాక్షరాత్ సంభవతీహ విశ్వమ్
(ముం. ఉప. ౧-౧-౭)

నిచ్చెను.* ఛాందోగ్యము (3-17-4) తపస్సు, దానము, ఆర్జవము, అహింస, సత్యవచనము ఆధ్యాత్మికోన్నతియందు సాధనములుగఁ జెప్పఁబడినవి. తైత్తిరీయము (1-2-1-3) గురుగృహమునుండి ప్రత్యావర్తన సమయమున స్నాతకునకు మిక్కిలి చక్కని శిక్షణము నొసంగెను. ఈశిక్షణములలో మాతా పితా గురులసేవ, స్వాధ్యాయ చింతనము, ధర్మాచరణములకు మహత్త్వపూర్ణమగు స్థాన మొసంగబడినది; కాని 'సత్యంవద'కు సమస్తోపదేశములలో విశిష్టగౌరవము ప్రాప్తించినది. ఛాందోగ్యము (4-4-1-5) సత్యకామ జాబాల కథలో సత్యశిక్షణమునకు చాల బలమీయఁబడినది. ప్రశ్నోపనిషత్తునందు అనృత భాషణమును గూర్చిన నిందయు♦, ముండకము (3-1-6) నందు సత్యమును గూర్చిన ప్రశస్త ప్రశంసయుఁ✝ గలదు. సత్యము తర్వాత శమ, దమ, ఉపరతి, తితిక్షా, సమాధాన ప్రాప్తులు కూడ అంతటి ఆవశ్యకమైనవే. (బృహ. ఉప. (4-4-23) కాని జ్ఞానసాధనకు మూలభూత గుణములు వివేక వైరాగ్యములు. బ్రహ్మప్రాప్తి లక్ష్యమందు వివేకము - (సత్యాసత్య వివేచనము), శ్రేయ ప్రేయముల వాస్తవిక నిర్ధారణము, ప్రపంచమునుండి ఆత్యంతిక వైరాగ్య ముత్పన్నము కానంతవఱకు జీవుఁడు ముందుకు పోఁజాలఁడు. ముండకము (1-2-12) ఈ గుణములకు

* వీషా దైవీ వాగనువదతి స్తనయిత్నుర్దద దఇతి, దామ్యత దత్త దయధ్వమితి. తదేతత్త్రియం శిక్షేత్ దమం దానం దయామితి. (బృహ. ఉప. 5-2-3)

♦ సమూలో వా ఏష పరిశుష్యతి యోఽనృతం వదతి. (ప్రశ్న. ఉప. 6-1)

✝ సత్యమేవ జయతే నానృతం సత్యేన పంథా వితతో దేవయానః. (ముండక ఉప. 3-1-6)

విశేషమహత్త్వ మొసంగినవి. "కర్మద్వారా ప్రాప్తించిన లోకములు వినశ్వరములు; అను నీ విషయమును దెలిసికొనుటచేతనే బ్రాహ్మణుని హృదయములో నిర్వేదవైరాగ్యము లుదయించును. కృత (కర్మ) ము ద్వారా అకృతము (నిత్యము, బ్రహ్మము) లభింపదని వివేకమే వానికి నిశ్చయము కావించును."

కర్మస్వాతంత్ర్యము

కర్మచేయుటలో మనము స్వతంత్రులమా, కాదా? ఉపనిషత్తు కర్మచేయుట కాత్మ స్వతంత్రమైనదని స్పష్ట శబ్దములతోఁ జెప్పుచున్నది. బృహదారణ్యకము నిస్సందిగ్ధశబ్దములతో సంకల్ప స్వతంత్రతను బ్రతిపాదించినది. "ఈ పురుషుఁడు కామమయుఁడు; వాని యిచ్ఛ యెట్లుండునో వాని క్రతు (సంకల్పము) కూడ అట్లే యుండును; సంకల్పానుసారముగ నాతఁడు కర్మ చేయును.* కౌషీతకీ (౩-౯) కర్మ చేయుటలో మానవుఁడు స్వతంత్రుఁడు కాఁడనెను కాని ఛాందోగ్యమందు ఈ స్వతంత్రతను గూర్చి చక్కని వర్ణనము కలదు. ఆత్మజ్ఞానము కలిగిన తర్వాతనే మానవుఁ డందఱిలోఁ దిరుగఁగలఁడు (ఛా. ఉప. ౮-౧౬); వాఁడు దేనిని గోరునో అది వాని సంకల్పమాత్రము చేతనే యుత్పన్నమగును. (ఛా. ఉప. ౮-౨-౧౦) ముక్తికోపనిషత్తు (౨-౫-౬) లో స్పష్టముగ పురుషార్థమునకే బలమీయఁబడినది___

---

* అథో ఖల్వాహుః కామమయ ఏవాయం పురుష ఇతి। స యథా కామో భవతి తత్క్రతుర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే । యత్కర్మ కురుతే తదభి సంపద్యతే। బృహ. ఉప. (౪-౪-౫)

**శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనా సరిత్ ।**
**పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి ।**
**అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయేత్ ॥**

"వాసనా రూపమగు నది శుభమార్గము, అశుభమార్గములందు ప్రవహించుచుండును. మానవుఁడు ప్రయత్నము ద్వారా అశుభములందు లగ్నమైన వాసనలను శుభమునకుఁ గొనిపోవలయును." కర్మ నిష్పాదనమందు ఆత్మ స్వాతంత్రమను నుపపాదనమే ఉపనిషత్తులలోని సమస్త శిక్షణముల సారము.

ఈ బ్రహ్మాండములో ననేక లోకములు కలవు. అన్నిటి కంటె నుచ్చలోకము బ్రహ్మలోకము. ఉపనిషత్తులు ( ఛా. ఉప. ౪-౧౫; బృహ. ౬-౨; కౌషీ ౧-౨-3 ) మిక్కిలి విస్తారముగ

**వివిధ యానము**
**దేవయానము-పితృయానము**

మృత్యువును బొందిన తర్వాత ప్రతి ప్రాణియు వారివారి కర్మానుసారముగ విభిన్న లోకములకు పోవు విభిన్న మార్గములను వర్ణించి యుండెను. ఈ యాత్రకు రెండు ప్రధాన మార్గము లున్నవి — దేవయానము, పితృయానము. జ్ఞాన కర్మసముచ్చయ అనుష్ఠాతయు, జ్ఞానముతోఁ గూడ శ్రద్ధా తపస్యాది శోభన కర్మలు చేయువాఁడు నగు పురుషుఁడు దేవయానము ద్వారా బ్రహ్మలోకమునకుఁ బోవును; ఆనందమయ మగు బ్రహ్మలోకమునకు పోయినను తన యుపాసనను జేయుచునే యుండును. చివరకు పరబ్రహ్మమందు లీనమగును. ఇష్టాపూర్తము (శ్రౌత స్మార్తకర్మ)ల ననుష్ఠించు కర్మ మార్గానుయాయులు పితృయానము ద్వారా చంద్రలోకమునకుఁ బోవు

దురు. అంత కర్మానుసారముగ సుఖము ననుభవించి వారు మరల నీలోకమునకు వచ్చెదరు. శుభకర్మ యింకను మిగిలియున్న యెడల నే ధనికుల కుటుంబములలోనో పుట్టుచుందురు; అశుభ కర్మ లింకను మిగిలిన యెడల చెడ్డ కుటుంబములలో జన్మించు చుందురు. విధ్యుక్తముగ మరల నుపాసనానుష్ఠానము చేయు నెడల వారు దేవయాన మార్గము నాశ్రయించి బ్రహ్మలోకము నకుఁ బోవుదురు. దీనిని క్రమముక్తి యందురు. ఈ రెండు యానములుకాక మూఁడవ మార్గ మింకొకటి యున్నది. దానిని 'యాన' మనరు 'గతి' యందురు. దీనికి పరిభాషా సంజ్ఞ 'జాయస్వమ్రియస్వ' - పుట్టుట చచ్చుట. పశుపక్ష్యాదులవలెఁ గర్మ కనధికారు లగువారును, అధికారులయ్యును అశుభకర్మ సంపాదకులైనవారి కీమూఁడవగతి కలుగును. (ఛా.ఉప.౫-౧౦-౮) కాని యీ క్రమముక్తికికూడ అసంతుష్టి చెందువారు కలరు. వారు సద్యోముక్తి (ఆలశ్యములేకుండ ముక్తి)ని కోరుచుందురు. ఉపనిషత్తు వారికిఁగూడ వ్యవస్థ కావించినది. ఆత్మజ్ఞానము లేక పోవుటయే బంధనమునకుఁ గారణము. "మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహాం నానేవ పశ్యతి" (కఠ. ౪-౧౧) ఆ పురుషుఁడు మృత్యువును బొందిన తర్వాత నీజగత్తునం దనేకత్వమును జూచు మృత్యువును బొందుచున్నాఁడు. కావున నీ జగత్తులో వ్యాప్తమైన ఏకతానుభవము చేయువ్యక్తి తన జ్ఞాన బలము మీఁద సద్యోముక్తిని ఒకే జీవితములోఁ బ్రాప్తింప వచ్చును. బృహదారణ్యకశ్రుతి* 'ఏ పురుషుని హృదయము

* యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృదిస్థితాః, అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే॥ (౪-౪-౭)

లోని సమస్తకామనలు వదలిపోవునో, ఆతఁడు మరణశీలుఁడై నప్పటికిని అమృతుఁ డగును. అమరత్వమును బొందును. ఈ లోకములోనే బ్రహ్మమును బొందును. ఆ సమయమున వాని అంగము, ప్రాణములు వాని శరీరమునుండి విముక్తిని జెందవు. బ్రహ్మరూపుఁడై ఆతఁడాపురుషుని బొందును.'♦ ఏకత్వజ్ఞానమున కిది అమృత ఫలము. కావున తన బహుమూల్య జీవితమును సాధారణవస్తుప్రాప్తికై వినియోగింపక ఆత్మోపలబ్ధికి ఉపయోగింపవలయుననుటయే మానవమాత్రునకు ఉచ్చమగు నుద్దేశ్యమై యుండవలెను. ఏలనఁగా "దానినిఁ దెలిసికొనియే మానవుఁడు మృత్యు ఆవాగమనమును దాఁటఁ గలఁడు; వెళ్లుటకు ఆత్మ సాక్షాత్కారముకాక వేఱు లేనేలేదు."* కావున తీవ్రజ్ఞానప్రాప్తి కలుగగానే సద్యోముక్తి లభించును. జ్ఞాని ప్రారబ్ధకర్మ అనుభవించవలసిన పనియులేదు. కావుననే గీతలో సుసమిద్ధాగ్నివలె సుసమిద్ధ జ్ఞానము సమస్త కర్మలను (ప్రారబ్ధకర్మలను గూడ) నాశము కావించునని చెప్పబడినది. ఇంతకుఁ దేలినదేమనగా విశుద్ధజ్ఞానమువలన సద్యోముక్తియు, జ్ఞానకర్మ సముచ్చయముచే దేవయానమును, కేవల శోభన కర్మలచే పితృయానము అశోభన కర్మానుష్ఠానముచే మూఁడవదగు గతిప్రాప్తి కలుగును.

---

♦ న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి॥
బృహ. ఉప. (౪-౪-౭).

* తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి। నాన్యః పంథా విద్యతేఽయనాయ.
శ్వేత. ఉప. ౩-౮

## (౪) ఉపనిషత్తుల చరమలక్ష్యము

ఉపనిషత్తుల చరమలక్ష్యమేమి? కొన్ని గ్రంథములను జదువఁగాఁ గలిగిన ఆత్మ తత్త్వవిషయక జ్ఞానమేనా దాని లక్ష్యము? ఉపనిషత్సిద్ధాంతములందు మౌళిభూత సిద్ధాంతము— ఆత్మ యొక్క అపరోక్షానుభూతి, పరోక్షానుభూతిచే మనకు మన స్వార్థమేమి సిద్ధింపఁగలదు? మన ప్రయత్నముచే మన తాత్త్విక స్వరూపమును దెలిసికొనఁజాలనంత వఱకు అనఁగా 'స్వ'రూపము యొక్క సాక్షాదనుభవము కలుగనంతవఱకు శాస్త్ర రోమంథనము — చర్విత చర్వణ అపార్థక ప్రయత్నమే. శంకరాచార్యులవారు శుష్క జ్ఞానమును నిందించుటకు ఉపనిషత్త్వానుసరణమునే కావించియుండెను.* ఉపనిషత్తులలో నీ యపరోక్షానుభూతికి ఆచార్య మహిమావర్ణనము చక్కని శబ్దములలోఁ జేయఁబడినది. దీనికి ప్రధానతమ సాధనము ఓంకారోపాసన. నిరంతరము ఓంకారధ్యానము చేసినచో నిగూఢదేవతా దర్శనముకూడ చేయవచ్చును. (శ్వేతా. ౧-౧౪) ఈ ప్రసంగములోనే 'యోగము' యొక్క ఉపయోగము శ్వేతాశ్వతరమందు వర్ణింపఁబడినది. (౨-౮-౧౦) ఛాందోగ్యము మిక్కిలి రోచకమగు భాషలో నీ పరమ తత్త్వ నిరూపణమును గావించెను. సుఖము రెండు విధములుగ నుండును — అల్పసుఖము - అధికసుఖము.

---

* వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవిజ్ఞాన కౌశలమ్ ।
వైదుష్యం విదుషాం తద్వత్ భుక్తయే న తు ముక్తయే॥
అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా ।
విజ్ఞాతేఽపి పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా॥
వివేకచూడామణి ౬౦-౬౧

విషయ ప్రపంచములోని సుఖోపలబ్ధి అల్పకోటికి జెందినది. కాని వాస్తవ సుఖము ఆ 'భూమా' = సర్వత్ర విద్యమానమగు నాత్మోపలబ్ధిలోనే కలదు. ఆయాత్మ పైన ఉన్నది, క్రింద నున్నది; ముందున్నది; వెనుకనున్నది, దక్షిణముననున్నది, ఉత్తరముననున్నది. పరమతత్త్వమునకే భూమా యందురు. ఎక్కడ రెండవదానిని జూడమో, రెండవదానిని వినమో, రెండవ దానిని యెఱుఁగమో, అదియే భూమ. భూమయే అమృతము; అల్పమైనది మర్త్యము-అనిత్యము- "యోవై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి - యత్ర నాన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి స భూమా, యోవై భూమా తదమృతం అథ తదల్పం తన్మర్త్యమ్" (ఛా. ౭-౨౨)

సాక్షాత్తుగ నీయాత్మోపలబ్ధి కలిగిన తర్వాత నేమగును ? ఆతఁడు 'స్వారాజ్య' ప్రాప్తిని జెందును; ఆతఁడు తన ఆత్మలోఁ గ్రీడించును. (ఆత్మక్రీడః) తన యాత్మ సంగానుభవము కలుగును (ఆత్మమిథునః) తన యాత్మతయందు నిరతిశయానందమును బొందును. (ఆత్మానందః) ఆత్మ ఆనందరూపమైనది. కావున స్వోపలబ్ధి యనఁగా నాతఁడు తన యానందమయ రూపమునందు విహరించుట. కాని యా యానంద పరిమాణము లౌకిక దృష్టాంతములతోఁ జెప్పఁబడఁ గలదా ? బృహదారణ్యకము (४-3-౨౧) ఒక లౌకికోదాహరణ ముచే దానియొక్క ఆభాసము కొంచెముగ నిచ్చెను. అది చెప్పిన దిది—— ప్రియాలింగనమున పురుషుఁడు బయట వస్తువునుగాని, లోపలి విషయముగాని తెలియనట్లే ప్రాజ్ఞ ఆత్మ (పరమాత్మ)తో

స్వారాజ్యప్రాప్తి.

ఆలింగనము కలిగినప్పుడు జీవునకు బాహ్యము తెలియదు, అంతరమును దెలియదు. ఆసమయమున నాతని కామనలన్నియుఁ బూర్తియగును; ఏలననఁగా నాత్మోపలబ్ధిచే నేకోరికయు నింక మిగిలియుండదు.

తద్ యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద, నాంతరమ్; ఏవమేవాయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద నాంతరమ్ తద్వా అస్య ఏతదాప్తకామమ్ అకామం రూపమ్.

(బృహ. ४ - ३ - ౨౧)

కాని లౌకిక భాషలో నా అచింత్య, సర్వకామ, సర్వగంధ పరమాత్మ తత్త్వోపలబ్ధి తెలియఁబడఁ గలదా? ఈ సమస్తోపాయములు వ్యర్థములు. ఆత్మవేత్తయే దానిని దెలిసికొనఁ గలఁడు. గ్రహింపఁ గలఁడు కాని యాస్థితిని బొందునప్పటికి ఆవాగ్వ్యాపారము సిలిచిపోవును. అతఁడు మూఁగయగును. ఇంకఁజెప్పునదెవరు? వినునది యెవరు? ఆ సమయమున "శివః కేవలోఽహమ్" అను నపూర్వోపలబ్ధి కల్గును. ఆత్మ నిరతిశయానందమును బొందుచుండును. ఈస్థితి స్వానుభవము వలననే తెలిసికొనఁదగినది; పరానుభూతి ఒక నీరస ప్రతిబింబము. ఈ యపరోక్షానుభూతియే శ్రౌతదర్శనమునకు హృదయము. దీనిని మనము ఉపనిషత్తులలోని 'రహస్యవాద' మని చెప్పవచ్చును. ఉపనిషత్తులలోని యన్యసిద్ధాంతములు దీనికి సాధనమాత్రములు. ఈ రహస్యవాదము శ్రౌతదర్శన సారము, రహస్యాతి రహస్యము, ఉపనిషత్తుల కుపనిషత్తు. ఔపనిషత్తత్త్వజ్ఞానమున కిది చూడాంతకల్పన.



# భారతీయదర్శనము

## తృతీయపరిచ్ఛేదము

## గీతాదర్శనము

### (౧) మహాభారత పూర్వకాలము

ఉపనిషద్యుగము తరువాతటి శతాబ్దములు చాలవిలక్షణ మైనవి. ఉపనిషత్కాలములోనే వైదికధర్మమును విరోధించు దార్శనికులున్నట్లు కనఁబడుచున్నది. (కఠ. ఉప. ౧-౧-౨౦) కాని యింతవఱకు మందముగఁ బ్రజ్వలించుచున్న యావిరోధాగ్ని యిప్పుడు తీక్ష్ణరూపమున మండుచుండెను. భిన్నభిన్నమతముల వారు విరోధ పతాకము నెగురవేసిరి. విరోధ విషయముల వైదిక ధర్మము, దర్శనము - వీరు ధార్మిక, దార్శనిక శ్రద్ధలను మూాల చ్ఛేదము కావించివేసిరి. ఈ విరోధమతస్థుల సంఖ్యాధిక్యము

మన దృష్టిని ఆకర్షించును. ఈ యుగములోని యితిహాస సాధనము మిక్కిలి స్వల్పము, కాని యిప్పటికి లభించిన యాధారములను బట్టి యీ యుగములో సక్రియ విరోధ తీవ్రత నూహింపవచ్చును. జైన అంగములు, బౌద్ధ నికాయములు, బ్రాహ్మణగ్రంథములలోను, తర్వాత వచ్చిన ఉపనిషత్తులు, మహాభారతము నందును, ఏ తద్విషయకమగు ప్రచురసామగ్రి లభించుచున్నది. అది పరస్పరము పూర్తికావించుచు, దాని ప్రామాణికతను బ్రదర్శించుచున్నది. వీనిని పరిశీలించుటచే జైన బౌద్ధ ధర్మములయొక్క సత్యస్వరూప పరిచయము లభించుచున్నది. ఇవి ఈ విరోధ దశలయందు సామంజస్య ముత్పన్నము చేయుటకుఁ బూర్తిగఁ బ్రయత్నించుచున్నవి. ఆ సమయమున అక్రియావాదము బయలుదేఱి 'ఏ కర్మయునులేదు, క్రియయు లేదు, ఏ ప్రయత్నము (నత్థికమ్మ, నత్థికిరియం, నత్థివిరియం) లే'దని ప్రచారముచేసినవి. దీనికిఁ బ్రత్యుత్తరముగ జైనదర్శన మీమతమును ఖండించుచు కర్మకలదనియు, ఉత్థానము (ప్రయత్నము) కలదనియు, బలమున్నదనియు, వీర్యమున్నదనియు ఘోషించినవి. (అత్థి ఉత్థానేతివా, కమ్మేతివా, బలేతివా, విరియేతివా, పురిసకారే పరక్కమేతివా; భగవతీసూత్రము ౧-౩-౫.) ఈ విధమగు సిద్ధాంతమును బౌద్ధ ధర్మముకూడ అంగీకరించినది. ఆ కారణమున నదికూడ కర్మవాదము, క్రియావాదము అను పేరఁ బిలువఁబడుచున్నది. కావున నధికతరముగ సయుక్తికముగ నుండుటచే జైన బౌద్ధ దర్శనములు జనసామాన్యమునకుఁ బ్రీతిపాత్రములై అవి నిలువఁబడుటకు శక్తి కలిగి

యుండినవి, కాని యన్య మతములు కొన్ని దినముల వఱకే తమ ప్రభావమును జూపెను. చివరకు తర్క-హీనములగుటచే శాశ్వతముగ లుప్తములై పోయెను.

జైన గ్రంథములు క్రియావాదము, అక్రియావాదము, అజ్ఞానవాదము, వినయవాదములకు అంతర్గతములగు 363 జైన మతముల నుల్లేఖించి యుండెను. ఇన్ని మతముల విషయములో మనము సందేహదృష్టితోఁ జూచెదము, కాని కొన్ని మతములు ప్రచారములో నుండుట నిస్సందిగ్ధము. దీఘ నికాయములోని 'బ్రహ్మజాలసుత్త'లో బుద్ధుఁడవతరించినపుడు ప్రచలితమైన 62 మతవాదములు వర్ణింపఁబడి యుండెను.* బ్రాహ్మణ గ్రంథములలో శ్వేతాశ్వతము,♦ మైత్రాయణీ ఉపనిషత్తు మూలకారణ మీమాంస విషయములో భిన్నభిన్న మతముల నుల్లేఖించి యుండెను. దాని ననుసరించి కాల,‡ స్వభావ నియతి (భాగ్యము) యదృచ్ఛా, భూతాది జగన్మూలకారణ మంగీకరింపఁ బడెను. అహిర్బుధ్న్య సంహిత (12-20-23) ప్రాచీనమత సాంఖ్య గ్రంథమగు 'షష్టితంత్రము'లోని విషయములను సంక్షేపముగ

* దీఘనికాయము (హిందీ అనువాదము) పుట 5-15

♦ కాలః స్వభావో నియతిర్యదృచ్ఛా భూతాని యోనిః పురుష ఇతి చిన్త్యమ్।
సంయోగ ఏషాం న త్వాత్మభావాత్ ఆత్మాప్యనీశః సుఖదుఃఖ హేతోః॥
శ్వేతా. ఉప. 1-2

‡ కాలవాదము మిక్కిలి ప్రాచీన సిద్ధాంతము. అథర్వవేదములో 19 కాండ 53 సూక్తములో కాలమహిమ వర్ణింపఁబడినది. కాల సృష్టికి మూలకారణము వైదిక తత్త్వము. కాలతత్త్వ వర్ణనము మహాభారతములోఁ గూడ కలదు.
(ఆదిపర్వము 248-251)

వర్ణించియుండెను; వానిలో బ్రహ్మతంత్రము, పురుష తంత్రము, శక్తితంత్రము, నియతి తంత్రము, కాల తంత్రము, గుణతంత్రము, అక్షర తంత్రము, మొదలగు 32 తంత్రముల నుల్లేఖించి యుండెను. బహుశః యీ తంత్రములలో కొన్ని తంత్రములు శ్వేతాశ్వతర నిర్దిష్ట మతములతో సంబంధము కలిగియుండ వచ్చును. మహాభారతములో గూడ ఈ మతవాదుల వర్ణనము, ఖండనము కలదు. దీనిని బట్టి మహాభారత యుగమునకుఁ బూర్వము యీ యవైదిక సిద్ధాంతములయొక్క ప్రచండమగు తుపాను వైదిక ధర్మమును తలక్రిందులు చేసినట్లు మనకు స్పష్టముగ తోఁచఁగలదు. సామాన్యమత వాదములకు తోడుగా విశిష్ట దార్శనికుల నామోల్లేఖనము కూడ చేయఁబడినది. ఈ యాచార్యులలో 6 తీర్థంకరుల యొక్క నామములు గ్రహింపఁ బడినవి. వీరి మతములు కూడ విస్తారముగ వర్ణింపఁబడినవి.*

పూర్ణకాశ్యపుని మతవాదము పేరు అక్రియావాదము. ఆమతము ననుసరించి చేసిన కర్మ శుభము కానిండు, అశుభము కానిండు ఫలమును కర్త అనుభవించవలసిన

పూర్ణకాశ్యపుఁడు

పనిలేదు. అతని యభిప్రాయము ప్రకారము గ్రామమును గొల్లగొట్టినను, దొంగతనము చేసినను, కూనీ చేసినను, పరస్త్రీగమనము కావించినను, అసత్యముపలికినను, వాఁడు పాపము చేయుటయులేదు, పాపము రాదు. ఈ విధముగనే దానము చేయుటచేతను, దానమిప్పించుట చేతను, యజ్ఞము

---

* సామంజ ఫలసుత్త — దీఘనికాయ (పుట 16-20)

చేయుటచేతను, చేయించుటచేతను, పుణ్యముకలుగుటయు లేదు, పుణ్యము రానేరాదు.

ఈతని వ్యక్తిగతనామము అజితుఁడు. 'కేశకంబళుఁడు' అనునది బిరుదమని తోఁచుచున్నది. ఇది ఈతని మతవాద కారణమున తిరస్కారమును సూచించుటకు

అజితకేశకంబళుఁడు

ఈయఁబడినది. ఈతని మతము పేరు- ఉచ్ఛేద వాదము లేక జడవాదము. మృత్యువైన తర్వాత పదార్థమేమియు నుండదు. శరీరములోని పదార్థములన్నియు నస్థిరములే. మరణించిన తర్వాత పృథివి, జలము, తేజము, వాయువు యివి తమమూల రూపములో లీనములగును. శరీరము భస్మమైన తర్వాత మిగులునదేమియు నుండదు. ఆత్మ యున్నదనుటకూడ అబద్ధమే.

ఈతని మతము పేరు శాశ్వతవాదము. ఈతని యభిప్రాయమున పృథివి, జలము, తేజము, వాయువు, సుఖము, దుఃఖము, ఆత్మ ఈ యేడు పదార్థములు

ప్రక్రుధ కాత్యాయనుఁడు

అకృతములు, అనిర్మితములు, కావున కూటస్థములు స్తంభమువలె నచలములు. పదార్థములన్నియు శాశ్వతములు, నిత్యములు. వానికి ఉత్పత్తి వినాశములు రెండునులేవు. చంపువాఁడును లేఁడు, చచ్చునదియు లేదు. తీక్ష్ణ శస్త్రముతోఁగాని, గాజుపెంకుతోఁగాని కోసినయెడల నే ప్రాణి యొక్కయు ప్రాణము తీయలేఁడు, ఏలననఁగా ఆయుధము ఈ యేడుకాయముల కావల, వివర (ఖాళీస్థలము) మందు పడును.

ఈ దార్శనికుఁడు వేలత్థికులమునఁబుట్టిన సంజయుఁడను వాఁడు ఈతఁడు గొప్ప. తర్క కుశలుఁడుగఁ దోఁచుచున్నాడు. ఈతని మతముపేరు అనిశ్చితా వాదము.

**సంజయ వేలత్థిపుత్త.** ఏవస్తువు రూపమైనను ఎట్టినిశ్చయముతో నైనను నుండదు. దానిని 'అవును' అనుటకును వీలులేదు. 'కాదు' అనుటకును వీలులేదు. పరలోక విషయమును గూర్చి అడిగిన యెడల నది ఉన్నదనియు నంగీకరింపను, లేదని నిరాకరింపదు. దానిలోని బలమంతయు వస్తువుయొక్క అనిశ్చితత్వము మీఁద నాధారపడి యున్నది. 'స్యాద్వాదము' ఇట్టి కల్పనచేతనే పుట్టిన దనుటకు వీలున్నది.

ఈతఁడాతని కాలములో నొక విశిష్ట దార్శనికుఁడు. మంఖలి అను పదమునకు శుద్ధ సంస్కృతరూపము మస్కరి. మస్కరము (వెదురుకొత్తము)ను ధరించుట

**మంఖలి గోసాలుఁడు** చేతను, కర్మ నిరోధమును గూర్చిన యుపదేశము నిచ్చుట వలనను ఈతని కీపేరు వచ్చినట్లు తోఁచుచున్నది. మహావీరునితో నీతఁడు చాలకాలము నివసించి యుండెను గాని సిద్ధాంతములో భేదము వచ్చుటచే వేఱైపోయి 'ఆజీవక' మతమును స్థాపించెను. ఆతఁడు 'నియతివాదము'ను సమర్థించువాఁడు. ప్రాణులకు క్లేశముదయించునది ఏ హేతువు లేక ప్రత్యయము కలుగదు. హేతువేదియు లేనిది ఆతఁడెన్నటికిని శాంతిఁ జెందఁడు. కావున గోసాలుని ఉపదేశసార మిదియే—*

నత్థి కమ్మ, నత్థి కిరియం, నత్థి విరియం. కర్మలేదు, వీర్యమున

* అంగుత్తర నికాయ సంపుటము ౧-పు ౨౮౬

లేదు. భాగ్యమును సహాయముగాఁ గొనవలయును. ఏది జరిగినను భాగ్యము (అదృష్టము) వలననే. కావున శాస్త్ర నిర్దిష్టమగు యజ్ఞ యాగ, దాన పుణ్యముల యొక్క సుఖోదర్క మార్గము నిరర్థకము. పక్వమైన భాగ్యవాదికి కర్మాశ్రయమక్కఱలేదు. ఈ సంప్రదాయమును గూర్చిన విస్తృతేతిహాసము కలదు.* పాణినికాలములోఁ గూడ 'మస్కరి' పరివ్రాజకుని కథను గూర్చిన చర్చలేదు,♦ ఏలననఁగా నీ నామము యొక్క వ్యుత్పత్తిని ఆతఁడు ప్రదర్శించియుండెను. మహాభాష్యకారుఁడు (విక్రమ పూర్వము ద్వితీయ శతాబ్దము) ఈతనికి పరిచితుఁడు. ఈతని మతోల్లేఖనము మిక్కిలి ప్రామాణికము— మా కృత కర్మాణి, మా కృత కర్మాణి; శాంతిర్వః శ్రేయసీ. ఆఱవ శతాబ్దమునకుఁ జెందిన మహాకవి కుమారదాసు 'మస్కరి' యొక్క ఆకారప్రకారముల నెఱిఁగినవాఁడుగ నుండెను, ఏలననఁగా నాతఁడు రావణుఁడు జానకీహరణము కావించు నెడ నీ తాపస వేషమును వర్ణించి యుండెను.‡ దీనివలన 'ఆజీవక' మత ప్రచారము ఇతర మతములకంటె సమధిక వ్యాపకముగఁ దోఁచుచుండెను. లోకాయతమతోత్పత్తి యీ యుగముననే అయినది. చార్వాక దర్శన ప్రాచీనతను జూపు సమయమున బృహస్పతిని ఐతిహాసిక వ్యక్తిరూపమునఁ బ్రదర్శింపఁబడును. ఈ యుగమున

---

* డాక్టరు వేణీమాధవ బరువా— ఆజీవక (౮౧)

♦ మస్కరమస్కరిణౌ వేణు పరివ్రాజకయోః। ౬_౧_౧౫౪

‡ దంభాజీవిక ముత్తుంగ జటామండిత మస్తకమ్।
కంచిన్మస్కరిణం సీతా దదర్శాశ్రమ మాగతమ్॥

జానకీహరణము ౧౦_౭౬

నాధ్యాత్మిక వాయుమండలము లోకాయత మతోదయమున కత్యంతోపయుక్తముగ నుండెడిది. ఈ యుగములోని కొన్ని సాధారణ విచార ఆచారముల మీఁద కూడ ధ్యానముంచుట అత్యంతావశ్యకము. ఇంతవఱకు విచారశాస్త్రము గొప్పగొప్ప విద్వాంసుల యొక్క కల్పనా వస్తువు, కాని యీ యుగములో దీని ప్రచారము సాధారణ జనములోఁ జేయఁబడెను. అక్కడక్కడ మహాడంబరముగ తమ విచారములను గూర్చిన ప్రచారము చేయు ప్రవృత్తి మొట్టమొదటగ నీసమయమందే యుదయించినది; దానినే మహావీర, బుద్ధాది కాలములలో ననుసరించిరి. తమ ఆధ్యాత్మిక విచారములకు వ్యావహారిక రూపమిచ్చుటయు, తమ విచారముల కనురూపముగ జీవన యాపన చేయు ప్రవృత్తి యొక్క విశేష లక్ష్య మీ యుగమందు కనఁబడుచున్నది.

ఈ సమస్త విరోధ మతములను ఖండించి వైదికధర్మమును పునః ప్రతిష్ఠ చేయవలసిన యవసరమేర్పడెను. విరోధ ఝంఝూవాతమునుండి తప్పించుకొని వైదిక ధర్మ నౌకను సురక్షిత ఘట్టమునకుఁ జేర్చవలసిన యావశ్యకత కనఁబడినది. మహాభారత మీయావశ్యకతను బూర్తి కావించి యుండెను, మహాభారత మీ యవైదికమతముల అప్రమాణికతనుజూపించి వైదికమతము యొక్క పునః ప్రతిష్ఠా పవిత్రకార్యమును సంపన్నము కావించెను. మహాభారతము పంచమ వేదమగుటకు కారణమిదియే. భాగవతము (౧-౪-౨౫) స్త్రీ, శూద్ర, పతితద్విజులకు వేదాధికారము లేకపోవుటచే కారుణికుఁడగు శ్రీకృష్ణద్వైపాయనుఁడు మహా

భారతమును రచించెనని చెప్పియుండెను. 'మహాభారతము' అను నామకరణము చేసినది సరహస్య వేదచతుష్టయముకంటె నధిక మహత్వ పూర్ణ మైనదగుటచేతనే. (మ.భా.ఆదిపర్వము ౧-౨౭౨-౨) మహాభారత మీ యుగముయొక్క ప్రతినిధి గ్రంథము.

ఈ కాలమున ఆస్తికప్రచారధార అంతటితో నాగలేదు సరిగదా, మీదుమిక్కిలి పరివర్తిత పరిస్థితులకను రూపముగ నది కూడ ప్రవహించుచుండెను. ఈ కాలమందు భక్తి కెక్కుడు ప్రోత్సాహ మీయఁబడినది. భిన్న భిన్న దేవతా రూపములు పరిష్కృతము కాఁజొచ్చెను. శివకేశవులిద్దరు నొకేదేవతయనుట యీ యుగమునకు చిహ్నము. 'ఏకాయన' మనుపేర నేభక్తి ప్రధానమగు సంప్రదాయమును ఛాందోగ్యోపనిషత్తు (౭-౧) ఉల్లేఖించినదో ఆ పాంచరాత్రమతము యొక్క అభ్యుదయ, విపుల ప్రచారము లీకాలమున వచ్చి నిష్పన్నములయ్యెను. యాదవవంశ క్షత్రియులలో నీప్రచారము విశేషముగ నగుటచే దీనికి 'సాత్వత' మను సంజ్ఞకూడ ప్రాప్తించినది. ఆస్తిక దర్శనాంకురము భారత మస్తిష్క భూమియం దీకాలమున నంకురించినది. ఈ దర్శనము లలో 'సాంఖ్యము' యొక్క ఆధ్యాత్మిక విచార ప్రచారము విశేషముగ లక్షింపఁబడినవి. 'యోగ' ప్రక్రియ ఉపనిషత్కాలము నుండియే భారతీయ దర్శనములకు శ్రద్ధాదరములకు విషయము లైనవి. వేదముతో తన సంబంధమును తెగతెంపులు చేసికొనిన మతవాదులు కూడ 'యోగము' యొక్క బహుమూల్యోప దేశమును గ్రహించుటలోఁ బెడచెవిని పెట్టలేదు. వ్యావహారిక జగత్తులో 'అహింస' వైపునకు ప్రజల రుచి అధికము కాఁ

జొచ్చెను. పశుయాగము దానికి మీమాంస సందేశములకు విషయమయ్యెను. ఇట్టి సమయములోనే మహాభారత రచనము జరిగినది. అది విరోధ వాదములను ఖండించి ఔపనిషద జ్ఞానమునకు తోడుగ నవీన ఆస్తికధార యొక్క సామంజస్యమును జూపించినది. ఈ యుగములోని దార్శనిక ప్రవృత్తులను దెలిసికొనుటకు మహత్త్వశాలియగు నాధ్యాత్మిక రహస్యములు శాంతి, అనుశాసనిక పర్వములలోఁ గూడ నిండియున్నవి. కాని మహాభారతము యొక్క లక్షశ్లోకాత్మకమగు విపులకాయ గ్రంథములో శత సాహస్ర సంహితయందు గీతయే అన్నిటికంటె మిక్కిలి మహత్త్వపూర్ణము, మూల్యవంతముగ నెన్నఁబడుచున్నది. కావున దానిని గూర్చి విశేషముగ నధ్యయనము చేయ మనము ప్రవృత్తుల మగుచున్నాము.

## (౨) గీత

మహత్త్వము

మహాభారతము వంటి విశాల గ్రంథమునకు భగవద్గీత సారతమమగు నంశము. దీని యొక్క ఏడువందల శ్లోకముల మధ్య నిఃశ్రేయస ప్రాప్త్యుపాయములు చాల సుబోధకముగను సరళమగు భాషలోను అభివ్యక్తము కావింపఁబడినవి. ఏవిధమగు తగాదాలు లేకయే యీ రాజమార్గము ననుసరించి తన గమ్యస్థానమును జేరవచ్చును. గీత పోట్లాటలకు క్రోసుల దూరమున నున్నది. ఆధ్యాత్మ తత్త్వ నిరూపణార్థము ఎన్ని భిన్నభిన్న మతము లాసమయమున నుద్భవించినవో వాటి నన్నిటిని ఉపయోగించి గీత యొక పరమ రమణీయమగు సాధనమార్గమును నిర్ణయించినది. అది భిన్నభిన్న

ఆధ్యాత్మిక ప్రవృత్తులు కలవారికిఁ గూడ మిక్కిలి సుఖకరముగ నున్నది. అందువలనఁ గేవలము ఏడునందల శ్లోకములు గల లఘుకాయము గల గీతను కామధేను కల్పవృక్షముగ వర్ణించి యుండిరి. గీత కింతటి మహత్త్వమునకుఁ గారణము దాని సమన్వయ దృష్టి. గీతాకాలమున మానవ జీవిత లక్ష్యము విషయములో ననేక సిద్ధాంతముల ప్రచారముండెడిది. ఆత్మయొక్క అపరోక్షానుభూతి ప్రతిపాదికమైనది ఉపనిషత్తు; ప్రకృతి పురుష వివేకఖ్యాతిచే మోక్షమును బొందవచ్చునని చెప్పునది సాంఖ్యము; సమాజ ధర్మముల ద్వారా విధివిధానానుష్ఠానము వలన పరమ సుఖభూతమగు స్వర్గ శిక్షణ నిచ్చునది కర్మ మీమాంస; అష్టాంగ సాధనముల ద్వారా ప్రకృతి బంధనము నుండి జీవుని నిర్ముక్తుని గావించి కైవల్య ప్రతిపాదకమైనది యోగము; రాగాత్మిక భక్తిద్వారా అఖిలకర్మలను పరమాత్మ యందు సమర్పించు సిద్ధాంతమును ప్రతిపాదించునది పాంచరాత్రము. ఈసమస్త దార్శనిక తత్త్వములను గీతలోఁ బ్రదర్శించిన సామంజస్యము పరమ రమణీయమైనది. నితాంతము ఉపాదేయమైనది. ప్రాంజలము సుబోధకమగు భాషలో నీయాధ్యాత్మిక సమన్వయమును కావించుటచే గీతకింతటి గౌరవము కలిగినది. భారతీయ దార్శనికులు గీతను ప్రస్థానత్రయములో రెండవ ప్రస్థానముగఁ జేసె దాని మహిమ నినుమడించిరి. తర్వాతఁ గొంతకాలమునకు ధార్మిక మత సంస్థాపకులగు నాచార్యులు దీనిని తమ భాష్యములచే సుశోభితము కావించి, దీనిలోఁగల గూఢతమ తాత్పర్యమును తమ దృష్టిచే నభివ్యక్తము కావించు

టకుఁ బ్రయత్నించిరి. భారతదేశమునకు బయటకూడ గీతా ప్రచారము తక్కువగా లేదు. సాధారణముగా నీ గీత యనువదింపఁబడని సభ్యభాష లేనేలేదు. గీత కెన్నియో చక్కని అనువాదములు కలవు. ఎన్నియో పాండిత్యపూర్ణములగు వివేచనాత్మక గ్రంథములున్నవి. గీతాసందేశము సమస్త దేశములకును సర్వకాలములకును సమానమే.

**గీతా స్వరూపము.**

గీతోపదేశము చేయఁబడిన పరిస్థితి విలక్షణమైనది. అన్నదమ్ములు పరస్పరము ఒకరి నెత్తురు ఒకరు త్రాగవలెనని ఒకరొకరు ఎదురొక్కన్న మహాభారత ప్రళయంకర సంగ్రామ సమయము. ఇట్టి స్థితిలో అర్జునునకు విషాదము కలుగుట మిక్కిలి స్వాభావికము. అర్జునుఁడు మహాభారత కాలీన యోధులలోఁ బరమ ప్రసిద్ధుఁడు, మిక్కిలి వీర్యశాలి. ఈ విధమగు సాంసారిక పరిస్థితుల మధ్యపడి కర్మవిషయములో సంశయాళుచిత్తులగు మానవమాత్రులకు ప్రతినిధిత్వము మనకు అర్జునునందు దృష్టిగోచరమగు చున్నది. ఆ యుగములోఁ బరమ మేధావి విద్వాంసుఁడును, కర్తవ్యపరాయణ పురుషుఁడు నగు శ్రీకృష్ణుఁడు గీతాజ్ఞానమునకు వక్త. అర్జునునకు యుద్ధము చేయుదునా ? మానుదునా ? యను సమస్య పట్టుకొన్నది. ఈ వికట ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరమిచ్చి మీమాంస చేయుటలో గీత యుద్యమించినది. కావున గీతోపదేశముల దిశ సుస్పష్టము. అది ఆచార మీమాంసను బ్రతిపాదించు చున్నది. కావున గీత 'యోగశాస్త్రము' అని పిలువఁబడుచున్నది. యోగమునకుఁగల అనేక అర్థములలో నొక

అర్థము వ్యవహారము. 'సాంఖ్యము' న కర్థము తత్త్వజ్ఞానము; 'యోగము' న కర్థము వ్యవహారము లేక కర్మమార్గము. ప్రతి అధ్యాయమునకు గద్య (పుష్పిక) యందు 'బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే' అని చెప్పుటచే గీతయొక్క ముఖ్యవిషయము బ్రహ్మవిద్యమీఁద ప్రతిష్ఠింపఁబడిన వ్యవహార ప్రతిపాదన మని తెలుచున్నది. తత్త్వ సమీక్ష ఆధారముమీఁదనే ఆచార మీమాంస యొక్క సుందర ప్రతిష్ఠ కలదు. కావున గీతార్థ వివేచనము కొఱకీ యుభయ పక్షముల యొక్క నిరూపణము మిక్కిలి ఆవశ్యక మగుచున్నది.

## (౩) గీత యొక్క అధ్యాత్మ పక్షము.

అధ్యాత్మ తత్త్వము యొక్క వివేచనము గీతయందు మిక్కిలి సరళమగు తేలికభాషలో నక్కడక్కడ చేయఁబడినది. కాని వీటినన్నిటిని సమన్వయపఱచి యొక నిశ్చిత సిద్ధాంతమును స్థాపించుట కొంచెము కష్టకార్యము. కావున శంకరాచార్యులవారు గీతకు దుర్విజ్ఞేయార్థమును జెప్పను. (తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థసార సంగ్రహభూతం దుర్విజ్ఞేయార్థమ్ —— గీతా భాష్యోపోద్ఘాతము) చరమ తత్త్వము యొక్క నిర్దేశములు భిన్న భిన్న అధ్యాయములలోఁ జేయఁబడినవి. కాని యెనిమిదవ అధ్యాయమునందును, పదుమూఁడవ యధ్యాయము నందును దీని వర్ణనము విస్తారముగ దొఱకు చున్నది. గీత బ్రహ్మయొక్క సగుణ, నిర్గుణములను ఉభయరూపముల

(౧) బ్రహ్మతత్త్వము పరిచితము. కాని రెండును ఒకే అభిన్న

తత్త్వములు. ఈ చక్కని శ్లోకమందు ఈ రెండు రూపముల యొక్క ఏకత స్పష్టముగఁ బ్రతిపాదింపఁ బడినది. —

శ్లో॥ సర్వేంద్రియ గుణా భాసం సర్వేంద్రియ వివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥ ౧౩-౧౪.

బ్రహ్మ సమగ్ర ఇంద్రియ వృత్తుల ద్వారా విషయోపలబ్ధియందు సమర్థ మగుచున్నది — ఆంతర, బాహ్యేంద్రియ వ్యాపారముల ద్వారా అది ప్రతిభాసిత మగుచున్నది. అయ్యు అది స్వయముగ సమస్తేంద్రియ విహీనమైనది. అది సమస్త విధములగు దేహాదిక సంబంధ రహితమైనది, కాని సమస్తమును ధరించుచున్నది. అది నిర్గుణము, అయినప్పటికిని గుణభోక్త — సత్త్వాదిగుణముల పరిణామ రూపములగు శబ్దస్పర్శాది విషయములకు ఉపభోక్త. అది సత్, అసత్ కూడాను. ఈ సదసత్తులకుఁ గూడ పరమైనది. (సదసత్ తత్పరం యత్. ౧౧-౩౭); అనాదిమంతుఁడగు పరబ్రహ్మ సత్తుకాదు అసత్తు కాదు. (న సన్నా స దుచ్యతే— ౧౩-౧౨); బ్రహ్మ భూతముల లోపల వెలుపల రెండు వైపుల నున్నాఁడు. ఆతఁ డచరుఁడు, చరుఁడు, దూరస్థుఁడు, అంతికస్థుఁడు (౧౩-౧౫). ఈ వర్ణనములలో విరోధకల్పన చేయరాదు, ఏలననఁగా దేశకాల నిమిత్తాది యుపాధివిరహితమగు పరమ తత్త్వము సమస్త విరోధములకు పర్యవసానము, ఇది విచారశాస్త్రముయొక్క గూఢము, మఱియు మహత్త్వపూర్ణమగు మాన్య సిద్ధాంతము. భగవంతుఁడు జగత్తునకు ప్రభవము. (ఉత్పత్తి) ప్రలయము (లయస్థానము.) (౭-౬); అది సమస్త ప్రాణులలో వసించును. గుడ్డ

మీఁద మణులన్నియు నెట్లు పొదగఁబడినవో, అట్లే భగవం
తునిలో సమస్త జగత్తు ఓతప్రోతమై, అనుస్యూతమై గ్రుచ్చఁ
బడియున్నది. (౭-౭) ఆతని చేతులు కాళ్లు నలువైపుల నున్నవి.
కన్నులు, శిరస్సు, కర్ణములు, నోళ్లు నాల్గువైపుల నున్నవి.
ఆతఁడీ విశ్వమున కంతయు నావరణమై యున్నాఁడు. (౧౩-౧౩)

గీత భగవంతుని రెండు విధములగు భావములను గూర్చి
చెప్పుచున్నది. భగవంతుని రెండు భావములు— అపర భావము,
పరభావము. ఈశ్వరుఁడొక యంశచే యోగ
మాయాయుక్తుఁడు. ఆయంశచే జగత్తులో
నభివ్యక్తుఁ డగును. ఆతఁడొక యంశచే జగ
త్తును వ్యాపించియున్నాఁడు. (విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాం
శేన స్థితో జగత్—౧౦-౪౨); దీని పేరే అపరభావము లేక విశ్వా
నుగ రూపము. కాని భగవంతుఁడు కేవలము జగన్మాత్రుఁడే
కాదు, ఆతఁడు దీని నతిక్రమించినవాఁడు. ఇది ఆతని వాస్తవిక
రూపము. ఈ యనుత్తమ, అవ్యయ రూపముపేరు— పరభావము
(విశ్వాతిగరూపము; పరంభావ మజానంతో మమావ్యయ మను
త్తమమ్— ౭-౨౪) గీతలోని యీ కల్పన సరిగా పురుషసూక్త
మున కనురూపముగ నున్నది. "పురుషుని యీ జగత్తు కేవలము
పాదమాత్రము; ఆతని అమృతమగు మూఁడు పాదములు ఆకా
శములో నున్నవి.* బ్రహ్మ యొక్క యుభయభావములు కూడ
ఇదే విధముగ నున్నవి. భగవఁతుఁడు విశ్వమందంతటను
వ్యాపించి యున్నాఁడు. ఆతని అంశము లేని పదార్థమేమున్నది?

బ్రహ్మ యొక్క రెండు భావములు

* పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతందివి। ఋ. వే. ౧౦-౯౦-౩

అయినప్పటికిని విభూతిమంతుఁడు, శోభాయుక్తుఁడు, ఊర్జిత పదార్థములలో భగవచ్ఛక్తి యొక్క ప్రాకట్యము సమధికముగ దృష్టిగోచరమగుచున్నది.” (౧౦-౪౧) దశమాధ్యాయములో భగవద్విభూతులు సాంగోపాంగముగ వర్ణింపఁబడినవి.

ఈ స్థావర జంగమమగు విశ్వమంతయు భగవదాకారమే. ఇందుకు సందేహ మేమాత్రమును లేదు. అందువలన గీత భగవంతుని రెండు ప్రకృతులను వర్ణించుచున్నది.

రెండు ప్రకృతులు

ఈ విషయములో సాంఖ్య, గీతల యొక్క తత్త్వ వివేచనములోని పార్థక్యము మీఁద దృష్టిపాతము కావించుట ఆవశ్యకము. సాంఖ్య శాస్త్రమందు సృష్టిమూలము నందు అచేతన జడ ప్రకృతిని అచేతన పురుషుని, ప్రతిపాదించి, సమస్త పదార్థములు ఈ రెండు తత్త్వముల వలన నుత్పన్నమైనవనియు, వీటికిమించి మూఁడవ తత్త్వము లేదనియుఁ జెప్పఁ బడినది. కాని గీత దీనికి సమ్మతింపలేదు. దాని దృష్టిలో నీ రెండింటికి పరమైన నొక సర్వవ్యాపక, అవ్యక్త, అమృత తత్త్వము చరాచర సృష్టికాధారభూతమైనది కలదు. సాంఖ్యాభిమత మగు ప్రకృతి పురుషులు ఆ వ్యాపక బ్రహ్మకు విభూతి మాత్రములు. పరమేశ్వరుని ప్రకృతులు రెండు రకములు — అపరా, పరా (౭-౪-౫). అపరాప్రకృతికి రెండవపేరు క్షేత్రము, క్షర పురుషుఁడు. పరాప్రకృతికి ఇంకొకపేరు క్షేత్రజ్ఞుఁడు, అక్షర పురుషుఁడు. పరా ఉత్కృష్టప్రకృతి వలన తాత్పర్యము జీవునికి కలదు. (౭-౫) అపరా, చైతన్యము లేకపోవుటచే నికృష్టము, ప్రకృతిచే నభిప్రాయము జీవేతర సమస్త పదార్థములని. సమస్త

భౌతిక పదార్థగ్రహణము 'క్షర' పురుషుని రూపమునఁ జేయఁబడినది. (క్షరః సర్వాణి భూతాని - ౧౫-౧౬) దాని వికాసము అష్టవిధములగు అపరా ప్రకృతిగాను, చతుర్వింశతి ప్రకారమగు క్షేత్రరూపమునను అన్యత్ర ప్రదర్శింపఁబడినది. పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము — ఈ ఎనిమిది భిన్నప్రకృతులు అపరాప్రకృతులు (౭-౪). పంచమహాభూతములు, అహంకారము, బుద్ధి, అవ్యక్తము (ప్రకృతి), పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు, శబ్దస్పర్శాది పంచఇంద్రియ విషయములు — ఇవి ఇరువదినాల్గు విధముల క్షేత్రము (౧౩-౫) ఈ విధముగ సాంఖ్యములోని ౨౪ తత్త్వముల అంతర్భావము గీతానుసారముగ క్షేత్రము, అపరా ప్రకృతి లేక క్షర పురుషునిలోఁ జేయఁబడినది. ఒక్క విషయము దృష్టిలోఁ బెట్టుకొనవలెను. ఇచ్ఛా, ద్వేష, సుఖ దుఃఖ, సంఘాత (దేహేంద్రియ సమూహము), చేతనము (ప్రాణశక్తి), ధృతి— వీటిని గీత క్షేత్రముయొక్క వికారములుగఁ బరిగణించును. (౧౩-౬) వీనిలోనుండి యిచ్ఛాద్వేషాదులను వైశేషిక దర్శనము ఆత్మ (క్షేత్రజ్ఞ) గుణములుగ నెన్నును. కాని గీతాభిప్రాయమున వీటికి సంబంధము క్షేత్రజ్ఞునితోఁగాక క్షేత్రముతోడనే కలదు.

**౨ జీవతత్త్వము**

చైతన్యాత్మక మగుటచే జీవుఁడు పరమేశ్వరుని పరా ప్రకృతి అనఁగా ఉత్కృష్ట విభూతి. ఆతఁడే 'క్షేత్రజ్ఞుఁ' డని పిలువఁబడినాఁడు. శరీరకృత కర్మఫలములను ధారణ జేయుటచేతను లేక భోగాయతన మగుటచేతను క్షేత్రమను సంజ్ఞ కలిగినది. క్షేత్రజ్ఞాతకు 'క్షేత్రజ్ఞుఁ'

డుందురు. ఆత్మ పాదాదిశిరఃపర్యంతము సమగ్రశరీరమును స్వాభావికముగను, ఉపదేశము ద్వారా ప్రాప్తించిన అనుభవముచే విభాగపూర్వకముగ స్పష్టముగ నెఱుఁగుదు, కావున వానిని క్షేత్రజ్ఞుఁడనుట ఉచితమే. ఆత్మయొక్క వర్ణనము భిన్న భిన్న అధ్యాయములలోఁ జేయఁబడినది, విశేషముగ ద్వితీయాధ్యాయమందు. ఆత్మ షడ్వికార రహితమైనది. అది పుట్టదు, చావదు, అది సత్తాయొక్క అనుభవమును బొందదు యెన్నటికిని అభావమును బొందదు. (భూత్వా న అభవితా), అది అజన్మ, నిత్య, శాశ్వత, పురాణ అనఁగాఁ ప్రాచీనమైనప్పటికిని నవీనము. హన్యమానమగు శరీరమందు అది యెన్నటికిని జంపఁబడదు (౨-౨౦) కావున నెవఁడు దానిని చచ్చునదిగాను, చంపఁబడునదిగాను దెలిసికొనుచున్నారో వారిద్దరును ఆత్మత్వమును దెలియనివారలే: ఏల ననఁగా నది చావదు, చంపఁబడదు (౨-౧౯) ఏవిధముగ మానవుఁడు జీర్ణవస్త్రములను బరిత్యజించి క్రొత్త వస్త్రములను గ్రహించునో, అట్లే ఆత్మ ప్రారబ్ధభోగము ద్వారా జీర్ణ (క్షీణకర్మ) శరీరములను వదలి నూతన శరీరములను బొందును. (౨-౨౦). అది అవికారము, అది అచ్ఛేద్యము, అదాహ్యము, అక్లేద్యము, అశోష్యము; అది నిత్య సర్వవ్యాపి, స్థిరము, అచలము, సనాతనము (౨-౨౪).

ఈజీవుఁడు అనేకములు కాక ఒక్కటే. గీతలో నీవిషయములో ఒక ఉపమాన మీయఁబడినది. ఒకే సూర్యుఁడు సమస్త జగత్తును బ్రకాశింపఁ జేయునట్లు క్షేత్రజ్ఞుఁడు సమస్త క్షేత్రములను - శరీరములను - ప్రకాశింపఁజేయును. (౧౩-33); ఈ శ్లోక

ములో క్షేత్రజ్ఞునకు ఉపమానము సూర్యునిఁగ నిచ్చి దాని యొక్క ఏకత్వభావమును సుస్పష్టముగ సమర్థింపఁబడినది. జీవుఁడు పరమేశ్వరుని సనాతనాంశము (మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః — ౧౫-౭) భగవంతుఁడు అంశి, జీవుఁడంశము. బ్రహ్మసూత్రము (౨-౩-౪౩-౫౩) యొక్క తాత్పర్యము కూడ యిదియే. దానిలో నీ గీతావాక్యస్మృతిని కావించి ప్రమాణ రూపమున నుల్లేఖింపఁ బడినది. ఈ అంశాంశీభావము గీతానుసారముగ నేవిధముగ నున్నదను విషయము స్పష్టముగఁ దెలియదు. పరవర్తులగు అద్వైత టీకాకారులు ప్రతిబింబవాదమును, అవచ్ఛేద వాదమును ఆశ్రయించి యీ కల్పనను ఉపపత్తిగఁ జూపించిరి, కాని యీ కల్పనలన్నియు ముందు తెలియఁగలవు.

(3) జగత్తత్త్వము

జగదుత్పత్తి స్థితిలయములు భగవంతుని కారణము. గీతా శబ్దములలో భగవంతుఁడు సమస్త భూతములకు సనాతనుఁడు— అవినాశి బీజము (సనాతనం బీజమ్ ౭-౧౦) లేక అవ్యయ బీజము. (బీజమవ్యయమ్ ౯-౧౮) బీజమువలన వృక్షముత్పన్నమగును. చివరకు మరల బీజములో లీనమగును. అట్లే యీ జగత్తు భగవంతుని వలన నుత్పన్నమగును. మరల నాతనిలోనే లీనమై పోవును. జగత్తు యొక్క అవాంతర ఆవిర్భావ కాలమును పౌరాణిక కల్పనానుసారముగ బ్రహ్మయొక్క పగలందురు. అవాంతర తిరోభావ కాలమునకు బ్రహ్మ యొక్క రాత్రి యందురు. (౮-౧౮-౧౯) గీతలో సాంఖ్యములోని 'ప్రకృతి' అంగీకరింపఁ

బడినది. గీతలో ప్రకృతిని ఒకొ్కక్కచోట 'అవ్యక్తము' (౮-౧౮-,౮-౨౦) ఒక్కొకచోట 'మహాద్బ్రహ్మ' (౧౪-౩) యను సంజ్ఞ యీయఁబడినది. సాంఖ్యము 'ప్రకృతి' చేతనే జగదుత్పత్తి యైనదనును, కాని గీత యీ సిద్ధాంతము నంగీకరింపదు. దాని మతము ననుసరించి ప్రకృతికి అధ్యక్షుఁడు ఈశ్వరుఁడు. ఆతని అధ్యక్షత క్రిందనే ప్రకృతి జగత్తును బుట్టించును, లేనిచో అచేతన జడాత్మికయగు ప్రకృతి కింతటి సామర్థ్య మెచ్చటి నుండి వచ్చును ?

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే॥ —౯-౧౦

సమస్త పశుపక్ష్యాది యోనులఁ దుత్పన్నమగు వాటికి యోని ( ఉత్పత్తి స్థానము) మహద్బ్రహ్మ. ఈశ్వరుఁడు బీజము నుంచువాఁడు. (౧౪-౪) ; కావున విశ్వమునకుఁ బ్రకృతి మాతృ స్థానీయము, ఈశ్వరుఁడు పితృస్థానీయ మనుట సుస్పష్టము. ఈ విధముగఁ బ్రకృతియొక్క స్థానము ఈశ్వరునికంటె న్యూనమైనది. గీత 'నాసతో విద్యతే భావో నాభావో విదతే సతః' ను బ్రతి పాదించును. ఇది సత్కార్యవాదము. గీతా దృష్టిననుసరించి జగత్తు మాయికము, కాల్పనికము కాక సర్వథా సత్యము, వాస్తవికము.

పురుషోత్తమ తత్త్వము భగవద్గీతయొక్క పరమరహ స్యమును, మహత్వపూర్ణమగు ఆధ్యాత్మిక తత్త్వముగ నెన్నఁ బడు చున్నది. సాంఖ్యశాస్త్రము ననుసరించి జగత్తునకుఁ గారణ

ర పురుషోత్తముఁడు భూతమగు అజన్మప్రకృతియే అన్నిటికంటె 'అవ్యక్తము'గ నున్నది. కావున సాంఖ్య గ్రంథములందు దానికి "అవ్యక్త" మని ప్రయోగింపఁ బడినది. కాని గీతానుశీలనమున అవ్యక్త, అక్షరప్రయోగము వ్యక్తావ్యక్తములకుఁ బరముగను, ప్రకృతి పురుషులపైన నొక విశిష్ట తత్త్వము విషయమునఁ బ్రయోగింపఁ బడినది. ఆ తత్త్వము అక్షరబ్రహ్మ, పరబ్రహ్మ. దీని ప్రకృతి ( అవ్యక్తము ) నికృష్ట విభూతి. గీతయందు చంచల ప్రకృతిని క్షరమనియు, కూటస్థము, అవికారియగు పురుషుని అక్షరమనియుఁ జెప్పఁ బడినది; కాని ప్రకృతి నతిక్రమించు పరతత్త్వమును, అక్షరముకంటె నుత్తమమైన దానిని 'పురుషోత్తమ' తత్త్వముగఁ జెప్పఁ బడినది.

శ్లో॥ యస్మాత్ క్షరమతీతోఽహ మక్షరాదపి చోత్తమః ।
అతోఽస్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః॥ గీత. ౧౫-౧౮

అక్షర పరబ్రహ్మకు, పురుషోత్తమునకుఁ గల భేదమును దెలిసికొనుట అత్యంతావశ్యకము. జడ జగత్తునకు భిన్నమగు చేతనబ్రహ్మను, లేక అవ్యక్తప్రకృతికంటె (బరముగ నున్న సచేతన తత్త్వమునకు 'అక్షరబ్రహ్మ' యందురు. గీత ౮-౨౦.); కాని యే ఈశ్వరుఁడీ విశ్వమున వ్యాపించియు దీనికిఁ బరుఁడుగా నున్నాఁడో, జగత్తునందు గల నన్ని పదార్థములలో నున్నాఁడో, అంతేకాదు దీనికి వేఱుగాకూడ నున్నాఁడో, యెవఁడు విశ్వానుగుఁ డయ్యును విశ్వాతిగుఁడో ఆ ఈశ్వరుఁడే పురుషోత్తమ పదవాచ్యుఁడు. పూర్వోక్తశ్లోకమందు పురుషోత్తముఁడు క్షరము నతిక్రమించువాఁడనియు; అక్షరము కంటె నుత్తముఁడనియుఁ

జెప్పఁబడినది. 'అతీతః' అను శబ్దము ఆతని విశ్వాతిక్రమణ కారి యగు స్వరూపమును దెల్పును. 'ఉత్తమ' శబ్దము 'అక్షరము' కంటె నాతఁడుత్తముఁడనునది తెల్పుచున్నది. ఈ పురుషోత్తమునకే సర్వకర్మ సమర్పణము చేయుమని గీత చెప్పుచున్నది. ఈ విధముగ గీతయందు ఔపనిషద బ్రహ్మవాదము, సాంఖ్యసమ్మతమగు ప్రకృతి పురుషవాదము, భాగవతధర్మాభిమతమగు నీశ్వరవాదము చక్కగ సమన్వయింపఁ బడినది.

## (४) గీతయొక్క వ్యవహారపక్షము.

గీతయొక్క అధ్యాత్మపక్ష మెంత యుక్తి యుక్తమును, సమన్వయాత్మకమో, దాని వ్యవహార పక్షముకూడ అంతమనోరమమును ఆదరణీయమైనది. గీతా జన్మకాలమునఁ గల పరిస్థితిని గూర్చి విచారించుచుచో గీతయొక్క ప్రధానోద్దేశ్యము వ్యావహారిక శిక్షణనొసంగుటయే యను తీర్మానమునకు రాఁగలము. కాని గీతయొక్క యీ చరమ లక్ష్య విషయములో విద్వాంసులలోఁ జాల మత భేదము కలదు. శ్రీశంకరాచార్యులవారి అభిప్రాయము ననుసరించి గీతయొక్క ముఖ్యప్రయోజనము నివృత్తి మార్గప్రతిపాదనము, దానికి జ్ఞానమే కేవలోపాయము. శ్రీరామానుజాచార్యులవారు భగవత్ప్రాప్తి రూపలక్ష్యమునకు భక్తియే అన్నిటికంటె శ్రేష్ఠమైనదని చెప్పుదురు. వారి మతమందు గీతాసారాంశము జ్ఞానదృష్టిచే విశిష్టాద్వైత మనియు, ఆచారదృష్టిచే వాసుదేవభక్తి యనియు కలదు. వీరును కర్మసన్న్యాసమునే సమర్థించిరని చెప్పవచ్చును. ఏలననఁగాఁ గర్మా

విభిన్నమార్గముల సామంజస్యము

చరణము చిత్తశుద్ధికొఱకు చేసి, ప్రేమపూర్వకముగ వాసుదేవ భక్తియందు తత్పరుఁడగుటచే సాంసారిక కర్మలు జరుగ నేరవు.

ఇచ్చట లోకమాన్య బాలగంగాధరతిలకు గారు 'గీతా రహస్యము' ను రచించి, ప్రాచీనాచార్యుల సిద్ధాంతములలో దోషములను జూపించి భాగవత ధర్మాభిమతమగుఁ బ్రవృత్తి మార్గమును* గీతాలక్ష్యముగాను, కర్మయోగమును దానికి సాధనముగను జెప్పెను. గ్రంథకారులు తన సిద్ధాంతములకుఁ బుష్టినొసంగుటకు గొప్ప విద్వత్తాపూర్ణమును, వ్యాపకమును, ప్రాంజలములగు యుక్తుల నుపయోగించిరి. విద్వాంసులగు నీ భాష్యకారుల యుక్తులు వారివారి దృష్టికోణము ననుసరించి మిక్కిలి సారగర్భితములుగ నున్నవి. దీని నెవఁడును కాదనఁ జాలఁడు. కాని పూర్వోక్త మతములందు గీతోపదేశముల యొక్క సమగ్రత యందును, వ్యాపకతయందును బూర్ణముగ ధ్యానముంచలేదు. శాస్త్రములు మానవ ప్రకృతులలోఁ గల భిన్నత్వమును మనస్సులోఁ బెట్టుకొని చరమలక్ష్య ప్రాప్తికొఱకు త్రివిధోపాయములను జెప్పినవి. విచారశీలుఁడగు సాధకుఁడు జ్ఞానమార్గముచేతను, సాంసారిక విషయాభిరుచి కలవాఁడు కర్మ మార్గము చేతను, అనురాగాది మానసిక వృత్తివిశేష వికాసము కలవాఁడు భక్తిమార్గము చేతను దమతమ యుద్దేశ్యములను పొందవచ్చును. ఈ భిన్న భిన్న మార్గానుయాయులు తమ

---

* శ్లో॥ నారాయణపరో ధర్మః పునరావృత్తి దుర్లభః।
ప్రవృత్తి లక్షణశ్చైవ ధర్మో నారాయణాత్మకః॥

మహాభారతము-శాంతిపర్వము ౩౪౭-౮౦

మార్గముల విశిష్టతను, ఉపాదేయతను బాగుగా సమర్థించుకొనుచు నన్యమార్గములను మిక్కిలి హేయములని చెప్పుచుందురు. గీతాధ్యయనము వలన నా సమయమున భారతవర్షమందు నాలుగు వేఱువేఱు మార్గములు ప్రచారములోనున్నట్లు తెలియుచున్నది (౧౩-౨౪-౨౫) ఈనాల్గు కర్మమార్గము, జ్ఞానమార్గము, ధ్యానమార్గము, భక్తిమార్గము. ఎవఁడే మార్గమునఁ బోవుచుండునో ఆతఁ డామార్గము గొప్పదని చెప్పును; వాని దృష్టికి ముక్తికి వేఱు మార్గము లేనేలేదు. కాని భగవానుఁడు గీతా ప్రచారము కావించి వివిధ సాధనములకు అపూర్వమగు సమన్వయ మొసంగెను. ఈ సమన్వయ ఫలముగ ప్రయాగలో గంగా యమునా సరస్వతు లెట్లు భారతభూమిని పవిత్రమొనర్చుచు వచ్చి త్రివేణీరూపమునఁ బ్రవహించుచున్నదో అట్లే కర్మ, జ్ఞాన, ధ్యాన, భక్తి మార్గములు కలిసి తత్త్వజిజ్ఞాసువుల జ్ఞానపిపాసను బోఁగొట్టుచు భగవంతుని వైపునకుఁ బోవుచున్నది. ఈసమన్వయమే గీతయొక్క విశిష్టత. ఈ సమన్వయమును బాగుగాఁ దెలిసికొనకున్న గీతార్థమహత్త్వము తెలియఁజాలదు.

గీతకు చాలకాలమునకు ముందే మీమాంస కర్మ మహాత్త్వము నంగీకరించినది. మీమాంస మతానుసారముగ వేదము యొక్క కర్మకాండయే సార్థకము; జ్ఞానకాండ నిరర్థకము. ఆమ్నాయ(వేద)ముల యొక్క ముఖ్య ప్రయోజనము కర్మప్రతిపాదనమందే కలదు; కావున అతదర్థక - జ్ఞానప్రతిపాదక - వాక్యములు నిరర్థకములని

౧. గీత; కర్మయోగము

జైమిని* స్పష్టముగఁ జెప్పియుండెను. కర్మ యనఁగా యజ్ఞమని కలదు. ఈ యజ్ఞమన నేది ? దేవతోద్దేశ్యముతో ద్రవ్యత్యాగము అనఁగా ఒకానొక దేవతా విశేషము కొఱకు హవిష్యాది ద్రవ్యములను సమర్పించుట. గీత జ్ఞానకాండము నిరర్థకమనుట నంగీకరింపదు. యజ్ఞమున కీ సంకుచితార్థము నొప్పుకొనదు. అది 'యజ్ఞచక్రము'యొక్క ఉపాదేయత నంగీకరించును.(౩-౧౦-౧౬) ఏలనఁగా నీ చక్రములో నన్నము మొదలుకొని బ్రహ్మ వఱకు సమస్త పదార్థములు ఒకటొకటి అనుస్యూతములై యున్నవి. కాని గీత 'యజ్ఞ' శబ్దప్రయోగము నొక విస్తృతార్థమునఁ జేసినది. నిస్స్వార్థ బుద్ధితో పరమాత్మ వైపునకుఁ గొనిపోవు సమస్త కర్మలయొక్క సామాన్య సంజ్ఞకు 'యజ్ఞ' మందురు. యజ్ఞము లనేక రకములుగ నుండును. ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, జ్ఞానయజ్ఞము మొదలగునవి. (౪-౨౫-౩౨) కాని ఫలాకాంక్ష దృష్టి పెట్టుకొనక చేయఁబడు కర్మ, యెన్నటికిని బంధనమును గలిగింపఁ జాలదు. కర్మచక్రమునుండి యెవ్వఁడైన నెప్పుడైనఁ దప్పించుకొని పోఁగలఁడా ? ఈ జీవనయాత్రకు ప్రథానాధారము కర్మయే. ఏ మానవుఁడైనను గర్మచేయక ఒక్క క్షణమైన నుండఁ జాలఁడు. ప్రకృతి గుణత్రయము వానిచేఁ గర్మ బలాత్కారముగఁ జేయించితీరును. (౩-౫)

కాని, కర్తను బంధనములోఁ బడవేయుటకు సిద్ధముగా నున్న ఒక దుర్గుణము కర్మలలోఁ గలదు. దీనికి వాసనయనియు,

* ఆమ్నాయస్య క్రియార్థత్వాత్ ఆనర్థక్యమతదర్థానామ్.
మీమాంసాసూత్రము ౧-౨-౧

జైమిని* స్పష్టముగఁ జెప్పియుండెను. కర్మ యనఁగా యజ్ఞమని కలదు. ఈ యజ్ఞమన నేది? దేవతోద్దేశ్యముతో ద్రవ్యత్యాగము అనఁగా ఒకానొక దేవతా విశేషము కొఱకు హవిష్యాది ద్రవ్యములను సమర్పించుట. గీత జ్ఞానకాండము నిరర్థకమనుట నంగీకరింపదు. యజ్ఞమున కీ సంకుచితార్థము నొప్పుకొనదు. అది 'యజ్ఞచక్రము'యొక్క ఉపాదేయత నంగీకరించును. (3-౧౦-౧౬) ఏలనఁగా నీ చక్రములో నన్నము మొదలుకొని బ్రహ్మ వఱకు సమస్త పదార్థములు ఒకటొకటి అనుస్యూతములై యున్నవి. కాని గీత 'యజ్ఞ' శబ్దప్రయోగము నొక విస్తృతార్థమునఁ జేసినది. నిస్స్వార్థ బుద్ధితో పరమాత్మ వైపునకుఁ గొనిపోవు సమస్త కర్మలయొక్క సామాన్య సంజ్ఞకు 'యజ్ఞ' మందురు. యజ్ఞము లనేక రకములుగ నుండును. ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, జ్ఞానయజ్ఞము మొదలగునవి. (౪-౨౮-3౨) కాని ఫలాకాంక్ష దృష్టి పెట్టుకొనక చేయఁబడు కర్మ, యెన్నటికిని బంధనమును గలిగింపఁ జాలదు. కర్మచక్రమునుండి యెవ్వఁడైన నెప్పుడైనఁ దప్పించుకొని పోఁగలఁడా? ఈ జీవనయాత్రకు ప్రధానాధారము కర్మయే. ఏ మానవుఁడైనను గర్మచేయక ఒక్క క్షణమైన నుండఁ జాలఁడు. ప్రకృతి గుణత్రయము వానిచేఁ గర్మ బలాత్కారముగఁ జేయించితీరును. (3-౫)

కాని, కర్తను బంధనములోఁ బడవేయుటకు సిద్ధముగా నున్న ఒక దుర్గుణము కర్మలలోఁ గలదు. దీనికి వాసనయనియు,

* ఆమ్నాయస్య క్రియార్థత్వాత్ ఆనర్థక్యమతదర్థానామ్.
మీమాంసాసూత్రము ౧-౨-౧

ఫలాకాంక్షయనియు, ఆసక్తి యనియుఁ జెప్పవచ్చును. ఈ విష దంతమును బీకివైచుట ఆవశ్యకమై యున్నది. కోరికతోఁ జేసిన కర్మఫలము ననుభవించి తీరవలసినదేకాని కర్త దానిని దప్పించు కొనుటకు వీలులేదు; కాని ఫలరూప బంధనమునుండి ముక్తిని గూడ పొందవచ్చును. బంధనము రాకుండ కుశలత్వముతోఁ గర్మలు చేయుటకే 'యోగ' మని పేరు. (యోగః కర్మసు కౌశలమ్) కర్మ సన్న్యాసము కంటె గొప్పది కర్మయోగము (గీత ౫-౨). కాని సాధారణ కర్మవాదమును కర్మయోగమందు ప్రవర్తింపఁ జేయుటకు మూఁడు సోపానము లవసరములు— (౧) ఫలాకాంక్ష వర్జనము. (౨) కర్తృత్వాభిమానపరిత్యాగము. (3) ఈశ్వరార్పణము. మానవుని అధికారము కర్మచేయుటయందే కాని ఫలమును గోరుటయందు కాదు అని గీతోపదేశము. ఎన్న డును ఫలాకాంక్షతోఁ గర్మను జేయరాదు. ఆకర్మయందును, కర్మను జేయకపోవుట యందును నీకు కోరికజనింపరాదు—

శ్లో॥ కర్మణ్యే వాధి కారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మ ఫలహేతుర్భూ ర్మా తే సంగోఽ స్త్వకర్మణి॥ గీత ౨-౪౭

కర్మయోగమునకు మహామంత్ర మిదియే. ఈ శ్లోకము లోని నాల్గు పదములను గర్మయోగమునకు 'చతుస్సూత్రి' యని పిలువ వచ్చును. కావున నాసక్తిని వదలి కర్మను జేయుటలో నేవిధమగు చెఱుపునకును భయపడ నవరములేదు. కావున గీత యొక్క మాన్యసిద్ధాంతము కర్మ త్యాగమును జేయరాదు. కర్మ ఫలములను ద్యాగము చేయుట అత్యంతావశ్యక మనియే. కావుననే కొందఱు పండితులు కామ్య కర్మలను ద్యజించుటయే

సన్న్యాసమనిరి. కాని చతుర పండితులు సర్వకర్మ ఫలత్యాగమే వాస్తవ సన్న్యాసమని అభిప్రాయపడుచున్నారు—

శ్లో॥ కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః।
సర్వకర్మ ఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥ గీత ౧౮-౨

కర్త కర్మచేయుటలోఁ గర్తృత్వాభిమానమును గూడ వదలవలయును; ఏలననఁగా సమస్త జీవులు త్రిగుణాత్మక ప్రకృతి గుణములకు దాసులు. అవి బలాత్కారముగఁ బ్రాణులచే ననిచ్ఛచేనైనను కర్మలొనర్చునట్లు చేయఁగలవు. అప్పుడు కర్తృత్వాభిమాన మెక్కడిది? ఇఁక మూఁడవ సోపానము, సమస్త కార్యములను భగవదర్పణ బుద్ధితోఁ జేయవలయును. కర్మఫలములను భగవంతున కర్పింప వలయును. (గీత ౯-౨౭) యందు శ్రీకృష్ణుఁడు స్పష్టముగ నిట్లు చెప్పెను:- "జీవి యేమి చేసినను, తిన్నను, హోమము చేసినను, దానమొనర్చినను, తపస్సు చేసినను వీటి నన్నిటిని భగవదర్పణము కావింపవలెను. అట్లు చేయువాఁడు శుభాశుభ ఫలముగల కర్మబంధమునుండి బయటపడ గలఁడు." ఈ విధముగఁ గర్మయోగము చేయవలయును. అజ్ఞుఁడు, పండితుఁడు చేయు కర్మలలో భేదమిదియే. అజ్ఞుఁడు ఆసక్తితోఁ గర్మల నాచరించును. జ్ఞానసంపన్నుఁడగు వాఁడు ఆసక్తి రహితముగఁ గార్యాచరణము చేయుచుఁ గర్తవ్య బుద్ధిచే, "లోక సంగ్రహ" నిమిత్తమె చేయును. (౩-౨౫) "లోక సంగ్రహము" అను శబ్దము గీతయొక్క ఒక విశిష్ట సారగర్భితమగు శబ్దము. లోకకార్యములను యథారీతిగ నిర్వహించుటయే ఈశబ్దము యొక్క అభిప్రాయము.

సంక్షేపముగ కర్మ, ఫలముల విషయములో నాల్గు సిద్ధాంతములు కలవు :— (౧) ఆలస్యవశమున ఫలాకాంక్షను జెందకుండుట. దానికొఱకు కర్మలనాచరింపకుండుట. ఈ ప్రాకృత జనసమ్మత మార్గము నికృష్టము, నింద్యము, హేయము. (౨) ఫలాకాంక్ష కలిగియుండుటయు, తదుచిత కర్మల నాచరించుటయు నిది 'సకామ' మార్గము. దీనియందు కర్మబంధము కలదు. (3) ఫలము లవసరము లేకపోవుటచే ఆకాంక్ష లేకపోవుట, కర్మలు చేయకుండుట. ఇది నిష్కామ మార్గమేకాని దీనియందు లోకయాత్రా నిర్వాహము సరిగాలేదు. (౪) ఫలాపేక్ష లేకుండుట, అయినను గర్మలనొనర్చుట ఇదియే గీతాసమ్మతమగు కర్మయోగము. దీనిలో ద్వితీయ తృతీయ మార్గముల అభిప్రాయములకు సమన్వయము కలదు. 'ఫలాకాంక్ష భావము అనఁగా ఫలమును గోరకుండుట యనునది తృతీయమార్గము నుండి గ్రహింపఁబడినది.' 'కర్మ నిష్పత్తి' ద్వితీయమార్గమునుండి గ్రహింపఁ బడినది. ఈ యుభయవిలక్షణ మార్గములను సమన్వయించు సుచారుయోజనను జేయుటలోనే గీతయొక్క విశిష్టత కలదు.

నిజమైన కర్మయోగియగుటకు జ్ఞానము, భక్తి ఇవి మిక్కిలి యావశ్యకములు. కర్మలయందు కర్తృత్వాభిమానము వదలుట జ్ఞానికే సాధ్యము కాఁగలదు. ఈశ్వరుని యందు కర్మసమర్పణ కావించుట భక్తి ప్రవణ చిత్తము గలవానికే సాధ్యము కాఁగలదు. గీత జ్ఞానమార్గముయొక్క గొప్పతనము నంగీకరించు

౨ గీత : జ్ఞానయోగము

చున్నది. కాని దాని జ్ఞానయోగము ఇతర జ్ఞానమార్గమునకు విలక్షణమైనది. జ్ఞానవాదులు (సాంఖ్యులు) దేనిని మోక్ష ప్రాప్తికి సాధన మని చెప్పుదురో అది చిదచిత్తుల (ప్రకృతి పురుషుల) యొక్క వివేకజ్ఞానమే; కాని గీతా సమ్మతమగు జ్ఞానము ఆత్మైక్యము యొక్క సంపూర్ణానుభవము. ఈ జ్ఞానమునకు రెండు దిశలు కలవు (ఉ-రేశా). సర్వభూతములలో ఆత్మను దర్శించుట (సర్వభూతస్థ మాత్మానం) ఇదియొక దిశ. దీనిలో సర్వభూతములు ఆధారముగను, ఆత్మ ఆధేయమై యున్నవి. కాని యీజ్ఞానము మాత్రమే ఆత్మైకత్వ ఉన్నతభావమునకుఁ జాలదు. దీనికి మఱియొక దిశకూడ కలదు. ఆత్మయందు సమస్త భూతములను జూచుట. (సర్వభూతాని చాత్మని) ఇందులో ఆధారభూతమగు నాత్మయందు ఆధేయభూతమగు సర్వభూతములను ననుభవమునకుఁ దెచ్చుకొనవలెను. గీతాజ్ఞానమున కీ దిశలు రెండును బరస్పర పూరకములు. ఇట్టి వానిని 'సమదర్శనుఁ' డందురు. 'సర్వభూతస్థ మాత్మానం' ఈ దృష్టాంతము ప్రపంచములో సర్వత్ర లభించు చున్నది. కాని 'సర్వభూతాని చాత్మని' ఈ దృష్టాంతమును భగవానుఁడు అర్జునునకు తన దేవదుర్లభమగు విరాడ్రూపమందుఁ జూపించెను. ఒక్క విరాడాత్మలో నొకానొక స్థలమున ననేకముగ విభక్తమైన కృత్స్న జగత్తును అర్జునుఁడు దివ్యచక్షువుచేఁ గాంచెను. విరాడ్రూపమును జూపించుటయొక్క యుద్దేశ్యము 'ఏకస్థం కృత్స్నం జగత్' ను బ్రత్యక్షముగఁ జూపించుటలోఁ గలదు. అప్పుడు అర్జునుని యొక్క ఆత్మైకత్వ జ్ఞానము యథార్థమయ్యెను. సర్వమును

వాసుదేవమయముగఁ గాంచి, స్థూలము మొదలు సూక్ష్మము వఱకు సమస్త ప్రాణులయందును ఒకే అంతర్యామిని సాక్షాత్కరించుకొనఁ గలిగిన నిజమగు జ్ఞాని చాల దుర్లభుఁడు. ( వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః ౭-౧౯). ఇట్టి సమదృష్టి కలవాఁడు విద్యావినయసంపన్నుఁడగు బ్రాహ్మణుని యందును, గోవునందును, ఏనుఁగునందును, కుక్కయందును, చండాలుని యందును సమదృష్టి కలిగి యుండును. (౫-౧౮). 'సమదర్శనః' శబ్దమును ప్రయోగించి గీత సమస్త ప్రాణుల యెడల నొకే విధమగు వ్యవహారము చేయుట, సమవర్తి యగుటను నిషేధించుచున్నది. దీనిని మాత్రము మఱవరాదు.

(3) గీత; ధ్యానయోగము

గీత ధ్యానయోగమును గూడ చెప్పినది. ఆఱవ అధ్యాయమందు ధ్యానయోగము యొక్క విశదవర్ణనము ఉపనిషత్పద్ధతి ననుసరించి కలదు. ఈ వర్ణనమందు శ్వేతాశ్వతర ( ౨-౮-౧౫ ) ఉపనిషత్తులోని ఛాయలు కొన్ని కలవు. చంచల మానసము నేకాగ్రము కావించుటకు ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారాది సమస్త యోగసాధనలను గూర్చిన యుపదేశము గీత యిచ్చుచున్నది (౬-౧౧-౧౮). కాని ధ్యానముద్వారా ఏకసంస్థమైన చిత్తమువలన నుపయోగ మేమి? అఖిలాధారుఁ డగు భగవానునకుఁ దన్ను సమర్పించుకొనుటయే. విషయపంకముచే నశుద్ధము, కలుషితమైన చిత్తము నెట్లు భగవంతునకు సమర్పింపఁ గలవు? కాని ప్రాణాయామాదులచేఁ బరిష్కృతమైన శుద్ధ చిత్తమును మాత్రమే భగవంతున కర్పింపవలయును. గీత (౬-౩౧) యిట్లు

చెప్పుచున్నది. ఏ యోగి యేకత్వభావనచేసి సర్వభూత హృదయాంతర్వర్తి యగు పరమేశ్వరుని భజించుచున్నాఁడో అతఁడే స్థితిలో నున్నను భగవంతునితో నున్నవాఁడే. గీత శుష్క-ధ్యానమును బోధింపదు. గీతానుసారముగ ధ్యానయోగము యొక్క ఉపయోగము ఏకాగ్రచిత్తముతో సర్వత్ర సర్వదేహములందును సర్వవ్యాపకుఁడుగ నున్న భగవంతుని భజించుటలోఁ గలదు. (౬-౨౮) భగవంతుఁడు (౬-౪౬) యోగి తపస్వుల కంటెను, జ్ఞానుల కంటెను, కర్మమార్గావలంబుల కంటెను శ్రేష్ఠుఁడని చెప్పుచు యోగివి కావలసినదని యుపదేశించెను. యోగులలో యుక్తులనియు, యుక్తతములనియు రెండురకముల యోగులు కలరు. జ్ఞాన విజ్ఞానములచేఁ దృప్తిచెందిన అంతఃకరణము కలిగి మట్టిని, రాతిని బంగారమును సమానముగ భావించు జితేంద్రియుఁడు, వికార రహితుఁడు నగు యోగి 'యుక్తుఁ' డనఁబడుచున్నాఁడు. (౬-౮) కాని యీ యుక్తులగు యోగులలోఁ దన యంతరాత్మను భగవంతుని యందుంచి, పూర్ణశ్రద్ధనుంచి భగవంతుని నిరంతరము భజించువాఁడు యుక్తతముఁడని పిలువఁబడుచున్నాఁడు.

శ్లో॥ యోగినామపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా ।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥ గీత ౬-౪౭

ధ్యానయోగము యొక్క సిద్ధాంత మిదియే. భగవంతుని శ్రద్ధాభక్తులతో అంతర్నివిష్ట హృదయముతో భజింపక చేయు ధ్యానయోగము కేవలము శారీరక వ్యాయామము మాత్రమే.

అది శరీర శ్రమకొఱకే. కావున గీతకు ధ్యాన భక్తులయొక్క సామంజస్య మభీష్టము.

(౮) గీత, భక్తియోగము

భక్తియోగము గీతాజ్ఞానమునకు అమృతఫలము. ఇది సమస్త విద్యలకును రాజు (రాజవిద్యా) సమస్త రహస్యములకు రహస్యమైనది. (రాజగుహ్యము ౯-౨) గీత యొక్క హృదయమును భక్తి. వివిధ సాధనలను గూర్చి విచారింపఁగా భక్తి సంపుటితముగాక యేసాధన చేసినను అది మోసము, అపూర్ణము కాఁగలదను నిశ్చయమునకు రాఁగలుగుదుము. విశ్వరూపమును జూపించిన తర్వాత శ్రీకృష్ణుఁ డిట్టిదానిని దర్శించుటకు సాధనమును జెప్పుచు నిట్లనెను:- "ఈ దేవ దుర్లభరూపమును వేదము ద్వారాకాని, తపస్సు వలనఁగాని, దానముచేఁగాని ఇజ్య (యజ్ఞము) చేఁ గాని సాక్షాత్కారము చేసికొన వీలులేదు (౧౧-౫౩). దీని కొక్కటే సాధనము కలదు. అది అనన్య భక్తి. దీనిద్వారా జీవుఁడు భగవఁతునిఁ బ్రత్యక్షముగఁ జూడఁగలఁడు. తత్త్వతః తెలిసికొనఁగలఁడు. ప్రవేశింపఁగలఁడు. భగవంతునితో నైక్యము చెందఁగలఁడు (౮-౨౨; ౧౧-౫౪). కాని అనన్యభక్తి యని దేని నందురు? గీత యీ తత్త్వము నీ శ్లోకములోఁ దెలిపెను —

శ్లో॥ మత్కర్మ కృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః।
నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాండవ॥ ౧౧-౫౫

యజ్ఞ, దాన, తపములు మొదలగు కర్తవ్యకర్మల నన్నిటిని భగవానునివే యని భావించుచుఁ జేయువాఁడును, భగవంతుఁడే పరమాశ్రయుఁడని తలఁచి ఆతనిని బొందుటకు సతతము

ప్రయత్నించు (మత్పరమః) వాఁడును, భగవంతునియందు నిజమగు భక్తి కలిగి యుండువాఁడును, ఆసక్తి రహితుఁడును, సమస్త ప్రాణులందును వైరభావము లేనివాఁడును, అనన్యభక్తుఁడని చెప్పఁబడు చున్నాఁడు. ఇట్టి భక్తికి ఫలము భగవత్ప్రాప్తియే. గీత సకామ (౯ అ. ౨౦, ౨౧ శ్లో.) ఉపాసన, నిష్కామ ఉపాసన* (౯—౨౨) వీని భేదముల నంగీకరించి, వీనిలో నిష్కామోపాసనయే శ్రేష్ఠమని చెప్పఁబడినది. (౯ అ. ౨౬, ౨౭) అది నిరాకారోపాసన మిక్కిలి క్లేశకరమని చెప్పి (౧౨ అ. ౫ శ్లో) సగుణోపాసననే ఉపదేశించుచున్నది (౧౨అ. ౬, ౭శ్లో). గీతలోఁ జెప్పఁబడిన భక్తియోగమునకు అన్యసాధనములకు అవిరోధమే కనఁబడుచున్నది. ఆర్త, జిజ్ఞాసు, అర్థార్థి భక్తులకంటె జ్ఞానిభక్తుఁడు చాల శ్రేష్ఠుఁడు. జ్ఞానిభక్తుఁడు భగవంతున కాత్మస్వరూపుఁడు. (జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ — ౭-౧౮) కావున సర్వశ్రేష్ఠుఁడు. (తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏక భక్తి ర్విశిష్యతే) (౭-౧౭).

ఈ విధముగ గీత భిన్నభిన్న మార్గములందు సమన్వయమును ప్రదర్శించి సాధనమార్గమును సుగమముగను సులభము

---

* 'ఉపాసన' శబ్దమునకు తాత్పర్యమును శంకరాచార్యులవారు సుబోధ శబ్దములతోఁ జెప్పియుండెను — "ఉపాసనం నామ యథాశాస్త్రం ఉపాస్యస్య అర్థస్య విషయీకరణేన సామీప్య ముపగమ్య తైల ధారావత్ సమాన ప్రత్యయ ప్రవాహేణ దీర్ఘ కాలం యదాసనం తదుపాసన మాచక్షతే" అనఁగా నుపాస్య వస్తువును శాస్త్రోక్త విధితో బుద్ధికి విషయమును గాఁ గావించి దాని దగ్గఱకుఁజేరి తైలధారవలె సమానవృత్తి ప్రవాహముచే దీర్ఘ కాలము వఱకు దానియం దుండుటకు ఉపాసన యందురు.

— చూడుఁడు గీ. ౧౨-3 మీఁద భాష్యము.

౨౫ సమన్వయ మార్గము

గను నొసఁగ్చును. గీతా అభిప్రాయము నను సరించి కర్మ, జ్ఞాన, ధ్యాన, భక్తి యోగ ములు భినభిన్న స్వతంత్ర సరణులు గాక ఒకే మార్గములోని విభిన్న మజిలీలు. ఆధ్యాత్మిక పథికుఁడు వీటిని దాఁటవలసిన యవసరమున్నది. పదునెనిమిదవ అధ్యాయమందు ఈ మార్గముల యొక్క పరస్పర సామంజస్యము సంక్షేపముగఁ జెప్పఁబడినది. గీత యొక్క సాధన మార్గముయొక్క ఆరంభము నిష్కామ కర్మతోఁడను, పర్యవసానము శరణాగతితో నయ్యెను. నిష్కామ కర్మ చేయుట చేతను, నియమముగ ధ్యాన మొనర్చుటచేతను సాధకుఁడు బ్రహ్మభావమును బొందఁగలఁడు. ఈ దశలో నాతఁడు ప్రసన్నచిత్తుఁడై సమస్త ప్రాణులను సమభావముతోఁ జూచును ( ౧౮ అ. ౫౧-౫౩ ). ఇట్టి బ్రాహ్మీస్థితి కలుగఁగానే సాధకుఁడు పరాభక్తి - పరమేశ్వరునియందు ఉత్కృష్ట భక్తిని బ్రాప్తించును (౧౮-౫౪). భక్తి ఉదయించఁగానే ఆతఁడు 'పర జ్ఞానము ' న కధికారి యగును. వీని ద్వారా ఆతఁడు భగవంతుని స్వభావమును, స్వరూపమును (యశ్చాస్మి) విభూతులను, గుణ ములను (యావాన్) యథార్థముగ నెఱుంగఁగలఁడు. దీనికి ఫలము భగవత్ప్రవేశము. ఈశ్వరోపలబ్ధి (౧౮-౫౫). కాని యీ యంతిమఫలమునకు ప్రపత్తి మిక్కిలి అవసరము. హృదయ స్థితుఁడును నంతర్యామియు నగు నీశ్వరుని శరణువేఁడి సర్వధర్మము లను బరిత్యజించుటయే గీతయొక్క 'సర్వగుహ్యతమ ' జ్ఞానము. స్వరూపతః పరిత్యాగము కావింపక, ఈశ్వర సమర్పణ బుద్ధితో దానినిఁ జేయవలయును. (౧౮-౬౬) ప్రపత్తిమార్గము అన్య

మార్గములయొక్క ఒక నైసర్గిక పర్యవసానము. గీతయొక్క గుహ్యతమ జ్ఞాన మిదియే!

శ్లో॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు ।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥ గీత, ౯-౩౪.

గీతాసాధన మార్గమును దెలిసికొనుటకీ శ్లోక మత్యంత మహత్వపూర్ణమైనది. కొంచెము పాఠభేదముతో నీశ్లోకము గీత యందు రెండుసారులు వచ్చినది. (౯-౩౪; ౧౮-౬౫) ఒక విధముగా గీతాసారమిదియే. దీని తాత్పర్యమేమనఁగా నెన్ని విభిన్న సాధనలున్నను ఈశ్వరుఁడు దాని కేంద్రములో స్థిరముగ నుండును. దానిని లక్ష్యములోఁ బెట్టుకొనుటచే విభిన్న సాధనల యొక్క సామంజస్యము కనఁబడు చున్నది. శ్లోక తాత్పర్య మేమనఁగా:- మనస్సు లగ్నముచేయవలెను (భగవంతునియందు) (జ్ఞానయోగము). భక్తిచేయవలెను (భగవానుని) (భక్తియోగము). యజ్ఞము చేయవలెను (భగవంతునికొఱకు) (కర్మయోగము). ఆశ్రయింపవలెను (భగవంతుని) (శరణాగతి). ఈ విధముగ వివిధ విధములగు మార్గములు భగవన్నిష్ఠ వలననే అవిరోధ మగుచున్నవి. గీతాకారుఁడు "మత్పరాయణః" శబ్దమును శ్లోకమందుంచి, దానిని 'సర్వగుహ్యతమం వచనం' అని (౧౮-౬౪) శరణాగతి యొక్క శ్రేష్ఠత్వమును స్పష్టముగఁ బ్రతిపాదించి యుండెను.

ఈ సాధనలవలనఁ గలుగు ఫలములను గూడ గీత విస్తారముగ వర్ణించియుండెను. ఆత్మ నెఱిఁగిన వానిని, పరమాత్మతో

(౬) సిద్ధావస్థ

నైష్కర్మ్యమును సాధించిన జ్ఞానిని గీత వేఱు వేఱు నామములతో నిర్దేశించినది. అతఁడు స్థితప్రజ్ఞుఁడు (౨-౫౨) భక్తుఁడు (౧౨-౧౩) త్రిగుణాతీతుఁడు (౨.౭౨) బ్రహ్మభూతుఁడు (౧౮-౫౪) అని పిలువఁబడుచున్నాఁడు. సాధనలకుఁ బరమ లక్ష్యము చరమ తత్త్వము యొక్క అపరోక్ష జ్ఞానము. ఇది జ్ఞానమార్గము వలనను, భక్తిమార్గము చేతను, సాంఖ్యము వలనను సమభావముగఁ బ్రాప్తించును. కావున గీత యందు సిద్ధపురుషునకు భిన్నభిన్న నామము లీయఁబడినవి. కాని తత్త్వ మొక్కటియే. సిద్ధపురుషుఁడు సమస్త ప్రాణుల యెడల నద్వేష్టిగాను, అన్ని నిస్స్వార్థముగఁ బ్రేమించువాఁడు గాను, దయాళువుగాను, మమతాహంకార రహితుఁడుగాను, సుఖదుఃఖములందు సముఁడుగను, శాంతచిత్తుఁడుగను, ఓర్పు గలవాఁడుగ నుండును (౧౨-౧౩). ఆతఁడు తన కోరికలను త్యజించును. ఆత్మవలన నాత్మలో సంతుష్టిని జెందును. దుఃఖమందు ఉద్వేగమును జెందఁడు. సుఖములు కలిగినపుడు స్పృహ చెంది యుండఁడు, సర్వత్ర ఆత్మస్వరూపమును గాంచుటచే రాగ, భయ క్రోధముల కాతఁడు దూరముగనే యుండును. ఇట్టి వానినే స్థితప్రజ్ఞుఁడనియు, స్థితధీయనియు, ప్రతిష్ఠిత ప్రజ్ఞుఁడనియు నందురు. గీతామతానుసారముగ మానవ జీవితాదర్శ మిదియే. సఫల జీవితమును బొందుట కిదియే కీలకము. ఉపనిషత్తులలోని 'జీవన్ముక్తుని' ఆదర్శములో నింతకంటెఁ జక్కని సరళ వర్ణనము దొరకునా ?

భగవంతుని స్మరించుచు నీ సంసారయుద్ధమందు ప్రవృత్తుఁడై, తన సమస్త ధార్మిక, సామాజిక కర్తవ్యములను నెఱవేర్చుచు 'మామనుస్మర యుధ్య చ' అను నీ గీతోపదేశము నేఁడు కూడ మహాభారత కాలమందువలె యుపయోగముగను, నుపాదేయముగ నున్నవి. భారతీయ ధర్మ, దర్శనములయొక్క—ప్రామాణిక, ప్రాంజల, సరళ, సరస సారాంశ మేమనఁగా శాస్త్రము దీని నధ్యయనము చేయుమని చెప్పుచున్నది. శాస్త్ర విస్తారమువలన లాభమేమున్నది. గీతను సుగీతగా నొనర్పవలయును. (గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్రవిస్తరైః. గీతామాహాత్మ్యము) గీతాజ్ఞానము పుణ్య సలిలయగు గంగవలె పావనమును, పవిత్రమును, కలికల్మష నాశనము నై యున్నది. దీనిలో స్నానమాడిన వాఁడెవఁడు విధూతపాపుఁడు కాఁడు? గీతాకల్పద్రుమ శీతలఛాయ నాశ్రయించిన వాని కెవనికి మనోవాంఛ సఫలముకాదు?



శ్రీ రామ శరణ్

# కుందుర్తి వేంకటనరసయ్యాగారి గ్రంథములు

## శ్రీరామ మంత్రానుష్ఠానము

ఇది శ్రీరామ మంత్రోపాసకులకు పనికివచ్చు అత్యుత్తమ మగు ప్రసిద్ధ గ్రంథము. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, గీతావాణి, మోక్షసాధని, రామదర్శనం వగైరా పత్రికలచేతను, అనేకులగు పండితులు, ఉపాసకులు, మంత్ర శాస్త్రజ్ఞులచేతను ప్రశంసింపఁబడిన మహోత్కృష్టమగు గ్రంథరాజము. వెల 2-8-0

## కలి సంతరణోపనిషత్తు

కలియుగములో భగవన్నామ సంకీర్తనకు మించిన సాధన లేదు. ఈ ఉపనిషత్తునకు ప్రతిపదార్థము, తాత్పర్యము, వ్యాఖ్యానము వ్రాయఁబడినది. వ్యాఖ్యానములో వేదములు, ఉపనిషత్తులు, వివిధ శ్రుతి, స్మృతి పురాణేతిహాసములలోని భగవన్నామప్రశస్తిని గూర్చి యెచ్చట ప్రదర్శింపఁబడినదో చక్కగ నిరూపింపఁబడిన గ్రంథరాజము. దీనికి తోడుగా హరినామమహిమ, రామనామ మహిమ, కృష్ణనామ మహిమ ప్రదర్శింపఁబడుటయేగాక దశ నామాపరాధములు విపులముగఁ జర్చింపఁబడినవి. వెల 1-0-0

## సంకీర్తన మీమాంస

కలియుగములో ముఖ్యతరణోపాయము సంకీర్తనము. "కలౌ సంకీర్త్య కేశవ" మ్మని శాస్త్రములు ఘోషించుచున్నవి. అట్టి సంకీర్తనమును గూర్చి తెలిసికొనవలయు ననిన మా సంకీర్తన మీమాంసను తప్పక చదువవలెను. ఇందు సంస్కృత సూత్రములు, విపులమగు వ్యాఖ్యానము కలదు. భక్తులచేతను, పండితులచేతను ప్రశంసింపఁబడినది. వెల 1-0-0.

# పరమార్థ తత్త్వము

పరమార్థతత్త్వమిందు సప్రమాణముగ వివరింపఁ బడినది. సగుణ నిర్గుణ తత్త్వము, ప్రణవము, రమూఽచ్యుత, సీతారామ, రాధికాకృష్ణ హరేరామనామమును గూర్చి విపులముగ అక్షర సాంఖ్యము ననుసరించియు వివరింపఁ బడినది. అక్షర సాంఖ్యములోఁ గల విచిత్ర విషయములిందు సప్రమాణముగ వివరింపఁ బడినవి. వెల 0—12—0

# అర్థపంచకము

ప్రతి ఉపాసకునకు అయిదు విషయములు తెలియవలెను. భగవత్తత్త్వము, జీవతత్త్వము, మోక్షస్వరూపము, సాధన స్వరూపము, విరోధిస్వరూపము అను నీ యైదు తత్త్వములను గూర్చి చర్చింపఁ బడినది. శ్రీరామోపాసకుల కిది అత్యంతావశ్యకమైన గ్రంథము. భక్తిమార్గ నిష్ఠుల కందఱకిది పరమోపయోగకరమైనదనుటకు సందేహము లేదు. వెల 0—12—0

# మహా సంకీర్తన

గ్రంథమున సామాన్యముగఁ బ్రచలితముగ నున్న నామములు, తరంగ, అష్టపద, రామదాస, నరసదాస, మీరాబాయి, కబీరు, నానక్ వగైరా భక్తులు పాడు రసవత్తరమైన కీర్తనలు కలవు. మన ఆంధ్రదేశమున సుప్రసిద్ధ విరాగ భక్తపుంగవులును, తన మధుర మహాసంకీర్తన గానముచే అశేషజనముల హృదయములు పులకరింపఁజేసిన శ్రీపూజ్య సీయా రఘువరదాసుగారు పాడెడు కీర్తన లిందు గలవు. వెల 0—10—0

## శ్రీరామనామ ప్రభావము

శ్రీరామనామ ప్రభావమునుగూర్చి విపులముగఁ దెలిసికొనవలయుననిన ఈ గ్రంథమును జదువవలెను. శాస్త్రీయముగ ప్రణవమునకును, రామనామమునకును భేదము లేదని నిరూపింపఁబడినది.

వెల 0 - 6 - 0

## నవవిధ భక్తులు

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అను నీ తొమ్మిది భక్తిమార్గములను గుఱించి చెప్పఁబడుటయేగాక, ఆ యా భక్తిమార్గములను ప్రధానముగ గైకొని తరించిన భక్తులను గూర్చియు, జీవితములో క్రమసాధన యెట్లు చేయవలసినదియు, దినచర్య, మందిరనిర్వహణాది యనేక విషయము లిందు గలవు. భక్తిమార్గనిష్ఠులకిది అత్యంతావసరమైన గ్రంథము.

వెల 1 - 8 - 0

## భారతీయ దర్శనము [ప్రథమ ఖండము]

భారతదేశము వేదాంతశాస్త్రమునకుఁ బుట్టినిల్లు. ఇచ్చట ననేక దర్శనము లుద్భవించినవి. అన్నియును భగవంతుని జేరుటకు మార్గములే. అయితే విభిన్నమార్గములద్వారా భగవంతుని జేరు మార్గము లొక్కొక్క యాచార్యుఁడు ప్రచలితము కావించినాఁడు. ఇట్టి గ్రంథమును శ్రీ బలదేవ ఉపాధ్యాయ, ఎం. ఏ. పి. హెచ్. డి. లిట్, హిందూ విశ్వవిద్యాలయము వేదాంత పండితులు రచించిరి. — దానిని శ్రీ రామశరణ్‌గారు అనువదించిరి. శ్రీ రాధాకృష్ణపండితునిచే ప్రశంసింపఁబడినది.

వెల 1 - 8 - 0

## భగవన్నామ ప్రభావము

కలియుగములో భగవన్నామమునకు మించిన సాధన లేదు. భగవన్నామములో నెంతటి ప్రభావమున్నదో అది యీ గ్రంథమున నిరూపింపఁబడినది. కృతయుగమున ప్రహ్లాదుఁడు త్రేతలో ఆంజనేయాదులు, ద్వాపరమున శ్రీ వ్యాసాదులు, కలియుగమున శంకర రామానుజ, త్యాగరాజు, తులసీదాసు, తుకారాం, కబీరు రామకృష్ణపరమహంస మొదలగు భక్తులు భగవన్నామమును గూర్చి చెప్పిన విషయము లిందుగలవు.

రు. 0—4—0

## శ్రీ చైతన్య చరితావళి (౧వ భాగము)

శ్రీ చైతన్యస్వామివారు అవతారమూర్తులు. భారత దేశమునకు ప్రేమ భక్తి చైతన్యమును గలిగించి సంకీర్తనమునకుఁ బ్రాముఖ్యత నొసంగిన మహాత్ములు. వీరి చరిత్రమును విపులముగ శ్రీ ప్రభుదత్తజీబ్రహ్మచారిగారు అయిదు భాగములలో రచించిరి. దానిని శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకట నరసయ్యగారు అనువదించిరి.

రు. 3—0—0

## భాగవత కథ (ప్రథమ భాగము)

శ్రీ ప్రభుదత్తజీబ్రహ్మచారిగారు 'భాగవత చరిత' యను భాగవతగ్రంథమును పోతనగారు తెలుఁగున రచించినట్లు రచించిరి. దానికి వ్యాఖ్యానరూపముగ నిప్పటికి 60 భాగములను వారు హిందీలో రచించి ప్రకటించిరి. వారి యాజ్ఞచే నా గ్రంథములన్నియు ననువదింప బడుచున్నవి. అందు ప్రథమభాగ మిది. అమృతము లొలుకు పలుకులు. మిగిలిన భాగములను గ్రమముగ బ్రకటించుచున్నాము.

రు. 2—0—0

## శ్రీరామపటలము

శ్రీరామోపాసకులకు ముఖ్యముగ కావలసిన గ్రంథము. సంస్కృత గ్రంథమున కనువాదము. రు. 0–4–0

## బ్రహ్మచర్యము

బ్రహ్మపదార్థమును బ్రహ్మచర్యము చేతనే సాధింపవల ను. బ్రహ్మచర్య మహిమను గూర్చియు, సాధించు పద్ధతిని ్చియు శ్రీ హనుమాన్ ప్రసాద్ప్రోద్దారుగారు హిందీలో చిరి. ఇది ఆ హిందీ గ్రంథమున కనువాదము. రు. 0–6–0

## నరసదాసు కీర్తనలు

నరసదాసు బాల్యమున ఆశువుగ స్వామి సన్నిధానమున కొనిన కీర్తన లిందు గలవు. శ్రీ వాసుదాస సద్గురుస్వామి మీాద కీర్తనలు కలవు. రు. 0–10–0

## శ్రీరామ పూజావిధానము

స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు శ్రీరామపూజను ొనుటకు వీలైనది. ఇందు షోడశోపచారములు శ్రీరామ స్రనామము, సీతా అష్టోత్తరము కలవు. ఈ ముద్రణములో ం శ్రీ ఆంజనేయపూజకూడ ముద్రింపఁ బడినది. రు. 0–4–0

## గురు పూజావిధానము

ఇందు గురుప్రాశస్త్యము కలదు. ఏ గురువునకైనను ౘ చేసికొనుటకు వీలుగా అష్టోత్తరశతనామములతో వ్రాయ ది. ఈ గ్రంథకర్తగారి గురుదేవులగు శ్రీ ఆంధ్రవాల్మీకి ుదాస దేశికస్వామివారి పూజావిధానమును గలదు.

రు. 0–3–0

# తత్త్వత్రయము

ఈసృష్టిలో నెచ్చట చూచినను మూఁడు తత్త్వములు కలవు. పరమాత్మ, ప్రకృతి, జీవుఁడు. మోక్షప్రాప్తినిఁ జెంద వలయుననిన నీమూఁడు తత్త్వములను గుఱించి బాగుగఁ దెలిసి కొనవలయును. యథార్థమున కీమూఁడు తత్త్వము లొకటేయౌ వాసుదేవతత్త్వము. జడచేతనము లన్నిటిలో నీమూఁడు తత్త్వములను జూడవలెను. రు. 0—3—0

# ప్రణవ ప్రభావము

అష్టోత్తర శతోపనిషత్తులను, పురాణాదులను గాలించి ప్రణవమును గూర్చి వ్రాయఁబడినది. వేదాంతతత్త్వ మంతయు నీ ప్రణవ ప్రభావముద్వారా తెలిసికొనవచ్చును. రు. 0—8—0

# ధ్యాన పద్ధతి

ఏమార్గము ప్రకారము భగవదుపాసన చేసినను ధ్యాన మత్యంతావశ్యక మైనది. అట్టి ధ్యానమునుగూర్చి విపులముగ చర్చింపఁబడినది. సగుణ ధ్యానము, జ్యోతిర్ధ్యానము, బిందు ధ్యానము, నిర్గుణ ధ్యానము, నాద ధ్యానము, ధ్యానవిఘ్నములు, ధ్యానమునకు సహకారులు, సమాధి భేదములు మొదలగున వన్నియు నిందు కలవు. రు. 0—8—0

అచ్చుకానున్న గ్రంథములు:— ఘేరండసంహిత (యోగగ్రంథము), భాగవతకథ 2 మొదలు 12 భాగములు, పూజాకల్పకము.

---

వలయువారు:—శ్రీ రామశరణ మందిరము — బుద్ధాం.

యాజెలి (పోష్టు) * (గుంటూరుజిల్లా)

లేక

మేనేజరు:- శ్రీ రామనామక్షేత్రము, గుంటూరు.

...త్రం వాఙ్మయసుధామ్ ! * తరంతు భవసాగరమ్ !

అద్వైత రసపిపాసువులకు అపూర్వావకాశము !

# శంకర గ్రంథ రత్నావళి

## అనువాదకులు : శ్రీ నిర్వికల్పానందస్వామి

( ఉపదేశ గ్రంథములు నలుబది — ప్రథమ సంపుటము )

...0 పేజీలు ]  వెల రు. 3-0-0

శ్రీ శంకరాచార్యులవారి గ్రంథములన్నియు భాష్యములతో, ...లానువాదములతో ఇదే విధముగ 24 సంపుటములలో ...ము క్రమముగ వెలువరింపఁ గలము.

 రెండవ సంపుటము తయారగు చున్నది.

  

# గీతా కదంబము

## అనువాదకుఁడు : శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి

మహాపురాణ ఉపపురాణములలో "గీతలు" అను పేర కొన్ని ఘట్ట... గ్రథితములై యున్నవి. ఇవి సనందనాది బ్రహ్మపుత్రులు, లేక వసిష్ఠ, ...దేవాది మహర్షులు, లేక నారాయణ నారదులు, మరీచ్యాదులకు, మహర్షి లేక సాక్షాద్భగవానుఁడే స్వభక్త శిష్యగణములకు బోధించెను. ఇహ పర ...ణమును బడయుటకు గీతాభ్యాసముకన్న సులభమైన మార్గ మింకొకటి ఆ గీతల నన్నిటిని గీతాకదంబ సంపుటములలో మూలానువాదములతో ...లుగా వెలువరింపఁ దలచితిమి.

...దళము : రు 1-4-0. శ్రీ మద్భాగవతములోని, ౧ గోపికాగీత, ౨ భ్రమర గీత, 3 హంసగీత, ౪ భిక్షుగీత, ౫ అవధూతగీత.

...దళము : రు 1-4-0, ౬ పింగళగీత, ౭ శ్రుతిగీత, ౮ శ్రీరామగీత, ౯ యమ గీత, ౧౦ వేణుగీత, ౧౧ యుగళగీత.

షరా:— పై రెండు దళములు తీసికొనిన రు 2-0-0 లు మాత్రమే.

— సాధన గ్రంథ మండలి, తెనాలి.

# సాధన గ్రంథ మండలి ప్రచురణలు

| | |
|---|---|
| అష్టాదశ శ్లోకగీత | 0_12_0 |
| అర్థపంచకము | 0_12_0 |
| ♦ఆశ్విన మాహాత్మ్యము | 2_ 0_0 |
| ఈశ్వర సాక్షాత్కారము | 0_ 3_0 |
| ఉపాసనీబాబా జీవితము | 1_ 8_0 |
| కల్యాణకుంజము | 1_ 4_0 |
| గురుశిష్యులు (శ్రీరామకృష్ణవివేకానందులు) | 1_ 0_0 |
| గీతాప్రతిభ (2వ కూర్పు) | 0_12_0 |
| గీతాకదంబము ౧ వ. దళము | 1_ 4_0 |
| ,, ౨ వ. దళము | 1_ 4_0 |
| గోవిందదామోదర స్తోత్రము | 0_ 8_0 |
| జడభరతుడు | 0_12_0 |
| *నరసదాసు కీర్తనలు | 0_10_0 |
| పరమసాధన (2వ కూర్పు) | 0_12_0 |
| పరమార్థతత్త్వము | 0_12_0 |
| పద్మపురాణము (ఆదిమఖండం) | 1_ 8_0 |
| ,, (భూమిఖండము) | 2_ 0_0 |
| ,, (బ్రహ్మఖండము) | 1_ 0_0 |
| బదరీయాత్ర (3 వ. కూర్పు) | 1_ 0_0 |
| భగవత్ప్రాప్తి-ఉపాయములు | 0_4_0 |
| భక్తితత్త్వము | 0_12_0 |
| భక్తిరసాయనము | 2_ 0_0 |
| భారతీయ తత్త్వశాస్త్రము | 2_ 0_0 |
| ♦భాగవతకథ | 2_ 0_0 |
| *మానవధర్మము | 1_ 0_0 |
| *ముక్తిగీత | 0_ 6_0 |
| రాధారహస్యము (40 గ్రంథముల సారము) | 1_ 4_0 |
| శంకరగ్రంథరత్నావళి(300 పే) (ఉపదేశప్రకరణగ్రంథములు 40) | 3_ 0_0 |
| *శ్రీరామపూజా విధానము | 0_ 4_0 |
| శ్రీకాళహస్తీశ్వరశతకము | 0_ 8_0 |
| *శ్రీసీతారామ శతకము | 0_ 2_0 |
| *శ్రీత్యాగరాజ చరిత్ర | 0_ 4_0 |
| *శ్రీరామనామ ప్రభావము | 0_ 6_0 |
| శ్రీశుకుడు | 0_12_0 |
| శ్రీత్రిపురాంతకేశ్వరశతకము | 0_ 4_0 |
| *సప్తమహావ్రతములు | 0_ 6_0 |
| సిద్ధాంత కల్పవల్లి | 1_ 0_0 |
| సంకీర్తన మీమాంస | 1_ 0_0 |
| హరినామ మహిమ శతకము | 0_ 4_0 |
| *హిందూకోడ్ బిల్ సమీక్ష | 1_ 0_0 |
| భారతీయదర్శనము (ప్ర. ఖం.) | 1_ 8_0 |

* ఈ గుర్తు గలవి కొలది ప్రతులు మాత్రమే కలవు. ♦ వీటికి కమీషన్ లేదు.

రాబోవు గ్రంథములు : శంకరగ్రంథరత్నావళి 24 సంపుటములు, గీతాకదంబము 10 సంపుటములు, పాతంజల యోగసూత్రములు, భక్తిచంద్రిక, ప్రేమ దర్శనము, శివతత్త్వము.

షరా:_ రు 1 కు లోపు వి. పి లేదు. రు 5/_లకు మించిన ఆర్డరుకు రు 1 కి 0_3_0, రు 25/_ లకు రు 1 కి 0_4_0 లు, రు 100 /_ లకు రు 33/_ లు కమీషను యివ్వబడును. సమర్థులగు ప్రచారకులు కావలయును.

☞ వలయువారు:___ సాధన గ్రంథ మండలి, తెనాలి.